అపరాధ పరిశోధన అనుబంధం—100

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మహారాణి-పీఠపెట్టె

రచన : వసుంధర

## ఒక పుర్రె రెండు ఎముకలు

రచన : ఎమ్.వి.వి. సత్యనారాయణ

## బ్రతకాలంటే పారిపో

రచన : సికిందర్

## మాయాలోకంలో మానవకాంత

రచన : సికిందర్

రక్తం త్రాగే పిశాచం - పదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్— 100
ఏప్రిల్, 1982
వెల: రు. 5-00
ఏడాది చందా: 60 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**ఏ. పీ. మోహన్రావ్**
**వసుంధర**
**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
**క్రాంతి ప్రెస్,**
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మహారాణీ—పీజా పెట్టె

## వసుంధర

ఆమె బీచివద్ద కూర్చుని వుంది. గాలికి కదలాడే కురులను ఒక్కసారి కూడా సవరించుకోవడం లేదు. ఆమె దీర్ఘాలోచనలో వున్నదనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

అతను కొంతదూరం వుండి ఆమెనే పరిశీలిస్తున్నాడు. అతడామెను యథాలాపంగా చూడడంలేదు. అతడి కళ్ళు ఆమెలోని ఎత్తుపల్లాల్ని నిశిత దృష్టితో పరికిస్తున్నప్పటికి వాటిలో కోర్కెకుమించి ఆశ ప్రతిఫలిస్తోంది.

కొంతసేపయ్యాక అతడామెను సమీపించాడు.

ఆమె అతడిని పట్టించుకోలేదు.

"నమస్కారం మేడమ్!" అన్నాడతను.

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగింది. అతడివంక అదోలా చూసింది. అందమైన ఆడవాళ్ళు పలికితే బంగారమవుతుంది. అందుకని వాళ్ళట్టే మాట్లాడరు. ఆమె అతడివంక నువ్వెవరు—అన్నట్లు చూసింది.

"నా పేరు రామం. నాకు మీ పేరు సునంద అని కూడా తెలుసు. మిమ్మల్ని రెండురోజుల క్రితం బజార్లో చూశాను. అప్పట్నించి ఓసారి కలుసుకుని మాట్లాడాలని ప్రయత్నం. ఇప్పటికి సిద్ధించింది—" అన్నాడతను.

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఏం మాట్లాడతానన్నట్లు చూసింది.

"కూర్చోమంటారా?" అన్నాడు రామం.

ఆమె కూర్చోమనలేదు. కానీ అతడు కూర్చున్నాడు.

సునంద ఇబ్బందిగా ముఖం పెట్టింది.

"మీరు బియ్యే సెకండియర్ చదువుతున్నారు. నేను బియ్యే ప్యాసై మూడేళ్ళయింది. ఈ ఊళ్ళోని థియేటర్ కళ్యాణి మాదే!"

అప్పుడామె కళ్ళలో రవంత కుతూహలం కనబడింది.

"నాన్న నాకా థియేటర్ వదిలేస్తానంటున్నాడు. మా అన్నయ్యకు రాజమండ్రిలో క్రూసిబుల్ ఫ్యాక్టరీ వుంది. మాకింకా చాలా వ్యాపారాలున్నాయి. థియేటర్ చూసుకుందామా, మరేదైనా వ్యాపారం చూసుకుందామా అని ఆలోచిస్తూ ఇంకా ఏదీ తేల్చుకోలేదు. ఎందుకంటే ఈ విషయంలో కాబోయే భార్య సలహా తీసుకుందామని ఆగాను. అన్నట్లు నాకింకా పెళ్ళి కాలేదు...."

సునంద ఇంకా నోరు విప్పలేదు. ఇంకా చెప్పమన్నట్లు చూసింది.

"పెళ్ళి చేసుకోమని నాన్నా బలవంత పెడుతున్నాడు. ఎందరో ఆడపిల్లల తండ్రులూ బలవంత పెడుతున్నారు. కానీ నేనే ఒప్పుకోవడంలేదు. నాకు నచ్చిన పిల్లను నేనే వెతుక్కుంటానని బయల్దేరాను....అయితే పని గట్టుకుని

ఇదే చూడడంలేదు. రెండ్రోజుల క్రితం మిమ్మల్ని బజార్లో చూశాను...."

అప్పటికి సునంద నోరు విప్పింది — "అయితే ఏమంటారు?"

"మీరిష్టపడితే మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటాను—అహ అలా కోపంగా చూడకండి — మీ పెద్దవాళ్ళు, మా పెద్దవాళ్లు మాట్లాడుకున్నాకనే అన్నీ అవుతాయి. అన్నింటికంటే ముందు నాక్కావలసింది మీ అభీష్టం తెలుసుకోవడం. మీరిష్టపడ్డానని ఒక్కమాట చెబితే— పెళ్ళయ్యేవరకూ మళ్ళీ మిమ్మల్ని కలుసుకోనని హామీ కూడా యిస్తాను...." అన్నాడు రామం.

"మీరు చెప్పడం అయిందిగదా—ఇంక నేను చెప్ప వలసింది కూడా వుంది. వింటారా?" అంది సునంద.

"చెప్పండి!" అన్నాడు రామం ఉత్సాహంగా.

"నేను మీ ధైర్యాన్ని అభినందిస్తున్నాను. సాధా రణంగా ఆడవాళ్ళ ఎదుటపడి ఇలా చెప్పగల ధైర్యం ఎంతోమంది మగవారికుండదు. ఆ ధైర్యానికి కారణం మీ ప్రేమ బలమే అయియుండవచ్చును. నేనంటే ఇష్టపడే వాడికి బలమైన ప్రేమ వుండాలన్నది నా అభీష్టం—" అంది సునంద.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్!" అన్నాడు రామం.

"నేను నా అభీష్టం చెప్పాను తప్పితే మిమ్మల్ని మెచ్చుకోలేదు. మీకు బలమైన ప్రేమ వున్నదో లేదో తెలుసుకోడం కోసం నేను మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు వేస్తాను. మీరు నన్నెంత సూటిగా అడిగారో నేనూ మిమ్మల్ని అంత సూటిగా అడుగుతాను. ఏమీ అనుకోరు

గదా!" అంది సునంద.

"అడగండి—" హుషారుగా అడిగాడు రామం.

"నా కోసం మీరు ఏమైనా చేయగలరా?"

"చేయగలను ..."

"బాగా ఆలోచించుకుని మరీ చెప్పండి!" అందామె.

"మీ విషయంలో ఇంక ఆలోచన లేదు-" అన్నాడు రామం.

"నేను సముద్రంలో దూకమంటాను...."

"దూకేస్తాను...."

"మంచు పర్వతాల్లో ఉన్నిబట్టలు లేకుండా తిరగమంటాను...."

"తిరుగుతాను...."

"సింహంతో వట్టి చేతుల్తో పోరాడాలంటాను...."

"పోరాడతాను...."

"నేను సీరియస్‌గా చెబుతున్నాను. బాగా ఆలోచించే మాట్లాడుతున్నారా?"

"నేనూ సీరియస్‌గానే చెబుతున్నాను...."

"అయితే నేను చేసిన హత్యకు మీరు హంతకుడినని చెబుతారా?" అన్నదామె.

రామం ఉలిక్కిపడ్డాడు. అతడికి బదులు దొరకలేదు.

"ప్రశ్న మరోసారి అడుగుతాను. హత్య నేను చేస్తాను. హంతకుడు మీరని చెప్పాలి...."అంది సునంద.

రామం ఏమనాలో తెలియక ఊరుకున్నాడు.

"తొందరేం లేదు. బాగా ఆలోచించుకుని నెమ్మదిగా జవాబివ్వండి. నేను రేపు మళ్ళీ బీచికి వస్తాను—" అంటూ లేచి నిలబడిందామె.

రామం దీర్ఘాలోచనలో పడ్డాడు.

# 2

మర్నాడు సరిగ్గా అదే సమయంలో రామం, సునంద బీచివద్ద కలుసుకున్నారు. ఆమె ఆశ్చర్యంగా— "వచ్చారేం?" అంది.

"మీరు చెప్పిన హత్య గురించిన వివరాలు తెలుసుకోవాలను కుంటున్నాను—" అన్నాడు రామం గంభీరంగా.

"హత్య ఇంకా జరగనిదే వివరాలేం చెప్పగలను?" అందామె.

"కానీ నిన్న మీరు హత్య ప్రసక్తి తీసుకుని వచ్చారు!" అన్నాడతను.

"అవును. నేనొక హత్యచేయవలసి ఉంది—" అందామె.

"మీ బదులు ఆ హత్య నేను చేస్తాను...." అన్నాడు రా: ం.

"అలా కుదరదు. హత్య నా చేతుల్లోనే జరగాలి. నేరం మాత్రం నా మీదకు రాకూడదు—...." అంది సునంద.

"అలా ఎందుకు? మీకే ఇబ్బందీ లేకుండా పకడ్బందీగా పథకంవేసి నేను వాణ్ణి చంపేస్తాను!" అన్నాడు రామం.

"కానీ అతడికి నా చేతుల్లో చావాలన్నది కోరిక!"

"అదేం కోరిక?" అన్నాడు రామం ఆశ్చర్యంగా.

సునంద వివరించింది.

రామానికిలాగే మరొక సుందరం ఆమెను ప్రేమించాడు. ఆమె కోసం ఏమైనా చేస్తానన్నాడు. అయితే చస్తావా అనడిగింది సునంద. నీ చేతుల్లో అయితే

చావడానికి కూడా సిద్ధమే అన్నాడు సుందరం. సునంద అతడి ప్రేమ బలాన్ని పరీక్షించాలనే నిర్ణయించుకుంది. అయితే ఆ హత్యా నేరం భరించే మరో ప్రేమికుడు దొరక్కపోతాడా అనామె ఎదురుచూస్తోంది. ఇప్పుడు రామం దొరకనే దొరికాడు.

"ఆ సుందరాన్ని మరిచిపో—నన్నే ప్రేమించు—" అన్నాడు రామం.

"నా కోసం చస్తాననే ఆ సుందరం బ్రతికుండగా మరో వ్యక్తినెలా ప్రేమించగలను?" అంది సునంద.

"అయితే అతడినే ప్రేమిస్తున్నావా?" అన్నాడు రామం.

"నా కోసం చస్తాననే అతడి మాటలు నిజమని నిరూపితం కాకుండా అతడినెలా ప్రేమించగలను?" అంది సునంద.

రామం తృప్తిగా నిట్టూర్చి — "అయితే నువ్వు వాడిని ప్రేమించడంలేదన్నమాట. నువ్వేం చెబితే అది చేస్తాను...." అన్నాడు.

"హత్య ఎక్కడ చెయ్యాలో చెప్పు" అంది సునంద.

రామం కంగారుగా ఆమెవంక చూసి—"అయితే హత్య జరిగితీరాలంటావా?" అన్నాడు.

"రామాయణమంతా విని ఏదో అడిగినట్లుంది...."

"హత్య మా ఇంట్లో వేజరుగుతుంది" అన్నాడు రామం.

"అలా వద్దు. చివరి క్షణాల్లో నీ బుద్ధి మారిపోవచ్చు. హత్య మా ఇంట్లోనే జరుగనీ...." అంది సునంద.

"అంతా నీ ఇష్టం...." అన్నాడు రామం.

"రేపు మధ్యాహ్నం మూడింటికి మా ఇంటికి రా—" అంటూ చిరునామా ఇచ్చిందామె.

# 3

సునంద ఇంట్లోని గది. సమయం మధ్యాహ్నం మూడు గంటలు. గదిలో ముగ్గురున్నారు. రామం, సునంద, సుందరం.

సునంద చేతికి గ్లవ్స్ వున్నాయి. చేతిలో కత్తి వుంది. సుందరం మనిషి చాలా నిబ్బరంగా వున్నాడు.

రామం ఆమె చేతిలోని కత్తివంక చూస్తున్నాడు.

సునంద కత్తిని రామం చేతికిచ్చి పిడివద్ద జాగ్రత్తగా పట్టుకొమ్మంది. అలా చేశాక మళ్ళీ కత్తిని తీసుకుంది.

"సుందరం—చావడానికి సిద్ధమేనా?" అన్నదామె.

"నీ చేతుల్లో అయితే చావడానికి ఎప్పుడూ సిద్ధమే!" అన్నాడతను ఏమాత్రమూ కంగారులేకుండా.

"రామం—నువ్వూ సిద్ధమేనా?" అన్నది సునంద.

"దేనికి?"

"కొద్ది క్షణాల్లో సుందరం చచ్చిపోతాడు. ఆ శవాన్నెలా మాయం చేస్తావో అది పూర్తిగా నీ పూచీ. ఈ హత్యలో నాకింకే సంబంధమూ ఉండదు. ఉరికంబమే ఎక్కుతావో—తప్పించుకుని బయటపడతావో-అంతా నీ సామర్థ్యంమీద ఆధారపడి వుంటుంది...." అంది సునంద.

"అన్నింటికీ సిద్ధమే నేను!" అన్నాడు రామం.

"కత్తి నూటిగా నీ శరీరాన్ని తాకాలి. చొక్కా విప్పు...." అంది సునంద.

సుందరం చొక్కా విప్పాడు. ఆమె చెప్పకపోయినా అతను బనియన్ కూడా విప్పాడు.

నిండైన మనిషి అతను. పచ్చని మేనిఛాయ.

రామం సుందరంవంకే చూస్తున్నాడు.

అతడి కళ్ళలో మృత్యుభయం కనపడదేం? ఇదంతా నాటకమా? ఈ నాటకంలో వీరేం సాధించాలను కుంటున్నారు? వేచి చూస్తే అంతా తనకే తెలుస్తుంది.

సునంద చేతిలోని కత్తిని ఓసారి అటూ యిటూ తిప్పింది. సుందరాన్ని సమీపించింది.

అతను రెండు చేతులూ పైకి ఎత్తాడు.

"సుందరం __ బాగా ఆలోచించుకో! నేను నిన్ను చంపడంలేదు. నీ ప్రేమబలాన్ని పరీక్షిస్తున్నాను. పరీక్ష అనవసరమనుకుంటే నిన్ను వదిలిపెట్టేస్తాను...." అంది సునంద.

"నీ చేతుల్లో చావడమే నా కిష్టం—" అన్నాడు సుందరం.

"నీ ఆఖరి కోరిక చెప్పు!" అంది సునంద.

"నీ చేతుల్లో చచ్చిపోతున్నాను. నాకింక కోరికలు లేవు...."

సునంద రామం వంక తిరిగింది—"ఈ హత్యా నేరం స్వీకరించడానికి నువ్వు సిద్ధంగా వున్నావు కదూ!"

"ఉన్నాను—" అన్నాడు రామం. సుందరానికున్న నిబ్బరం అతడికిలేదు. మాట కాస్త వణుకుతోంది. ఇదంతా నాటకమని ఏమూలో అతడికి అనిపిస్తున్నప్పటికీ హత్య జరుగుతుందేమోనని భయమూ పుడుతోంది.

సునంద చేయి గాలిలోకి విసురుగా లేచింది. వేగంగా బలంగా సుందరం పొట్టలోకి కత్తి దిగింది.

బుస్ మని పొంగింది రక్తం!

రామం తెల్లబోయాడు.

సుందరం కుప్పలా కూలిపోయాడు. అతణ్ని వెల్లకితలా పడుకోబెట్టింది సునంద.

రామం ఆ దృశ్యాన్ని చూస్తున్నాడు.

హత్య నిజంగా జరిగింది. తన కళ్ళెదుటే జరిగింది. అందులో ఏ మోసమూ లేదు. ఇప్పుడు తనేం చేయాలి?

సుందరం నేలమీద పడివున్నాడు. రక్తం నేల మీద కూడా ప్రవహిస్తోంది. అతడి స్వరం కూడా హీనంగా వుంది.

"సునందా — నా ప్రేమ బలం తెలిసింది కదూ!" అన్నవి అతడి ఆఖరి మాటలు. అప్పుడు తల పక్కకు వాలిపోయింది.

"రామం—ఇంక నువ్వు రంగంలోకి దిగాలి!" అంది సునంద అతడి వంక నే సునిశితంగా చూస్తూ.

రామం ఆమె వంక నే చూశాడు. ఆమె ముఖంలో ఎక్కడా భయంలేదు. జాలిలేదు. బాధలేదు.

ఈమె మనిషా, రాక్షసా? అనుకున్నాడతను. నిలువునా హత్య చేసింది ఒక అమాయకుణ్ని. ఆ విషయమై ఏ మాత్రమూ ఆలోచించకుండా తనను హత్యా నేరం భరించమంటోంది.

"ఇప్పుడు నే నేంచేయాలి?" అన్నాడు రామం.

"శవాన్ని మాయం చేయాలి!" అంది సునంద.

"ముందు బయట ఎవరైనా ఉన్నారేమో చూద్దాం" అన్నాడు రామం.

"ఇంట్లో ఎవ్వరూ లేరు. అంతా సినిమాకు పోయారు" అంది సునంద.

"బయటంటే వీధిలోఅని నా ఉద్దేశం—" అంటూ రామం వీధిలోకి నడిచాడు.

సునంద అతడి కోసం ఎదురు చూస్తోంది. రామం ఎప్పటికీ రాలేదు.

## 4

"ఎవరు కావాలమ్మా!" వినయంగా అడిగాడు మేనేజర్.

"ఓనరుగారబ్బాయి.... — పేరు రామం...." అంది సునంద.

"ఆయనిప్పుడు థియేటర్లో పిక్చర్ చూస్తున్నారు.." అన్నాడు మేనేజర్.

సునంద అతణ్ని వివరాలడిగింది. మేనేజర్ ఆమెను రామం కూర్చున్న స్పెషల్ బాక్స్ సీట్లోకి తీసుకు వెళ్ళాడు. ఆమెను చూస్తూనే రామం కంగారుపడ్డాడు.

"మీ థియేటర్లో సినిమాయేగదా! ఎప్పుడైనా చూడొచ్చు. అర్జంటుగా నీతో మాట్లాడాలి.... నాతో వస్తావా?" అంది సునంద.

రామం మాట్లాడకుండా లేచి ఆమెతో బయటకు వచ్చాడు.

"గొప్పవాడివే నువ్వు.... మాటిచ్చి పారిపోతావా?" అంది సునంద.

"ఏదో నాటకం అనుకున్నాను. కానీ నిజంగా హత్య చేస్తావనుకోలేదు...." అన్నాడు రామం.

"నీ మాట నమ్ముకుని హత్యచేశాను. ఇప్పుడు నాకేది దారి? శవాన్నింట్లోంచి ఎలా తప్పించాలో తెలియడం లేదు...." అంది సునంద.

"నువ్వు మనిషివా, రాక్షసివా — నిలువునా నిండు ప్రాణాన్ని తీసేశావు. మగాణ్ని — నేనే ఆ దృశ్యానికి తట్టుకోలేకుండా ఉన్నాను. నువ్వెలా తట్టుకున్నావో తెలియడంలేదు...."

"అంతా నీ ధైర్యంమీద చేశాను...." అంది

సునంద.

రామానికేం చెప్పాలో తెలియలేదు. ఈ హత్య తన ప్రోత్సాహం వల్లనే జరిగిందా? ఒక నిండు ప్రాణం పోవ డానికి తనే కారకుడయ్యాడా?

"ఏం చేశావు?"

"కాసేపు నీ కోసం ఎదురు చూశాను. తర్వాత నువ్వు పారిపొయ్యావని గ్రహించాను. అప్పుడు నాకు భయం వేసింది. గదిలో చిందిన రక్తమంతా తుడిచి శుభ్రం చేశాను. నా గదిలో వీణపెట్టె వుంది. అందులోంచి వీణతీసి బైట పెట్టాను. కష్టపడి శవాన్ని పెట్టెలో పెట్టాను. మూతివేసి నీ కోసం థియేటర్‌కు వచ్చాను. లక్కీగా దొరికావు...." అంది సునంద.

"ఇప్పుడు నే నేం చేయాలి?"

"ఆ హత్య చేసింది నువ్వు. ఎలా తప్పించుకుంటావో చూసుకో—" అంది సునంద.

"ఈ హత్యలో నాకే సంబంధమూ లేదు-" అన్నాడు రామం.

"ఇదేనా నీ ప్రేమబలం!" అంది సునంద.

"ఒక హంతకురాల్ని నేను ప్రేమించలేను —" అన్నాడు రామం.

"నువ్వు మోసగాడివి. నీ మొహం చూస్తే పాపం-" అంది సునంద అక్కణ్ణించి వెళ్ళిపోతూ.

రామం ఇంక సినిమా చూడలేదు. అతడు తిన్నగా ఇంటికి వెళ్ళాడు. అతను వెళ్ళగానే తల్లి పలకరించి— "ఏరా, రామం! నువ్వు వీణ ఎప్పట్నించీ నేర్చుకుం టున్నావు? వ్యవహారం వీణ కొనుక్కునేదాకా వచ్చిందే!" అంది.

"వీణ నేర్చుకోవడమేమిటి? కొనడమేమిటి?" అన్నాడతను.

తల్లి చెప్పింది. ఓ రిక్షావాడు తీసుకొచ్చి రామం కోసం తెచ్చానని ఓ వీణపెట్టె ఇచ్చి వెళ్ళిపోయాడట.

"అది నీ గదిలో వుంది. పోయి చూసుకో—" అంది తల్లి.

రామం తన గదికి వెళ్ళాడు. అక్కడ నిజంగానే వీణపెట్టె ఉన్నది. పెట్టెకు తాళం ఉన్నది.

రామానికి సునందమాటలు గుర్తుకొచ్చాయి. ఆమె తెలివిగా శవాన్ని తనకు అంటగట్టింది.

తనిప్పుడీ శవాన్ని ఏం చేయాలి? రేపటి ఉదయానికి శవం వాసన రావడం ప్రారంభిస్తుంది. ఈలోగా ఈ పెట్టెను వదుల్చుకోవాలి.

రామం ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఇప్పుడు తనేం చేయాలి?

దొడ్లో పాతిపెడదామా అంటే తల్లికి ఆ పెట్టె గురించి తెలిసిపోతుంది. వివరాలడుగుతుంది. ఏదో వంక పెట్టి దాన్ని బైటకు తీసుకునిపోవాలి.

రామం పెట్టెను పరీక్షగా చూశాడు.

వెధవది.... చాలా పొడుగ్గా వుంది. కారు టాపుమీద వెయ్యాలి. అలా వేస్తే అందర్నీ ఆకర్షిస్తుంది.

అతనింకా ఆలోచిస్తూండగానే తల్లి ఆ గదిలోకి వచ్చింది — "ఒకసారి వీణను బైటకుతియ్యరా? ఎలా ఉందో చూస్తాను...."

రామం తడబడుతూ—"పెట్టెకు తాళం వుందమ్మా—ఇదివరకు పంపారో కూడా నాకు తెలియడంలేదు. నేను వీణ నేర్చుకోవడం-అంతా అబద్ధం-ఈ వెధవ పెట్టెలో

ఏముందో ఏమిటో — ఎవరో కావాలని మనకు అంటగట్టారు ...” అన్నాడు.

“అయితే ఏముందంటావ్?” అంది తల్లి కంగారుగా.

“ఏమో—ఏదైనా శవమున్నా ఉండవచ్చు. దీన్ని ఎవరికీ తెలీకుండా బయట వదిలిపెట్టాలి—” అన్నాడు రామం.

అతడి తల్లి కంగారుపడింది — “అయితే తొందర పడకు. మీ నాన్న వచ్చేక పెట్టె తెరిచి చూసి ఏం చేయాలో ఆలోచిద్దువుగాని—”

“అంతవరకూ ఆగడానికి లేదు. ఇందులో ఏ టైం బాంబైనా ఉన్నదేమో—” అన్నాడు రామం. అతడికిప్పుడు తల్లిని కంగారుపెట్టడమే మంచి ఉపాయమనిపించింది. అప్పుడావిడే వెంటనే ఏవో ఏర్పాట్లు చేస్తుంది.

రామం అనుకున్నట్టే అయింది. ఆవిడ ఇద్దరు పనివాళ్ళను పిలిచింది. పెట్టెను కాసేపు పక్కవాళ్ళింట్లో పెట్టి రమ్మంది. ఏ బాంబైనా వుంటే అది వాళ్ళ ఇంట్లోనే పేలుతుందని ఆవిడ ఉద్దేశ్యం.

“అప్పుడైనా నేరం మనమీదకు రాదూ?” అన్నాడు రామం.

“బాగుందిరా — ఇంట్లో బాంబుపడి ఇల్లు కూలిపోతే అది మనవల్లే జరిగిందని చెప్పడానికా యింట్లో మనుషులెక్కడుంటారూ?” అంది తల్లి.

అందులో వున్నది బాంబు కాదనీ, శవమనీ రామంకు తెలుసు. కానీ ఎలా చెప్పాలో తెలియక ఊరుకున్నాడు. తండ్రి ఎప్పుడు వస్తాడా అని ఎదురుచూస్తున్నాడతను.

# 5

సాయంత్రం ఆరున్నరకు వచ్చాడు రామం తండ్రి.
తండ్రికి రామం జరిగింది చెప్పాడు.
తండ్రి వెంటనే పెట్టెను వెనక్కి తెమ్మని చెప్పాడు.
పనివాళ్ళు వెళ్ళి ఉత్త చేతుల్తో తిరిగివచ్చారు.
"వాళ్ళింట్లో పెట్టె లేదండి——"
"మీరే కదా మీ చేతుల్తో పెట్టి వచ్చారు...."
"అవునండి.... కానీ ఇప్పుడు లేదంటున్నారు...."
"ఏమయిందిట?"
"వాళ్ళేం చెప్పడం లేదండి ..."

రామం కంగారు పడ్డాడు. ఇప్పుడు తను పెట్టి పోయిందని సంబరపడాలా? లేక సమస్య మరింత జటిల మవుతుందా?

అసలు విషయం కనుక్కుందామని అతను పక్క వాళ్ళింటికి వెళ్ళాడు. ఇంట్లో ఇద్దరబ్బాయిలున్నారు. అతణ్ని మామూలుగా పలకరించారు.

"మా పనివాళ్ళు మీ యింట్లో వీణపెట్టె ఒకటి వుంచారు...."

వాళ్ళిద్దరు నవ్వారు-"వాళ్ళసలు మా ఇంటికిరాలేదు. ఎందుకలా చెప్పారో తెలియదు——"

రామం ఎంత అడిగినా వారిద్దరూ అదే సమాధానం చెప్పారు. ఇంట్లో వాళ్ళు తప్ప ఇంకెవ్వరూ లేరుట.

అబద్ధం వాళ్ళు చెబుతున్నారో, పనివాళ్లు చెబు తున్నారో రామానికి అర్థంకాలేదు. అసలు పెట్టెని ఎవరు మాయంచేశారు? ఎందుకు మాయంచేశారు?

విషయం తెలుసుకోవాలని రామం సునంద యింటికి బయల్దేరాడు. అతను వెళ్ళేసరికి ఆమె అప్పుడే గేటు

దగ్గర నిలబడివుంది.

"నువ్వా—అమ్మయ్యా—వచ్చావా?" అన్నదామె.

"మా యింటికి వీణపెట్టె పంపింది నువ్వేనా?" అన్నాడతను.

"వీణపెట్టె నేను పంపడమేమిటి? అదింకా యింట్లోనే వుంది. బయటికెలా తీసుకువెళదామా అని ఆలోచిస్తున్నాను...." అన్నదామె.

"ఏదీ—వచ్చి చూస్తాను...." అన్నాడతను.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు.

గదిలో పెట్టె ఉన్నది. ఈ పెట్టె తను చూసింది కాదు. ఇది ఇంకోరకంగా వున్నది. అంటే అది ఎవరు పంపారు?

రామం ఆమెకు జరిగింది చెప్పాడు.

"కథలు చెప్పకు. ఈ పెట్టె తీసుకునిపో—" అంది సునంద.

రామం మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు. అతడికి అంతా గజిబిజిగా వున్నది.

తన యింటికి వచ్చిన రెండో వీణపెట్టె ఎవరు పంపారు? అది పక్కవాళ్ళింట్లోంచి యెందుకు మాయమయింది?

రామం ఇల్లు చేరేసరికి తండ్రి చిందులు తొక్కుతున్నాడు. అంతకు కొద్దిక్షణాల క్రితం ఆయనకు ఫోన్ వచ్చిందట—ఆ వీణపెట్టెలో ఆయన వ్యాపారానికి ముఖ్యమైన వస్తువు పంపబడిందిట. పంపినది ఆయన మిత్రుడట.

రామం ఆశ్చర్యపోయాడు. కథ ఇలా తిరిగిందేమిటి?

తండ్రి తల్లిని తిడుతున్నాడు—"నీ తెలివితక్కువవల్ల రెండు లక్షల రూపాయలకు పైగా నష్టం. అదీకాక వ్యాపారంలో చెడ్డ పేరు. ఆ పెట్టి ఇలా పోయిందంటే నా భాగస్వాములెవ్వరూ నమ్మరు...."

"ఊరికే నోరు పారేసుకోకండి.... రెండు లక్షలేగా. మా నాన్నగారికి రాసి తెప్పిస్తాను. చాలా?" అంది రామం తల్లి.

"ఈ గర్వమే నిన్ను పాడు చేస్తోంది. అన్ని ప్రమాదాలూ డబ్బుతో దాటలేము. ముఖ్యంగా వ్యాపారంలో కావలసింది నమ్మకం. ఈ పెట్టి నన్ను చాలా ఇబ్బందుల్లో పెడుతుంది. నీ డబ్బు నన్ను కాపాడలేదు-" రామం తండ్రి ఆవేశంగానే అన్నాడు.

"బాగుందండీ-అలాంటప్పుడా పెట్టి కుర్రాడి పేరున పంపడమెందుకూ? అదే మన కొంప ముంచింది. మీ పేరున వచ్చివుంటే మేమెవ్వరం దాని జోలికి వెళ్ళే వాళ్ళం కాదు. తప్పంతా మీ మిత్రుడిదే!" అంది రామం తల్లి.

"బాగుంది. నేను తీరిక సమయాల్లో వీణ నేర్చుకుంటున్నానంటే ఏం బాగుంటుంది—ఎవరు నమ్ముతారు?" ఆనాయన ఇంకా ఏదో అనబోతూండగా వాచ్‌మన్ అక్కడ అడుగుపెట్టి — "బాబూ—ఓ రిక్షా వచ్చింది. అందులో వీణపెట్టి ఉన్నది. రిక్షావాడది ఇంట్లో పెట్టాలంటున్నాడు—" అన్నాడు.

రామం తండ్రి మాటలు ఆగిపోయాయి. వెంటనే ఇద్దరు పనివాళ్ళు బయటకు వెళ్ళారు.

వాళ్ళంతా ఆలోచిస్తున్నారు. పక్కింట్లో పెట్టినదిప్పుడు మళ్ళీ రిక్షాలోకి ఎలా వచ్చింది?

# 6

పనివాళ్ళిద్దరు పీణపెట్టెను మోసుకుని వచ్చారు. వాళ్ళు ముందు దింపారు. రామం తండ్రి వాళ్ళను పొమ్మన్నాడు.

రామం పెట్టెను పరిశీలించి చూస్తూ కంగారుపడి—"ఇది ఇందాకటి పెట్టి కాదు. మరొకటి—" అన్నాడు. అతడి కంగారుకు కారణం వేరు. ఆ పెట్టిని కొద్ది సేపటి క్రితం అతడు సునంద యింట్లో చూశాడు. అంటే అందులో....

"దీనికీ తాళంవేసి వుంది—" అంది రామం తల్లి.

"తాళంచెవి నా దగ్గరుంటుంది—" అంటూ రామం తండ్రి జేబులు తడిమి ఓ చెవి బైటకు తీశాడు.

రామానికి భయంవేసింది—"ఇది మీరనుకునే పెట్టి కాదు. దాన్ని తెరవద్దు. ఇది నిజంగా నా కోసం పంపబడిన పెట్టి—"

తండ్రి అతడి వంక ఆశ్చర్యంగా చూసి—"అయితే నువ్వు ఇలాంటి వ్యాపారంలో దిగావా? సరేలే — ఈ పెట్టి ఎవరికోసమో — ఈ తాళమే తేలుస్తుంది...." అంటూ ఆయన తన దగ్గరున్న చెవిని తాళం కప్పులో పెట్టి తిప్పగానే తాళం విడిపోయింది. అప్పుడాయన కొడుకువంక గర్వంగా చూసి — "చూశావా? ఇది నా కోసమే!" అన్నాడు.

భార్యకూడా ఆయన అసలు సంగతి విచారించాడు. వ్యాపారంలో ఎన్నో రహస్యాలుంటాయట. అందుకని భాగస్వాములంతా ఈ ఏర్పాటు చేసుకున్నారుట. ఈ చెవికి వచ్చే తాళంకప్పులు మొత్తం డజను వున్నాయట. తాళంచెవులు భాగస్వాములందరికద్దా ఉన్నాయట.

పనై పోగానే తాళంకప్ప ఒకతనికిచ్చేయాలిట. అతడి పేరు భార్యకు కూడా చెప్పకూడదు.

"తాళమెలా వచ్చిందో తెలియదు కానీ ఈ పెట్టె మాత్రం నా కోసమేనని కచ్చితంగా చెప్పగలను...." అన్నాడు రామం గొణుగుతున్నట్లు. ఇప్పుడు తండ్రి పెట్టెలోని శవాన్ని చూస్తే ఏమవుతుంది? తనేం చెప్పాలి? ఒక ఆడపిల్ల గురించి మతి పోగొట్టుకుని వెధవ గొడవలో ఇరుక్కున్నావని తిడతాడా?

తండ్రి పెట్టెమూత తెరిచాడు. అంతే—పెట్టెలోంచి చటుక్కున ఓ మనిషి బైటికి గెంతడం జరిగింది.

రామం కళ్ళు తేలేశాడు. తండ్రి ఉలిక్కిపడి వెనక్కి తప్పుకున్నాడు. రామం తల్లి కెవ్వుమని కేకేసింది.

అయితే పెట్టెలోంచి దూకినది భయంకర పిశాచం కాదు.

అందాల బొమ్మ.

ఆమెకు పద్దెనిమిదేళ్ళకంటె ఉండవేమో! కవ్వించే నాట్యానికి పనికొచ్చేటంత ధారాళమైన అవయవ సంపద. మెరిసిపోయే రంగు వళ్ళు. చూడగానే అందమైనవదని పించే కళ్ళు.

ఆమె రిబ్బన్‌లాంటి బ్రా వేసుకుంది. గోచీవంటి అండర్‌వేర్ ధరించింది. అప్పటికామె శరీరం మగాడికి కనులవిందు....

ఆమె రామం తండ్రినీ, రామాన్నీ పరీక్షగా చూసి—"మీ యిద్దరిలో ఎవరి కోసం నేను వచ్చాను?" అనడిగింది.

కంఠం తియ్యగానూ, మత్తుగానూ ఉన్నది.

రామం తల్లి కళ్లు విస్ఫులింగాలయ్యాయి—"నువ్వెవరి

కోసం వచ్చావు?"

"ఈ ప్రశ్న ఎదురవుతుందని నేననుకోలేదు. మూత తెరవగానే కనిపించిన మగవాడికి కానుకగా వచ్చాను నేను. కానీ ఇద్దరు కనిపిస్తారని నేననుకోలేదు...."

"ఈమె నా కోసం కాదు...." అన్నాడు రామం.

"నా కోసమూ కాదు..." అన్నాడు రామం తండ్రి.

"ఈ ఇంట్లో ఇంకెవరైనా మగాళ్ళున్నారా?" అందా యువతి.

"లేరు...."

"అయితే నేను మీ ఇద్దరిలో ఒకరి కోసం...."

"అసలీ పెట్టె వాడికోసమేనని వాడన్నాడు...."

"అలాగైతే తాళం నాన్న దగ్గరెందుకుంటుందీ?"

ఇద్దరూ వాదోపవాదాలు చేసుకుంటూంటే ఆ యువతి నవ్వుతూ రామం తల్లి వంక చూసి-"మీ రెదురుగా ఉండడంవల్ల ఇద్దరూ ప్లేట్లు మార్చేశారు. లేకపోతే నాకోసమంటే నాకోసమని దెబ్బలాడుకునేవారు. ఇలా ఇంట్లో ఆడవాళ్ళకు తెలియకుండా ఆడపిల్లల్ని రప్పించుకోవడం ఇద్దరికీ అలవాటే! ఈ రోజు దురదృష్టంకొద్దీ వ్యవహారం బైటపడిపోయింది...." అంది.

"ఇందులో ఆడపిల్ల ఉన్నదని తెలిస్తే నీ ముందుగా ఎందుకు తీస్తానే....ఇదంతా రామంగాడి వ్యవహారమే.." అన్నాడు రామం తండ్రి.

"అలా దాటేయకండి. గదిలో ఎవరూ లేరనుకుని నేను పెట్టెలోంచి గెంతేయడం పొరపాటైపోయింది. నేనలా చేస్తానని మీరూ అనుకుని ఉండరు...." అందామె.

ఆ యువతి రామం తల్లికి అటు భర్తమీదా, ఇటు

కొడుకుమీదా కూడా అనుమానం వచ్చేలా మాట్లాడి—
"ఈ ఇంట్లో మగాళ్ళే లేరు. ఇక్కడుండి నే నేంచేస్తాను?
ఓ చీర ఇప్పిస్తే కట్టుకుని వెళ్ళిపోతాను...." అంది.

"నువ్వు చీర కూడా కట్టుకుంటావా తల్లీ!" అంది రామం తల్లి వెటకారంగా.

"అయ్యో—ఆడవాళ్ళముందు నాకు మహా సిగ్గు—..." అందా యువతి. అలాగన్నప్పుడామె రామాన్నీ, అతడి తండ్రినీ మాత్రమే చూసింది.

## 7

వీణ వెళ్ళిపోయింది.

ఆమె పేరు ఏమైనప్పటికీ వీణ పెట్టిలోంచి వచ్చింది కాబట్టి రామం తల్లి ఆమెకు వీణ అని పేరు పెట్టింది.

ఆమెను ఎవ్వరూ వారించలేదు. ఆమె ఎక్కణ్ణించి వచ్చిందో ఎలా వచ్చిందో వివరాలు తెలుసుకుందుకు కూడా ప్రయత్నించలేదు. ఆమెను చూడగానే మగాళ్ళకు మతులు పోతున్నాయి. రామం తల్లికి వళ్ళు మండిపోతోంది.

ఆమె మగాళ్ళిద్దర్నీ చడామడా తిట్టింది. ఇద్దరూ నోరెత్తకుండా ఆమె తిట్లు భరించారు.

ఇది సునంద పనేనని రామానికి అనుమానంగా వుంది.. తల్లి చేత తిట్లుతిని అతను కార్లో సునంద ఇంటికి వెళ్ళాడు..

తలుపు మరెవరో తీశారు.

"సునందతో మాట్లాడాలి!" అన్నాడు రామం.

సునంద రావడానికి అయిదు నిముషాలు పట్టింది. రామం అసహనంగా ఎదురుచూస్తున్నాడు.

"హాలో—నువ్వా?" అంది సునంద.

"యూ ఆర్ ప్లేయింగ్ ఏ గేమ్...." అన్నాడు

రామం.

"ఏదో ఒకటి....నువ్వొస్తావన్న ఆశ నాకుంది. అది నిజం చేశావు. చాలా సంతోషం. వీణ రిపేర్కిస్తానని అబద్ధం చెప్పనా — ఓసారి పెట్టి కావాలన్నావని చెప్పనా—ఉపాయం నువ్వే చెప్పి అది తీసుకునిపో!" అంది సునంద.

"ఓసారి వచ్చి చూస్తాను...." అన్నాడు రామం.

"నిరభ్యంతరంగా!" అందామె.

ఇద్దరూ కలిసి ఆ గదిలోకి వెళ్ళారు. సునంద అతడికి పెట్టి తెరిచి చూపించి మూసేసింది. అందులో సుందరం శవముంది.

"బాప్ రే — మరి నా దగ్గరకు వచ్చిన పెట్టి సంగతేమిటి?"

సునంద అతణ్ని ఒక్క ప్రశ్న కూడా వెయ్యలేదు— "నువ్వేదో కథలు చెప్పి పారిపోయే బాపతని నాకెలాగూ తెలుసు. కానీ శవమింక వాసనేస్తుందేమోనని అనుమానం. ఎంతకాలమని ఇంట్లో పెట్టుకొర్చుంటాను?" అంది.

"అది నీ ఇష్టం...."

"ఇష్టంకాదు .... నీవల్ల వచ్చిన కష్టం...." అంది సునంద.

రామం మాట్లాడకుండా బయటకు వెళ్ళిపోయాడు.

జరుగుతున్న నాటకం ఏమిటి? ఎవరో తనతో ఎందుకాడుకుంటున్నారు? ఇందులో సునంద పాత్ర ఏమిటి?

అతడింటికి రాగానే తల్లి అడిగింది— "ఏరా— ఇంట్లో సాగలేదని ఏకంగా దానింటికే పోయొచ్చావా?"

"అసలదెవరో నాకు తెలిసి ఏడిస్తే కదయ్యా!"

"తెలిస్తే వెడతావన్న మాట!"

"ఆఁ వెడితే వెడతాను...." అన్నాడు రామం.

కొడుకిలా అంటాడని ఊహించక ఆవిడ తడబడింది. తర్వాత గొణుక్కుంటూ లోపలకు వెళ్ళిపోయింది.

# 8

ఆ రాత్రి రామం తండ్రి విశ్వనాథం అయిదారు చోట్లకు ఫోన్ చేశాడు. సరిగ్గా రాత్రి పదకొండు గంటలకు ఆయన కొడుకును పిలిచాడు — "ఈ రాత్రి నాకు నిద్రపట్టేలాలేదు. నా రహస్యాలన్నీ ఎవరో తెలుసుకున్నారు. నన్నో ఆట ఆడించాలనుకుంటున్నారు—...."

"అలా ఎందుకనుకుంటున్నారు?" అన్నాడు రామం.

"మనింటికి వచ్చిన వీణపెట్టె మాయమయింది. మరో పెట్టిలో అమ్మాయొచ్చింది. ఆ పెట్టె మావాళ్ళెవ్వరూ పంపలేదు. కానీ దానికి తాళం మాత్రం మా భాగస్వాముల్లోదే వేసివుంది...."

"అంటే మీ భాగస్వాముల్లో ఒకరు...."

"అలాగని నేననుకోవడంలేదు .." అన్నాడు రామం తండ్రి.

"మరేమనుకుంటున్నారు?"

"అందుకే నిన్ను పిలిచాను!"

రామం తండ్రివంక ఆశ్చర్యంగా చూశాడు.

"ఈ నాటకంలో నీ చేయి వుంది. ఎంతో కొంత నీకు తెలుసు. అది నువ్వు నాకు చెప్పాలి!" అన్నాడు విశ్వనాథం.

"నిజంగా నాకేమీ తెలియదు...."

"అబద్ధం చెప్పకు. కొడుకు తండ్రిని మోసంచేస్తే

దేవుడు కూడా క్షమించడు. నీకేమీ తెలియకపోతే ఆ వీణపెట్టె నీ కోసమేనని ఎందుకన్నావు? అందులో ఏముందో నీకు తెలుసు. ఎవరు పంపారో నీకు తెలుసు?"

"నన్నేమీ అడగొద్దు—నాకేమీ తెలియదు—" అన్నాడు రామం. తనకూ సునందకూ మధ్య జరిగిన కథ తండ్రికి చెప్పడం అతడికి బొత్తిగా ఇష్టంలేదు.

"చెప్పవా?" అన్నాడు విశ్వనాథం.

"మనింటికి వచ్చిన మొదటిపెట్టె ఏమయిందో తెలుసుకోవాలి. పక్కింట్లో ఇద్దరబ్బాయిలున్నారు. వాళ్ళచేత నిజం కక్కించాలి. ముందా ఏర్పాటు చూడండి—" అన్నాడు రామం.

"నాకా విషయం ఎప్పుడో స్ఫురించింది. సరిగ్గా పన్నెండు గంటలకు రంగడు ఆ ఇంటికి వెడతాడు. ఈలోగా నువ్వు నీకు తెలిసింది చెప్పాలి. అది నాకు ఎంతగానో సహకరిస్తుంది. విషయం దాచడంవల్ల వ్యాపారంలో పరిస్థితులు ఒకోసారి ఎంతగానో విషమిస్తాయి—" అన్నాడు విశ్వనాథం.

"ఎవరో నన్ను ఫోన్ చేసి బెదిరించారు నా పేరున ఒక వీణపెట్టె మనింటికి చేరుతుందట. అందులో ఒక శవం ఉంటుందట. ఆ శవాన్ని ఎవరికీ తెలియకుండా వదుల్చుకోవడం నా బాధ్యతట. ఈ విషయం రహస్యంగా ఉంచకపోతే నా ప్రాణాలకే ప్రమాదం—" అన్నాడు రామం.

విశ్వనాథం అంతా సావధానంగా విని — "అయితే ఇదంతా ఎవరో తెలివిగా ఆడిన పన్నాగం. నాకు రహస్యమైన సరుకు కొంత చేరవలసివున్నది. అది నా మిత్రుడు వీణపెట్టిలో పంపాడు. ఈ రహస్యం ఎవరో

తెలుసుకుని ముందే నీకు ఫోన్ చేసి బెదరగొట్టాడు. నువ్వు భయపడిపోయావు. ఫలితంగా పెట్టి పక్కింటికి చేరింది. అక్కణ్ణించి వాళ్ళెలాగో దాన్ని సంగ్రహించుకుని పోయారు. ఆ తర్వాత ఇంట్లో కలతలు రేపడంకోసం ఓ అమ్మాయిని పంపారు.

మీ అమ్మ దగ్గర నా పరువు కాపాడు. ఆ పిల్ల నీ కోసమేనని చెప్పు. చెప్పమన్నానుగదా అని వేధ వ్యేపాలు వేస్తే కన్న కొడుకునని కూడా జాలితలచను. అమ్మ నీ తప్పైనై తే క్షమిస్తుంది కానీ నా తప్పును క్షమించదు. అందుకని ఈ అబద్ధం చెప్పమంటున్నాను తప్పితే నిన్ను అల్లరిచిల్లరిగా తిరగమనడంలేదు. మనను అల్లరిపెడుతున్నవారెవరో ఆచూకీ తెలిస్తే మాత్రం నాకు చెప్పడం మరిచిపోకు....”

రామం తండ్రి మాటలు శ్రద్ధగా విన్నాడు. సునంద తండ్రిని అల్లరిపెట్టాలనుకుంటోందా? ఎందుకు?

సునంద వ్యవహారం మొత్తం తమాషాగా వుంది.

పరీక్ష పేరు చెప్పి ఓ ప్రియుణ్ని హత్య చేసింది. మరో ప్రియుణ్ని హత్యానేరం మోయమంది. తమ ఇంటికి వచ్చిన వీణపెట్టిని ఆమే కాజేసిందా? తండ్రికి వీణ పెట్టిలో ఏదో వస్తుందని ఆమెకు ముందుగానే తెలుసా? తెలిసే ఈ నాటకమంతా ఆడిందా?

అయితే బీచివద్ద తనే ఆమెను పలకరించాడు తప్పితే ఆమె తనవంకనైనా చూడలేదే! ఇదామె ఆడిన నాటకమెందుకవుతుంది?

ఇంతకీ తను తండ్రికి సునంద పేరు చెప్పాలా, అక్కర్లేదా?

రామానికి నిద్రపట్టలేదు. రాత్రి పన్నెండు గంటలక్షు

పక్కింటి అబ్బాయి అను నాలుగు తగిలించి రంగడు తీసుకొచ్చే సమాచారం తెలుసుకోవాలని అతడికి చాలా కుతూహలంగా వుంది.

రంగడంటే ఆ ఊరిలోని రౌడీలందరికీ కూడా సింహ స్వప్నం. వాడిది ఏనుగు బలం. ప్రత్యర్థిని ఎదుర్కొన డంలో సింహం బుర్ర. వాడు సరదాగా వీపుమీద తడితే రక్తం కక్కుకుంటారని చెప్పుకుంటారు. మనిషి చూడ్డానికి కూడా మహా భయంకరంగా వుంటాడు.

పక్కింటి అబ్బాయిలు రంగణ్ని చూడగానే నేరం ఒప్పేసుకుంటారని రామం అనుమానం.

సరిగ్గా పన్నెండుంపావుకి రంగడు ఆ యింట్లోకి వచ్చాడు. వాడి బట్టలు చిరిగివున్నాయి. పెదవి చిట్లి రక్తం కారుతోంది. జుత్తంతా రేగిపోయి వుంది. మనిషి ఆయాసంతో రొప్పుతున్నాడు. వాడి చేతిలో ఓ కవరు వుంది.

"కలియుగంలో కూడా దేవుడు అవతారమెత్తాడు. లేకపోతే ఈ రంగణ్ని కొట్టడం మానవమాత్రుడివల్ల అయ్యే పనికాదు—" అన్నాడు రంగడు.

"దెబ్బలు తినొచ్చి ఇంకా ప్రగల్భాలు దేనికి?" అన్నాడు విశ్వనాథం.

"తన ఇస్త్రీ మడత కూడా నలక్కుండా నన్నిలా కొట్టాడు సార్! వాడు మానవమాత్రుడంటే మీరు నమ్ముతారా?" అన్నాడు రంగడు.

నమ్మడం కాస్త కష్టమే—"అసలేం జరిగిందో చెప్పు. తర్వాత వాడు దేవుడో మనిషో ఆలోచిద్దాం—" అన్నాడు విశ్వనాథం.

"నేనాయింట్లో అడుగు పెట్టబోగా—గుమ్మం దగ్గరే

ఓ నీలైన మనిషి తగిలాడు. గోపలకు వెళ్ళొద్దన్నాడు. నేను వెడతానన్నాను. వెడితే ఏం జరుగుతుందో తెలుసా అన్నాడు. తెలియదు అన్నాను. రెండే రెండు నిముషాల్లో నన్నిలా చేసి నా చేతిలో ఈ కవరు పెట్టి విశ్వనాథంగారికి ఇమ్మన్నాడు....."

విశ్వనాథం ఆత్రుతగా కవరు అందుకున్నాడు.

మిష్టర్ విశ్వనాథం!

మీ పక్కింటివాళ్ళ జోలికి వెళ్ళడం నీకు మంచిదికాదు. మీ ఇంట్లో ఓ బాంబుంది. వాళ్ళ జోలికి వెడితే ఆ బాంబు పేల్తుంది. నీకు శాంపుల్ కావాలంటే ఇంకోసారి మీ మనిషిని వాళ్ళింటికి పంపి చూడు. శాంపుల్ గా ఓ గది పేలిపోతుంది. ప్రస్తుతానికి ఇంతే విశేషాలు.

ఇట్లు

నిన్ను మించిన మనిషి."

రామం కూడా ఆ ఉత్తరం చదివాడు. అతడికి ఒళ్ళంతా వణుకు పుట్టింది. తమ యింట్లో బాంబుందా? ఎక్కడ?

అతదేదో అనబోగా విశ్వనాథం మాట్లాడవద్దన్నట్లు సైగచేశాడు.

"నేనిప్పుడేంచేసేది సార్!" అన్నాడు రంగడు.

"హాయిగా ఇంటికిపోయి పడుకో! పొరపాటున కూడా ఆ యింటి జోలికి మరోసారి వెళ్ళకు...." అన్నాడు విశ్వనాథం.

రంగడు వెళ్ళిపోయాడు.

"మనమిప్పుడేం చేయాలి నాన్నా!"అన్నాడు రామం.

"నువ్వు పోయి పడుకో!" అన్నాడు విశ్వనాథం.

# 9

రాత్రంతా సరిగ్గా నిద్రలేదేమో రామానికి మెలకువ వచ్చేసరికి కాస్త ఆలస్యమయింది. కానీ విశ్వనాథంకంటె ముందే లేచాడు.

టైము ఎనిమిదిదన్నరయింది. విశ్వనాథం ఇంకా నిద్ర లేవలేదు.

ఆ సమయంలో ఇంటికెవరో వచ్చారు. మనిషికి యాభై ఏళ్ళుంటాయి. బుగ్గమీసాలు. రామానికాయ న్నెప్పుడూ చూసిన గుర్తులేదు.

"నా పేరు కాంతారావు. మీ నాన్న ఉన్నాడా?" అన్నాడాయన.

"ఇంకా నిద్రలేవలేదండి. మీరెవరు?" అనడిగాడు రామం.

"మేమిద్దరం బాగా స్నేహితులం!"

"నాకు మిమ్మల్నెప్పుడూ చూసిన గుర్తు లే దే!" అన్నాడు రామం.

"మీ నాన్న స్నేహితులందర్నీ నువ్వు చూడడ మెందుకూ? నీ తెలివితేటలూ మీ నాన్న తెలివితేటల్లాగే ఏడిశాయి. అసలు నేనీరోజైనా వచ్చి వుండేవాణ్ని కాదు. అంతా మీ నాన్న తెలివితక్కు-వల్ల వచ్చింది—" అన్నాడాయన విసుగ్గా.

వాటం చూస్తూంటే తండ్రిని బాగా ఎరిగున్నవాడి లాగున్నాడు. రామం ఆయన్ను కూర్చోమని చెప్పి వెళ్ళి తండ్రిని నిద్రలేపాడు.

విశ్వనాథం కళ్ళు నులుముకుంటూ లేచి—"ఏమిట్రా గొడవ—అసలే రాత్రంతా నిద్రలేదు—" అన్నాడు.

"ఎవరో కాంతారావుగారుట...."

"కాంతారావా? మనింటికి వచ్చేశాడా? కొంప మునిగిందే—" అంటూ ఆయన ఉలిక్కిపడి లేచి గబగబా బట్టలు మార్చుకుని హాల్లోకి బయల్దేరి వచ్చాడు.

రామానికి వ్యవహారమంతా కుతూహలంగా వుంది. అతనూ తండ్రివెనకే వచ్చాడు.

"ఏమిటిలా అర్థాంతరంగా వచ్చేశావ్!" అన్నాడు విశ్వనాథం.

"నేను రావాలని వచ్చానా — నువ్వు రప్పించావు గానీ...." అన్నాడు కాంతారావు. అతడి ముఖంలో కోపం దాచుకుందామన్నా దాగడంలేదు.

"పొరపాట్లు ఒకోసారి ఎంతవారికీ వస్తుంటాయి. అంతా నా దురదృష్టం!" అన్నాడు విశ్వనాథం.

"మన వస్తువు ఎదుటివారి దగ్గర పోయినప్పుడు అది పొరపాటా, నమ్మకద్రోహమా అన్నది మనకు వారిమీద ఉండే నమ్మకంమీద ఆ ధా ర ప డి ఉంటుంది—" అన్నాడు కాంతారావు చురుగ్గా విశ్వనాథం వంక చూస్తూ.

"అంటే—ఏమంటావ్?" అన్నాడు విశ్వనాథం.

"నాకు నీమీద నమ్మకం నువ్వు పొరపాట్లు చేయవని. అదే నమ్మకం నమ్మకద్రోహం విషయంలో ఏమనుకోవాలంటావ్? ఎందుకంటే—నీవల్ల జరిగినది—పొరపాటో, నమ్మకద్రోహమో తప్ప మరొకటికాదు...." అన్నాడు కాంతారావు.

"నువ్వు చాలా ఖచ్చితంగా నీ మనసులోని మాట చెప్పావు. అందుకు నేను నిన్ను తప్పు పట్టను. కానీ నన్నెలా నమ్ముతావో, నిన్ను నమ్మించడం కోసం నేనేం చేయాలో నువ్వే చెప్పు!" దీనంగా అన్నాడు విశ్వ

నాథం.

రామం ఆశ్చర్యంగా తండ్రి వంక చూశాడు. విశ్వనాథంకు కోపం బాగా ఎక్కువ. ప్రతిదానికీ చిరాకు పడడం ఆయన అలవాటు. అలాంటిది కాంతారావు అంతలేసి మాటలంటుంటే ఎలా సహించగలిగాడు? కాంతారావు చాలా గొప్పవాడా? తన తండ్రిని కూడా శాసించగలడా?

"ఆత్మ విశ్వాసం ఉన్నవాడు చిన్నచిన్న తప్పులే చేస్తాడు. నీ ఆత్మ విశ్వాసంమీద నాకు గౌరవముంది. నువ్వు చాలా చిన్న తప్పుచేశావని ఇప్పుడే నిరూపిస్తాను. నిరూపించలేని పక్షంలో నీ ముందు నిలబడి లెంపలు వేసుకుని మరీ వెడతాను—" అన్నాడు కాంతారావు.

"అంత మాటనకు. అసలేంచేయాలో చెప్పు!" అన్నాడు విశ్వనాథం.

"నేను పంపిన పెట్టె ఎలా పోయిందో చెప్పు!" అన్నాడు కాంతారావు.

విశ్వనాథం వివరించాడు.

"సరే — అయితే ఓసారి మీ పక్కవాళ్ళింటికి వెడదాం—" అన్నాడు కాంతారావు. ఆయన, విశ్వనాథం, రామం—ముగ్గురూ పక్కింటికి వెళ్ళారు.

ఇంట్లో ఆ ఇద్దరబ్బాయిలూ ఉన్నారు.

విశ్వనాథాన్ని చూస్తూనే ఒకబ్బాయి—"ఇంక మీ పెట్టెని మీరు తీసుకుపోతారా? లేక ఇంకా అది పోయిందనే చెప్పాలా?" అన్నాడు.

విశ్వనాథం తెల్లబోయి "పోయిందని చెప్పడమేమిటి?" అన్నాడు.

"నిన్న రాత్రినుంచీ దీని గురించి నిద్రలేదు. ఎన్నో

ఎంక్వయిరీలు. అందరికీ మీరు చెప్పినట్లే అది పోయిందని చెబుతున్నాం. ఇంక మీరు దాన్ని తీసుకువెళ్ళిపోవడం మంచిదనుకుంటాను—" అన్నాడు రెండో అబ్బాయి.

రామానికీ, విశ్వనాధానికీ నోటమాట రాలేదు. నిన్న జరిగిందేమిటి? ఇప్పుడు జరుగుతున్నదేమిటి?

విశ్వనాధం క్షణాలమీద తేరుకున్నాడు—"ముందా పెట్టి ఎక్కడుందో చూపించండి—"

"మీ పని వాళ్ళెక్కడ పెట్టారో అక్కడే వుంది-" అంటూ ఆ అబ్బాయిలిద్దరూ పక్క గదిలోకి దారితీశారు.

ఆ గదిలో వీణపెట్టె వుంది. దాన్ని రామం గుర్తుపట్టి- "ఇదే నాన్నా—నిన్న వీళ్ళింట్లో పెట్టినదిదే!" అన్నాడతను గట్టిగా.

"దీన్ని మీరు తెరిచి చూశారా?" అన్నాడు విశ్వనాధం.

"చూడమని మీరు చెప్పలేదుగదా! మీరు చెప్పింది మాత్రమే చేశాం మేము. ఇరుగూ పొరుగూ అన్నాక ఆ మాత్రం సాయం చేసుకోవడంలో విశేషమేముంది?" అన్నాడా అబ్బాయి.

"ఒక్కసారి అంతా గదిలోంచి వెళ్ళిపోతే నేనో చిన్న పరీక్ష చేసుకోవాలి—" అన్నాడు కాంతారావు.

అంతా గదిలోంచి బయటకు వచ్చేశారు. కాంతారావు తలుపులు వేసుకున్నాడు. ఓ పావుగంట తర్వాత ఆయన బయటకు వచ్చి—"విశ్వనాధం—ఈ పెట్టెను నా కారుమీద పెట్టించు. కారుపైన చట్రం వుందిలే—" అన్నాడు.

"అంతా సక్రమంగా ఉందా?" అన్నాడు విశ్వనాధం ఆత్రుతగా.

"అన్నీ తర్వాత చెబుతాను. ముందు నేను చెప్పినట్లు చేయించు—"

పావు గంటలో అన్ని ఏర్పాట్లూ జరిగాయి.

"మరి నేను వస్తాను...." అన్నాడు కాంతారావు....

"పెట్టె నువ్వే తీసుకు వెడుతున్నావు...." అన్నాడు విశ్వనాథం.

"బుద్ధి తక్కువై నీతో వ్యాపారం ప్రారంభించాను. తెలివైనవాళ్ళు రెండు పొరపాట్లు చెయ్యరు. ఇంక నీకూ నాకూ ఏ సంబంధం లేదు...." అన్నాడు కాంతారావు.

"అంతా అయోమయంగా ఉంది నాకు. నన్నేం మాట్లాడనివ్వడం లేదు నువ్వు. సుడిగాలిలా వచ్చి వెళ్ళిపోతున్నావు. అసలేం జరిగిందో చెప్పడం లేదు...." అన్నాడు విశ్వనాథం.

"చెప్పడానికేముందీ — నా శ్రేయోభిలాషి ఒకరు ఫోన్‌లో నన్ను నీ మోసం గురించి హెచ్చరించడం జరిగింది. సమయానికి వచ్చి నా సరుకు నేను దక్కించుకున్నాను...." అన్నాడు కాంతారావు.

ఆయన కార్లో కూర్చున్నాడు. క్షణాలమీద కారు రివ్వుమంటూ దూసుకుపోయింది.

రామం, విశ్వనాథం ఇంట్లోకి వెళ్ళారు.

"ఆయన మీ మీద అంత అథార్టీ చెలాయిస్తారేమిటి?" అన్నాడు రామం కోపం, ఉక్రోషం మిళితం చేసి.

"ఆయన భాగస్వామిగా ఉంటే ఎంత అథార్టీ చేసినా భరించవచ్చు. చూస్తూండగా రెండు మూడు లక్షల బేరం పోయింది—" అన్నాడు విశ్వనాథం.

"పోతేపోయిందిలే నాన్నా—మనం మరో వ్యాపా

రంలో కూడదీసుకోవచ్చు. మీరు విచారించకండి!" అన్నాడు రామం.

"ఈ ఒక్క బేరం గురించి కాదు నా బెంగ! ఇలాంటి బేరాలు మొత్తమన్నీ పోయాయి. కాంతారావు దగ్గర్నుంచి ఇలాంటివి నెలకు రెండు తక్కువ కాకుండా దొరుకుతాయి. అదీకాక కాంతారావు నాతో విడి పోయాడని తెలిస్తే ఇంకా చాలామంది నానుంచి విడి పోతారు. మన దర్జాలంతా ఈ చిల్లర వ్యాపారాలతోనే తప్ప అసలు వ్యాపారాలతో కాదు. అసలు నేను ధియేటరెలా కట్టాననుకుంటున్నావ్?" అన్నాడు విశ్వ నాథం. ఆయన గొంతు దీనంగా ఉంది.

తండ్రి చాలా పెద్ద దెబ్బ తిన్నాడని గ్రహించాడు రామం. ఆ పెట్టిలో కొన్ని లక్షలు చేసే సరుకుండి ఉంటుంది. ఇలా తండ్రి చాలా లాభాలు గడిస్తున్నాడు. ఆ లాభాలన్నీ ఇప్పుడు ఆగిపోతాయి.

"ఇదంతా ఆ పక్కింటివాళ్ళు చేశారు. వాళ్ళని నాలుగు తంతే బుద్ధి వస్తుంది...." అన్నాడు రామం.

"ఇంట్లో బాంబు సంగతి మరిచిపోకు...." అన్నాడు విశ్వనాథం.

"అది నిజమో, కాదో!" అన్నాడు రామం.

"అలాగని రిస్కు తీసుకోలేముగదా!" అన్నాడు విశ్వనాథం.

"అసలు పక్కవాళ్ళింటికి వెడుతూంటేనే మనకు అనుమానం రావాలి. మనింట్లో ఏదైనా పేల్తుందా అని- అలాంటిదేం జరగలేదు...." అన్నాడు రామం.

ఇంతలో ఒక పనివాడలా పరుగున వచ్చి—"వాడ్లో రేకుల షెడ్డు కూలిపోయిందండి—" అన్నాడు.

తండ్రీ కొడుకులిద్దరూ కంగారు పడ్డారు.

ఆ మధ్య మేడమీద కొత్త గదులు కట్టినప్పుడు సిమెంటు దాచడం కోసమని దొడ్లో రేకుల షెడ్డు ఒకటి కట్టారు. అదిప్పుడు కూలిపోయింది.

తండ్రీ కొడుకులిద్దరూ దొడ్లోకి పరుగెత్తారు.

షెడ్డు కూలిపోవడం నిజమే! అదెలా జరిగిందో తెలియదు.

విశ్వనాథం ముఖం కదుక్కుంటూండగా ఫోన్ కాల్ ఒకటి వచ్చింది—"మిష్టర్ విశ్వనాథం! ఇంట్లో గదెందుకులే అని దొడ్లో రేకుల షెడ్డుతో వదిలిపెట్టాను. శాంపుల్ చూశావుగా. మీ పొరుగింటివాళ్ళు అమాయకులు. వాళ్ళ జోలికి వెళ్ళకు. అమాయకుల జోలికి వెడితే నీ యింట్లో బాంబు పేలుతుంది...."

రామం అందుకుని విన్నాడది. కంఠం స్త్రీది.

స్త్రీ అనగానే అతడికి సునంద గుర్తుకొచ్చింది.

అవును—ఆ కంఠం సునందదే!

రామం సునంద ఇంటికి పరుగెత్తాడు. అసలీ నాటకమంతా ఏమిటో ఆమెను అడిగి తెలుసుకోవాలి. గట్టిగా హెచ్చరించాలి.

అతను నిన్న తను వెళ్ళిన ఇంటికి వెళ్ళాడు.

ఓ యువకుడు తలుపు తీశాడు.

"సునందతో మాట్లాడాలి!" అన్నాడతను.

"సునంద ఎవరు?" అన్నాడా యువకుడు.

రామం ఎంత చెప్పినా సునంద ఎవరో ఆ యువకుడికి అర్థంకాలేదు. అలాంటి పేరుగల అమ్మాయి ఆ ఇంట్లో ఎప్పుడూ ఉండలేదని అతను నొక్కి వక్కాణించాడు.

"పోనీ — నా తృప్తికోసం — ఒక్కసారి సునంద

ఉందని నేననుకున్న గదిని చూడనిస్తారా?" అన్నాడు రామం.

"దానికేముంది చూడండి!" అన్నాడు ఆ యువకుడు.

రామం ముందు నడువగా ఆ యువకుడు అతన్ని అనుసరించాడు. ఇద్దరూ ఒక గదిలోకి వెళ్ళారు. గదిలో మూలగా ఒక వీణపెట్టె ఉంది.

"ఆ పెట్టె నేను తెరిచి చూడొచ్చా?" అన్నాడు రామం.

ఆ యువకుడు రామం వంక ఆశ్చర్యంగా చూసి— "చూడాలనుంటే చూడండి!" అన్నాడు.

రామం వీణపెట్టె తెరిచి చూసి ఆశ్చర్యపడ్డాడు— అందులో వీణ వుంది. శవంలేదు.

"అరే — ఇందులో వీణ ఉంది!" అన్నాడు రామం ఆశ్చర్యంగా.

ఆ యువకుడు నవ్వుతూ—"వీణ పెట్టెలో వీణలుండక శవాలుంటాయా?" అన్నాడు.

రామం ఉలిక్కిపడి — "కానీ — ఇందులో శవమే ఉండాలి!" అన్నాడు.

ఆ యువకుడతనివంక తీవ్రంగా చూసి — "ఇలాంటి జోకులు నాకు నచ్చవు—" అన్నాడు.

# 10

రామానికి సునంద వివరాలు తెలియలేదు. రెండు రోజులు అతను వృధా ప్రయత్నాలుచేసి విసిగిపోయి మూడో రోజు బీచికి వెడితే అతడికి అక్కడ సునంద కనబడింది. ఆశ్చర్యంగా అతడామెను సమీపించి— "నువ్విక్కడున్నావా?" అన్నాడు.

ఆమె నవ్వి—"నీ పేరు రామంకదూ—" అంది.

"ఇంకా నయం-నన్నెరగనన్నావు కాదు.." అంటూ అంటూ ఆమె పక్కనే కూర్చున్నాడు రామం. ఆమె ఇబ్బందిగా కాస్త పక్కకు కదిలింది.

"నువ్వు హంతకురాలివి...." అన్నాడు రామం.

"నువ్వు మోసగాడివి...." అంది సునంద.

"నేను హంతకురాలికే మోసగాడి నేమో!" అన్నాడు రామం.

"బాగా చెప్పావు. అయితే నేను హంతకురాలినని మోసగించానేమో—ఆ విషయం ఊహించావా?" అంది సునంద.

రామం ఉలిక్కిపడి-"నువ్వు నన్ను చాలా విధాలుగా మోసం చేశావేమోనని నాకు అనుమానంగా వుంది—" అన్నాడు.

"అవును. చేశాను...." అంది సునంద తాపీగా.

"ఎందుకు?" అన్నాడు రామం.

"అందుకు నువ్వే కారణం...." అంది సునంద.

"నేనా?" రామం ఆశ్చర్యపడ్డాడు.

"అవును. నువ్వే? ఈ ఊళ్ళోని కళ్యాణి థియేటర్ మాదేనన్నావు. మీ నాన్న సీకా థియేటర్ వదిలేస్తా డన్నావు. మీకింకా చాలా వ్యాపారాలున్నాయన్నావు. నిన్ను పెళ్ళిచేసుకోమని మీ నాన్న, ఆడపిల్లల తండ్రులు బలవంత పెడుతున్నారన్నావు. ఇవన్నీ చెప్పి నన్ను పెళ్ళి చేసుకుంటానన్నావు....గుర్తుందా" అంది సునంద.

"గుర్తుంది."

"నువ్వు చెప్పిందాంట్లో నీవాళ్ళ గురించే కానీ నీ గురించి ఏమీ లేదు. నీ చుట్టూ వున్న వాతావరణం చూసుకుని అది నీ గొప్పతనమేనన్నట్లు మాట్లాడావు.

రెండ్రోజులు కాలేజి చుట్టూ తిరిగి—నా క్లాసు వివరాలు తెలుసుకున్న నువ్వు — నీవాళ్ళ వివరాలు చెప్పగానే ఎగిరి గంతేసి నీతో పెళ్ళికి ఒప్పుకుంటాననుకున్నావు. కానీ నేను నీకు నా వాళ్ళ గురించి చెప్పదల్చుకోలేదు. నా అర్హతల గురించి కూడా మాట్లాడదల్చుకోలేదు. నేనేం చేయగలనో చేసి చూపించాను. ఇరవైనాలు గంటల్లో నిన్నూ, మీ నాన్ననూ గడగడలాడించాను. మీ జాతకాలు మారిపోయేలా చేయగలను. ఇప్పుడు నీకు నా ప్రేమభిక్ష అడిగే అర్హత ఉన్నదో లేదో ఆలోచించుకో—" అంది సునంద.

రామం ఆశ్చర్యంగా ఆమెవంక చూస్తున్నాడు.

"నేను అహంకారాన్ని సహించను. మరోసారి నా దగ్గర అహంకారాన్ని ప్రదర్శించకు...." అంది సునంద.

"ఎలా సాధించావన్నీ!" అన్నాడు రామం.

"అవన్నీ నీ కెందుకు చెప్పాలి?" అంది సునంద.

"నా కళ్ళముందు సుందరాన్ని చంపావు. దాంతో నా మతి పోయింది. అదెలా జరిగిందో ఇప్పటికీ నే నూహించలేకున్నాను...." అన్నాడు రామం.

"అదో పెద్ద సందేహమా? నాతో రా...." అంటూ సునంద లేచింది. ఇద్దరూ బీచి రోడ్డుమీదకు వచ్చారు. అక్కడ ఓ పిట్టగోడకు అంటించిన పోస్టర్ రామానికి చూపించింది సునంద.

"ప్రముఖ మెజీషియన్, హిప్నాటిస్ట్ డాక్టర్ సుందర్రావు అద్భుత మహేంద్రజాల ప్రదర్శన...." అని వుంది దానిమీద. పోస్టర్ మీద ఓ యువకుడి బొమ్మ ఉన్నది. అతడి గుండెల్లోకి కత్తి దిగివున్నది. కత్తి దిగిన చోటనుంచి రక్తం ధారలుగా కారుతున్నది.

"సుందర్రావు నా బావ!" అంది సునంద—"నిన్ను సాధించడంలో అతడు చాలాచోట్ల నాకు సాయ పడ్డాడు. అతడి కారణంగానే ఎవరైనా మేమడిగింది చేయడానికి ఒప్పుకున్నారు. మీ రంగడిని తేలికగా మన్ను కరిపించిందీ అతనే! మీ షెడ్లో బాంబు పెట్టిం చిందీ అతనే!"

"మరి కాంతారావుగారు మా యింటికి వీణ పెట్టి పంపుతారని నీకెలా తెలుసు!" అన్నాడు రామం.

"అది తెలిసే కదా పథకం మొత్తం బావ రూపొం దించాడు ..." అని నవ్వింది సునంద.

"అదే....అదే....ఎలా తెలిసింది?"

"కాంతారావుగారు మా నాన్నగారు...." అంది సునంద.

రామానికి నోట మాటరాలేదు.

"నా ఎదుట చాలా గొప్పలు చెప్పావు. నువ్వూ మీ నాన్నా కలిసి మా యింటికొచ్చి నాముందు లెంపలేసు కుంటే మా నాన్నగారికి అసలు విషయం చెప్పి మళ్ళీ మీ వ్యాపారం వృద్ధిపొందేలా చేస్తాను. ఆలోచించుకో!"

రామం అక్కడే కూర్చుండిపోయాడు.

సునంద లేచి వెళ్ళిపోయింది. అప్పుడామె ఈ ప్రపం చానికే మహారాణిలా నడుస్తోంది.

—:ఐ పో యిం ది:—

# ఒక పుర్రె రెండు ఎముకలు

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

"విూకు మద్రాసునుండి ట్రంక్ కాల్!" అన్నాడు సారధి.

డిటెక్టివ్ శిరీష్ తన అసిస్టెంటువైపు ఆలోచనగా చూసాడు.

"ఎవరో కనుక్కున్నావా?" అడిగాడు శిరీష్.

"విూ ఫ్రెండు చలపతి!" నవ్వాడు సారధి.

శిరీష్ నవ్వాడు. చలపతి ప్రసక్తి వస్తే తమ ఇద్దరికీ హాస్యంగా వుంటుంది.

శిరీష్ చటుక్కున ప్రక్క గదిలోకి పరుగెత్తాడు. రిసీవర్ చెవిదగ్గర వుంచుకుని, "చలపతీ!" అన్నాడు.

"శిరీష్ భాయ్! నా ప్రాణాలు ప్రమాదంలో పడ్డాయి!" అన్నాడు చలపతి.

శిరీష్ నవ్వాపుకొంటూ, "ఎప్పట్నించి?" అన్నాడు.

"అయిదు నిమిషాల క్రితంనుండీ అనుకుంటాను!"

"వివరంగా చెప్పు!"

"నిన్న అర్ధరాత్రి నాకు అకస్మాత్తుగా మెలకువ వచ్చింది. నా కిటికీ అద్దంమీద ఎవరిదో నీడపడింది. నేను లేచిన అలికిడికి అతడు పారిపోయాడు!"

"ఎవరో దొంగ యేమో!"

"తెల్లవారి లేచేసరికి నా గది గుమ్మం ముందు ఒక పుర్రె, రెండు ఎముకలు వున్నాయి."

"మీ డైరెక్టరు జానపదం తీస్తున్నాడా?"

"మా గురువుగారు అసలు అలాంటి సబ్జెక్టు ఎత్తుకోరు?"

"మీ ప్రక్క ఫ్లోర్‌లో ఏవైనా జానపద చిత్రాలు."

"లేదు!"

"అయితే పుర్రె ఎముకలు స్మశానంనుండే ఎవరైనా తెచ్చి గుమ్మంలో పెట్టారంటావా?"

"అవును మట్టి కొట్టుకుపోయి వున్నాయి!"

"ఎవరో నిన్ను ఆటపట్టించడానికి...."

"అలాగే అనుకున్నాను. కాని ఈ రోజు....అయిదు నిమిషాల క్రితం ఒక సంఘటన జరిగింది."

"ఏమిటది?"

"అవుట్ డోర్ షూటింగ్ జరుగుతోంది. మా గురువుగారే ఆ చిత్రం తీస్తున్నాడు. కథా, స్క్రీన్ ప్లే దర్శకత్వం నిర్వహిస్తున్నారు. చిత్రంలో ఒక ముఖ్య పాత్ర కూడా వేస్తున్నారు."

"సంగీతం కూడా నిర్వహించమను."

"నీ సూచన ఆయనకు అందిస్తాను!"

"గుడ్. ఇప్పుడు చెప్పు!"

"అవుట్ డోర్ షూటింగ్‌లో ఒక పెద్ద బండరాయి నా వైపు దొర్లుతూ వచ్చింది. కాస్తలో తప్పుకున్నాను!"

"ఎవరో తోసివుంటారనా నీ అనుమానం?"

"అవును. రాయి వుండవలసిన ప్రాంతంలో పాదలున్నాయి. ఆ పాదల్లో అలికిడయినట్టు నాతోబాటు వున్న సాంకేతిక నిపుణులు చెప్పారు."

"రాతిని తోసినవాడు కనిపించలేదా?"

"లేదు! యూనిట్ లో అందరూ కంగారు పడ్డారు."

"నీ అనుమానం ఎవరిమీదనో చెప్పు!"

"యూనిట్ అంతా అక్కడే వుంది! అందరూ పరామర్శించారు."

"ఎక్కడినుండి ఫోన్ చేస్తున్నావు?"

"లొకేషన్ కి దగ్గర్లో నే గెస్టు హౌస్ వుంది! అక్కడి నుండి!"

"నీ మాటలు ఎవరూ వినడంలేదుకదా!"

"ఈ గదిలో ఎవరూ లేరు!"

శిరీష్ నుదురు చిట్లించాడు. చలపతిమీద హత్యాప్రయత్నం జరిగింది. అతడు చనిపోతే ఎవరికి లాభం? చలపతికి వెనకా ముందూ ఎవరూ లేరు. పదేళ్ళ వయసప్పుడే మద్రాసు పారిపోయాడు. ఈ ఇరవై సంవత్సరాలూ ఏం తిన్నాడో, ఎలా బతికాడో తెలియదు. ఒక ప్రముఖ దర్శకుడి దగ్గర అసోసియేట్ డైరెక్టర్ గా పనిచేస్తున్నాడు.

"నావల్ల నీకు ఏం సహాయం కావాలి?"

"నా ప్రాణాలను కాపాడాలి!"

"తప్పకుండా."

"ఫోన్ లో మాట్లాడలేని వ్యవహారం ఒకటి నీతో చెప్పుకోవాలి."

"ఎలా చెబుతావు? నీకు యిటు ప్రక్క షూటింగు

లున్నారా?"

"లేవు. కాని అటు వస్తాను!"

"ఎప్పుడు?"

"ఈ రోజు ఏప్రిల్ 16. ఈ నెల 20వ తారీఖున కలకత్తాలో ఫిలిం ఫెస్టివల్ వుంది. దానికి నేనూ, మా డైరెక్టర్ గురువుగారు హాజరవుతాం."

"ఫిలిం ఫెస్టివల్‌లో మీ చిత్రం కూడా ప్రదర్శనకు వుందా?"

"అవును. 'ప్రేమ! ప్రేమ! ప్రేమ!' చిత్రం."

"అబ్బ! మూడే పెట్టారేం? ముప్పయిసార్లు ప్రేమ జపం చేయాల్సింది!"

"ప్రేమ అంటే నీకు కోపం ఏమిటి?"

"జీవితంలో యింక ఏమీ లేనట్టు ముసలినటులకు పడుచుపిల్లలకు ప్రేమ! మీ ప్రేమ చిత్రాలు నాకు వాంతి అయేలాగా చేస్తాయి."

"అంత వాంతిగా వుంటే చూడవద్దు!"

"సలహాకి కృతజ్ఞుడిని!"

"నేను ఏప్రిల్ 18 నాటి మెయిలుకి వాల్తేరులో దిగుతాను."

"మెయిల్ మద్రాసునుండి మధ్యాహ్నం ఒంటిగంట పదినిముషాలకు వస్తుంది."

"18 నాటి మెయిలులో నన్ను రిసీవ్ చేసుకోవాలి!"

"రిజర్వేషన్ చేయించుకున్నావా?"

"ఆఁ! టూ టయర్ కంపార్టుమెంటులో నాలుగో బెర్తు."

"ఆగు. ఎంగేజ్‌మెంట్ చూడనివ్వు!" శిరీష్ తల త్రిప్పి సారధివైపు చూశాడు.

సారథి పాడ్ అందించాడు.

"నాకు 18 నాడు పూర్తి ఎంగేజ్‌మెంట్ వుంది."

"కాన్సిల్ చేసుకో ప్లీజ్...."

"వద్దు. పోలీస్ ఉన్నతాధికారుల సమావేశం! ప్రత్యేకంగా పిలిచారు!"

"రైట్! నేను మెయిల్ దిగి లాడ్జి త్రివేణిలో దిగుతాను. నీ సమావేశం ముగియగానే లాడ్జికి వచ్చెయ్."

"తప్పకుండా. నువ్వొక్కడివే వస్తున్నావా?"

"మా డైరక్టర్‌గారూ, ఇతర ముఖ్యులూ అదే రోజు మెయిల్‌లో రిజర్వు చేసుకున్నారు మరి! మెయిల్ ఎక్కేవరకూ మా సినిమా మనుషులను నమ్మడానికి లేదు!"

"18 సాయంత్రం నిన్ను త్రివేణిలో కలుస్తాను!"

"తప్పకుండా. ఆ రోజు రాత్రి కోరమాండాల్‌కి నన్ను సాగారా పంపెయ్యాలి మరి!"

"అలాగే...."

అవతల చలపతి సెలవు పుచ్చుకున్నాడు.

శిరీష్ మెల్లగా రిసీవర్‌ను క్రెడిల్ చేశాడు.

"ఏమంటాడు సార్ చలపతి?" అడిగాడు సారథి.

"చలపతిమీద ఈ రోజు బండదొర్లించారు ఎవరో. అతడు మన రక్షణ కోరుతున్నాడు. నువ్వు చేయవలసిన పనివుంది. మెయిల్‌కి వెళ్ళి చలపతిని ఫాలో కావాలి. అంతేకాదు...."

"అతడిని ఎవరయినా ఫాలో అయితే వాళ్ళను కూడా గుర్తించాలి."

"గుడ్. మన ఫోటో ఆల్బం తీసుకురా!"

సారథి ఆల్బంతో ప్రత్యక్షమయ్యాడు.

"నువ్వు చలపతిని చూడలేదు. కాని అతడి హాస్యం తీరుతెన్నులు నీకు బాగా తెలుసు!" శిరీష్ ఒక ఫోటో చూపించాడు.

సారథి ఫోటోవైపు పరీక్షగా చూశాడు.

చలపతి స్ఫురద్రూపి. వంకీల జుత్తు. కుడి పాపిడి. దట్టమైన కనుబొమలు. పల్చటి కోరమీసం. కళ్ళల్లో చిలిపితనం.

"త్రివేణి లాడ్జిలో అతడు గది తీసుకుంటాడు. అతడి గది దగ్గర నువ్వు కాపలా వుంటావు. నేను సాయంకాలం నాలుగూ ఆయిదూ మధ్య లాడ్జికి వస్తాను."

"అలాగే సర్!"

## 2

"చలపతీ!" పిలిచాడు డైరెక్టర్ బోస్.

చలపతి సెట్టులోంచి నడిచి ఆయిన కుర్చీవద్దకు చేరుకున్నాడు.

"ఈ రాత్రికే మన ప్రయాణం, అవునా?" అడిగాడు బోస్.

చలపతి తలూపాడు.

"సీన్ అరవైలో పన్నెండో షాట్ పాడయింది!"

"ఏమిటి సార్? మీరు స్వయంగా షూట్ చేశారు!"

"అవును. డైలాగ్‌లో హీరోయిన్ లెన్స్‌లోకి చూచింది!"

చలపతి నిట్టూర్చాడు.

"అప్పలమ్మలు! లక్షలు తీసుకుంటారు బ్లాకులో, ఏమీ నేర్చుకోరు!"

"స్పీడ్ పెరిగిపోయింది సార్! నేర్చుకోవలసిన అవసరం వాళ్ళకు కలగడంలేదు."

"అవును. ఆ మంచి సాంప్రదాయాలు సావిత్రి తరంతోనే పోయాయి!"

చలపతి తలూపి, "నన్ను షూట్ చేయమంటారా సార్?" అన్నాడు.

"అవును."

చలపతి ఉత్సాహంగా షూటింగుకు ఏర్పాటు చేశాడు. నాలుగు రీటేకులతో సీన్ బాగానే వచ్చింది.

బోస్ తృప్తిగా చలపతి భుజం తట్టాడు.

"చలపతిగారూ! మీకు ఫోన్ వచ్చింది!" అన్నాడు లైట్ బాయ్.

చలపతి ఫోన్ వున్న గదిలోకి నడిచాడు.

"చలపతీ!" ఫోన్‌లో ఎవరో పిలిచారు.

"అవును. నేనే!" అన్నాడు చలపతి.

"ఏం చేశావ్?"

"సారీ! నేను చేయలేను!"

"ఆల్ రైట్! నువ్వు స్క్రిప్టు యివ్వలేకపోతే పదివేల రూపాయిలివ్వు!"

"పదివేల రూపాయలా? ఎందుకు యివ్వాలి?"

"ఆ స్క్రిప్టు దొంగిలించడానికి నేను లంచం పెట్టాలి!"

"అంటే నా డబ్బుతో...."

"అవును. నువ్వు స్క్రిప్టు దొంగిలించివుంటే నీకు పదివేల రూపాయలు ఎదురు ఇచ్చేవాడిని."

"నాన్సెన్స్.... నేను గురుద్రోహం చేయను!"

"అయితే అనుభవించు. ఈ సాయంత్రంలోగా నువ్వు పదివేలు రూపాయలు ఇవ్వకపోతే చస్తావ్!"

"ఆc!" అవతల క్లిక్కుమన్నది.

చలపతి చెమటలు కక్కసాగాడు. ఈ సాయంకాలమే తన ప్రయాణం. తన దగ్గర అంతా కలిపి అయిదువేల రూపాయిల చిల్లర వుంది బాంకు బాలన్సు. పదివేల రూపాయలు ఎక్కడనుండి తీసుకురాగలడు? తీసుకువచ్చినా అతడికి ఎందుకు యివ్వాలి?

చలపతికి తలలో దీపం వెలిగింది. తనకి ఇప్పుడు ఫోన్ చేసింది ఎవరు?

చటుక్కున చలపతి ఎక్స్ఛేంజ్ కి ఫోన్ చేశాడు.

"మీకు 648 91 నుండి ఫోన్ వచ్చింది" అంది ఆపరేటర్. ఎవరో ఇదే స్టూడియోలో వున్న ఇతర ఫ్లోర్ నుండి ఫోన్ చేశారన్నమాట! ప్రక్క ఫ్లోర్ లో రాధికా పిక్చర్స్ వాళ్ళ షూటింగు జరుగుతోంది.

చలపతి అటు నడిచాడు.

షూటింగు హడావుడిగా వుంది. యూనిట్ లో ప్రతి ఒక్కరూ బిజీగా వున్నారు.

చలపతి టెలిఫోన్ వున్న గదిలోకి నడిచాడు. ఆ గదిలో ఎవరూ లేరు. తనకి ప్రస్తుతం టెలిఫోన్ కాల్ ఇక్కడినుండే వచ్చింది. బల్లమీది మేకప్ సామగ్రి లోంచి ఫేస్ పౌడర్ తీసుకున్నాడు. టెలిఫోన్ సెట్టు మీద చల్లాడు.

సెట్టుమీద వ్రేలిముద్రలు స్పష్టంగా వున్నాయి.

చలపతి గుండెలు గుబగుబలాడాయి. తనని హత్య చేస్తానని బెదిరించినవాడి వ్రేలిముద్రలివి.

చటుక్కున తన ఫ్లోర్ లోకి పరుగెత్తాడు.

స్టిల్ ఫోటోగ్రాఫర్ను బతిమాలుకుని కెమేరా పుచ్చుకున్నాడు. టెలిఫోన్ సెట్టుమీది వ్రేలిముద్రలు ఫోటోలు తీసుకున్నాడు.

# 3

ఫిలింను స్వయంగా డెవలప్ చేయసాగాడు చలపతి.

మొత్తం ఆరు స్నాప్స్. వ్రేలిముద్రలు స్పష్టంగా వచ్చాయి. అయితే ఆవి ఎవరివి?

తనకి ఫోన్ చేసిన వ్యక్తి రాధికా ప్రొడక్షన్స్‌కి చెందినవాడా? తన బాస్‌వద్ద అపహరించవలసిన స్క్రిప్టు ఎవరికి కావాలి? ఎందుకు? ఆ స్క్రిప్టును సినిమా తీయడానికా? లేక బోస్ పేరుప్రఖ్యాతులకు అసూయపడి ఈ ఘోరం తలపెట్టారా?

చలపతి తలలో మెరుపు మెరిసింది.

డెవలపింగ్ రూంలోంచి బయటికి వచ్చాడు.

కెమెరాను మరల ఫిలింతో లోడ్ చేశాడు.

గంట తర్వాత బయటకు నడిచాడు. ఫిలించుట్టను పై జేబులో పెట్టుకున్నాడు.

బట్టలు సర్దుకున్నాడు. సెంట్రల్ స్టేషన్‌కి బయలుదేరాడు.

సెంట్రల్ స్టేషన్ రద్దీగా వుంది. మెయిలు సిధ్ధంగా వుంది.

కృష్ణ, వాసూ, బోస్ ఇతర చలనచిత్ర ప్రముఖులూ ఎదురయారు. చలపతి తన కూపేలో ఎక్కి కూర్చున్నాడు. అన్యమనస్కంగా వున్నాడు.

"చలపతీ!" పిలిచాడు బోస్.

చలపతికి తల తిరిగిపోయింది. జేబులోంచి ఫిలించుట్ట మాయమయింది. ఫిలించుట్టను ఎవరు తీశారు?

తనను కలుసుకున్న దెవరు! గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు. అందరూ తనకి బాగా పరిచితులు.

వాసూ, బోస్, కృష్ణ, విశ్వం, కెమెరామన్

షణ్ముగం, అసిస్టెంట్ డైరెక్టర్ నందలాల్ ....వీళ్ళలో ఒకరు తన జేబులోంచి ఫిలించుట్ట దొంగిలించారు. ఆ దొంగే హంతకుడిగా తనని బెదిరిస్తున్నాడా?

"చలపతీ!" బోస్ అతడి భుజంతట్టి, "నీకు నా కూపేలో సీటూ బెర్తూ రిజర్వ్ చేశాను!" అన్నాడు.

"వద్దు సార్! నేను ఒక్కడనీ ఒక్క కూపేలో ప్రయాణం చేస్తాను!" అన్నాడు చెమటలు కక్కుతూ.

"అదేమిటోయ్ చలపతీ!"

"అంతే సార్! నన్ను క్షమించండి!"

కృష్ణ ముందుకు నడిచి, "చలపతీ!" అన్నాడు భావగర్భితంగా.

"కృష్ణా! నువ్వు కూడా నీ ఏర్పాటు చూసుకో!" చలపతి తన కూపే తలుపు వేసుకున్నాడు. కూపే మొత్తం బుక్ చేసుకోవడం మంచిదయింది.

దొంగిలించిన ఫిలించుట్టలో తన వ్రేలిముద్రలున్నాయి. ఎందుకయినా మంచిదని తానే రెండోసారి తన వ్రేలి ముద్రలు ప్రింటువేశాడు. ఇప్పుడు ఆ ఫిలిం పోయింది. అంటే తనని బెదిరించినవాడు తనపు ఫాలో అవుతున్నాడు.

అసలు టెలిఫోన్ మీది వ్రేలిముద్రలు ఎయిర్ బాగ్ లో భద్రంగా వున్నాయి.

పావుగంట తర్వాత మెయిలు కదిలింది.

## 4

టాయ్ లెట్ రూంలో అద్దంముందు నిలబడ్డాడు చలపతి. రాత్రంతా మత్తుగా నిద్రపట్టింది. కూపే లోపలివైపు తాళంపెట్టి పడుకున్నాడు తను. కాంపోజ్

మాత్ర వేసుకోవడం మంచిదయింది.

అద్దంలో తన మొహం తేరుకుంది.

చలపతి కిటికీలోంచి బయటకు చూశాడు. లక్ష్యం వైపు పరుగెత్తే మనిషిలాగా మెయిలు పరుగెత్తుతోంది.

ఉదయం పదకొండు గంటలయింది. మరో రెండు గంటల్లో తాను వాల్తేరులో దిగుతాడు.

కిటికీ మూసి లైటు వేశాడు చలపతి. మేకప్ సామగ్రి తీశాడు. చకచక మేకప్ చేసుకోవడం మొదలుపెట్టాడు. ముప్ఫయి సంవత్సరాల చలపతి నలభైఅయిదు సంవత్సరాలవాడిలాగా తయారయాడు.

బుగ్గమీద చిన్న క్రొవ్వు మడతలు సృష్టించుకున్నాడు. చెంపలూ పాపిడీ నెరిశాయి. కనుబొమలు గ్రేకలర్‌లో వున్నాయి. షర్టువేసి పాంటు టక్ చేశాడు. కళ్ళకు రిమ్‌లెస్ అద్దాలు తగిలించాడు.

తన ప్రతిబింబం సంతృప్తికరంగా మారింది.

మెయిలు అనకాపల్లిలో ఆగింది.

చలపతి కిటికీ కొద్దిగా తెరచి ప్లాట్‌ఫాంమీదకు చూశాడు. ప్రయాణీకులు ఎవరి గొడవలో వాళ్ళున్నారు.

మెయిలు అరగంట తర్వాత వాల్తేరు ప్లాట్‌ఫాం మీద ఆగింది. చలపతి బాగ్ సర్దుకుని పట్టాలమీదుగా దిగేశాడు. అటూ యిటూ చూచి అవతలి ప్లాట్‌ఫాం మీదకు గెంతాడు.

తనని చలపతిగా ఎవరూ గుర్తించలేరు. అందుకే తనని ఎవరూ ఫోలో కావడంలేదు.

ప్లాట్‌ఫాం చివరకు వెళ్ళి పట్టాలమీదుగా తిరిగి మొదటి ప్లాట్‌ఫాంమీదకు వచ్చాడు. చివరిగేటులో

న్న టికట్ కలెక్టర్ కి టికట్ అందించాడు.

కలక్టర్ టికట్ పరీక్షగా చూచి, 'బ్రేక్ జర్నీ' ని తలూపి సంతకం పెట్టి ఇచ్చేశాడు.

చలపతి బయటకు పరుగెత్తాడు.

టాక్సీ పట్టుకున్నాడు. త్రివేణి లాడ్జిలో అడుగు ట్టాడు. రూం నెంబర్ ఇరవై తాళంచెవులు తీసుకుని యిటర్ తో నడిచాడు.

"వెయిటర్! నువ్వు వెళ్ళు. రూం తెలుసులే నాకు!" న్నాడు చలపతి.

వెయిటర్ తలూపాడు. వెనక్కి తిరిగాడు.

చలపతిలో నడవాలో కదిలాడు. నడవాలో ఎవరూ రు. చలపతి గది తాళం తెరిచాడు. లోపలకు అడుగు ట్టాడు. తలుపు మూశాడు.

అతడి కళ్ళు విచ్చుకున్నాయి.

"నువ్వా?" అన్నాడు చలపతి.

అతడు సమాధానంగా పిస్తోలు తీశాడు. సైలెన్సర్ మర్చాడు.

"చంపు....తా....వా?" చ ల ప తి మాట పూర్తి -నేలేదు.

సైలెన్సర్ అమర్చిన పిస్తోలు చుప్ చుప్ అంది.

చలపతి కట్టె విరిగినట్టు విరుచుకు పడిపోయాడు. ంచెకు తూట్లు పడినట్టు రక్తం చిమ్ముతోంది.

చలపతి భుజాన వున్న ఎయిర్ బాగ్ తీసుకున్నాడు తడు. తలుపు తెరచి బయటకు నడిచాడు.

నడవా ఖాళీగా వుంది.

రూం నెంబర్ పదిముందు ఆగాడు.

# 5

బలంగా నిట్టూర్చి మెయిల్ ప్లాట్ ఫాంమీద ఆగింది. సారథి ప్రయాణీకులను తప్పించుకుంటూ మెయిల్ కూపేలు వెతుకొ్క్సాగాడు.

నాలుగో నెంబర్ కూపేముందు ఆగాడు.

కూపే ఖాళీగా వుంది. కూపేమీద చలపతి పేరు వుంది.

సారథి ప్లాట్ ఫాంమీదకు చూశాడు. జేబులోంచి చలపతి ఫోటోతీసి ప్రయాణీకులలో వెతుకుతోన్నాడు.

పది నిముషాలు గడిచాయి.

ప్రయాణీకులు పల్చబడ్డారు.

సారథి స్టేషన్ బయటకు నడిచాడు.

చలపతి వాల్తేర్ వరకూ రాలేదా? మధ్యలో ఎక్కడయినా దిగిపోయాడా? లేకపోతే వాల్తేర్ వరకూ వచ్చి నాన్సెన్స్....తను పప్పులో కాలేశాడు. చలపతి ప్రాణభయంతో బయలుదేరాడు. స్టేషన్ కి శిరీష్ రిసీవ్ చేసుకోవడానికి రానని చెప్పాడు. చ ల ప తి ని ఎవరో మాయంచేసి వుండాలి. లేదా చలపతి అందరి కళ్ళూ కప్పి....

రైట్....ప్లాట్ ఫాం అవతలివైపు దిగి లాడ్జికి చేరుకుని వుంటాడు. సారథి బయట పార్క్ చేసివున్న స్కూటర్ ను సమీపించాడు.

లాడ్జ త్రివేణి మేనేజర్ అతడిని విష్ చేశాడు.

రూం తాళాలు తగిలించే బోర్డు చూశాడు సారథి.

రూం నెంబర్ ఇరవైలో చలపతి దిగాడు. సారథి మేనేజర్ వైపు చూశాడు.

"రూం నెంబర్ ఇరవై ఎంతసేపు క్రితం బాక్

అయింది?" అడిగాడు సారథి.

"పదిహేను నిముషాలు!"

సారథి తలూపి రూంస్ వైపు నడిచాడు.

## 6

టెలిఫోన్ గణగణలాడింది.

పోలీస్ కమీషనర్ తన అతిథులవైపు చూశాడు. పోలీస్ ఇన్స్పెక్టర్లూ, సబ్ఇన్స్పెక్టర్లూ, క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్లూ, డిటెక్టివ్ శిరీష్ ఆయనవైపు ప్రశ్నార్థకంగా చూశారు.

పోలీస్ కమీషనర్ తల పంకించాడు.

ఈ సమావేశం అతి రహస్యంగా ఏర్పాటు చేసిన సమావేశం. ఇక్కడ ఎవరికి ఈ ఫోన్ వచ్చినట్టు?

తటపటాయించి చివరకు పోలీస్ కమీషనర్ రిసీవర్ ఎత్తి, "హాలో...." అని పూరుకున్నాడు.

"డిటెక్టివ్ శిరీష్‌గారున్నారా సార్?"

"మీ రెవరు?"

"ఆయన అసిస్టెంట్ సారథిని సార్!"

"ఉన్నారు. ఏం గావాలి?"

"లాడ్జి త్రివేణిలో హత్య జరిగింది సార్!"

పక్కలో బాంబు పడినట్టు చూశాడు కమీషనర్.

"ఎవరిని హత్య చేశారు?"

"చలపతిని."

"చలపతా? అత డెవరు?"

"ప్రఖ్యాత చలనచిత్ర దర్శకుడు బోస్ కు చలపతి అసోసియేట్ దర్శకుడు."

"నువు అక్కడికి ఎందుకు వెళ్ళావు?"

"సార్! ఈ ప్రశ్నలన్నింటికీ ఇక్కడికి వచ్చాక

చెబుతాను, అన్నట్టు మీరు...."

"అయిదు నిమిషాల్లో అక్కడుంటాం" అని రిసీవర్ను క్రెడిల్ చేశాడు కమీషనర్.

"లాడ్జి త్రివేణికి వెళ్దాం. అక్కడో హత్య జరిగింది" అని సమాధానం కోసం ఎదురు చూడకుండా బయటికి నడిచాడు.

పోలీస్ వాహనాల్లో పోలీస్ అధికార్లూ, డాట్సన్ కారులో డిటెక్టివ్ శరీష్ బయలుదేరారు.

లాడ్జి త్రివేణిలో హోటల్ సిబ్బంది అంతా వరండాలో గుమిగూడారు. సారథి రూం నెంబర్ 20 ముందు నిలబడి వున్నాడు. ఎవరినీ తలుపులు తాకకుండా జాగ్రత్తపడుతున్నాడు. పోలీసులను చూడగానే సిబ్బంది దారి ఇచ్చారు.

రూం నెంబర్ ఇరవైలో పడివున్నాడు చలపతి. వెల్లకిలా పడివున్నాడు. గుండె ప్రాంతంలోంచి రెండు రంధ్రాలద్వారా రక్తం ప్రవహించి గడ్డకట్టివుంది. కండ్లూ పెదిమలూ ఆశ్చర్యసూచకంగా తెరుచుకుని వున్నాయి. వ్రేలిముద్రల నిపుణులు గదిలో వ్రేలిముద్రలు పడే ప్రాంతాలన్నింటిమీదా పౌడర్ స్ప్రే చేయడం మొదలు పెట్టారు.

చలపతి తనకి ఫోన్ చేయడం దగ్గరనుండీ, సారథిని అతడిమీద నిఘాకోసం పంపేటంతవరకూ విడమరచి చెప్పాడు శరీష్.

సారథి తాను రైల్వేస్టేషన్లో చలపతికోసం వెతుక్కోవడం గురించి చెప్పాడు. చివరకు రూం నెంబర్ ఇరవై ముందుకు రావడంతో శవం కనిపించినట్టు చెప్పాడు.

వ్రేలిముద్రల నిపుణులు వ్రేలిముద్రలు సేకరించు

ఉన్నట్టుగా కమీషనర్‌కి తెలియపరిచారు.

పోలీస్ సర్జన్ శవంముందు గొంతుకూర్చున్నాడు. చెయ్యి అందుకున్నాడు. పరీక్ష ముగిశాక

"ఇప్పుడు 2-15 అయింది. హత్య జరిగి గంటకి పైగా గంటన్నరకి తక్కువగా అయి వుండాలి. శవంలో ఇంకా గది టెంపరేచర్ ఎక్జిస్ట్ అవుతోంది" అన్నాడు.

వ్రేలిముద్రల నిపుణులు లాబ్‌కి వెళ్ళిపోయారు.

డిటెక్టివ్ శిరీష్ గదిలో కలియ తిరిగాడు. ఆశ్చర్యంగా చూశాడు.

"చలపతి మద్రాసునుండి వచ్చాడు. తిరిగి ఈ రాత్రికి కోరమాండల్ ఎక్స్‌ప్రెస్సుకి హౌరా వెళ్తాడు. అంటే అతడి వెంట సూట్ కేసో ఎయిర్ బాగో వుండాలి" అన్నాడు శిరీష్.

"కరెక్టు!" తలూపాడు పోలీస్ కమీషనర్. "మిస్టర్ శిరీష్! కేసులో మీరు ప్రొసీడవండి. మిస్టర్ కుమార్— అంటే క్రైంబ్రాంచ్ ఇన్స్‌పెక్టర్ మీకు సహకరిస్తారు!" అన్నాడు.

శిరీష్ అంగీకారపూర్వకంగా తలూపాడు.

సారధిని పిలిచి, "హోటల్ మేనేజర్‌నూ, వెయిటర్‌నూ పిలుచుకురా!" అన్నాడు శిరీష్. "రిజిస్టర్‌ను కూడా తీసుకు రమ్మను!"

సారధి బయటకు నడిచాడు.

"శవాన్ని ఆంబులెన్సులో తరలించండి!" అన్నాడు కమీషనర్.

"ఒక్క అయిదు నిముషాల్సార్!" అన్నాడు శిరీష్.

"ఎందుకు?"

"చలపతి వస్తువులు మాయమయాయి. ఆ విషయం

హోటలువాళ్ళు నిరాకరిస్తారు" శిరీష్ మాట ముగియక ముందే హోటల్ మేనేజరూ వెయిటరూ వచ్చారు.

హోటల్ రిజిష్టర్ తిరగవేసి చూశాడు శిరీష్.

ఒంటిగంటా ముప్ఫయి నిమిషాలకు చలపతి గదిని తీసుకున్నట్టు సంతకం పెట్టాడు.

"చలపతి తనవెంట ఏ సామాను తీసుకువచ్చాడు?" అడిగాడు శిరీష్.

వెయిటర్ మెల్లగా దగ్గి, "ఎయిర్ బాగ్ తెచ్చుకున్నార్సార్! నన్ను తాకనివ్వలేదు!" అన్నాడు.

"అతడిని రూంలో దించావా?"

"నడవాలోనే నన్ను వెనక్కి పంపేశారు సార్!"

"ఎయిర్ బాగ్ ఎలాంటిది?"

"నల్లటి ఎయిర్ బాగ్ సార్!"

"అదే ఎయిర్ బాగ్ తో రెండు గంటలకుముందే ఎవరైనా బయటికి నడిచారా?"

వెయిటర్ ఆలోచనలో పడ్డాడు.

మేనేజర్ ఆలోచించుకుని, "ఎలా చెప్పగలనుసార్? అంతకుముందే అటువంటి ఎయిర్ బాగ్ తో మరొకరు వచ్చారు సార్!" అన్నాడు.

"గుడ్! ఎవరు?"

"జాన్, లింకన్."

"ఇద్దరా? ఏ గదిలో దిగారు?"

మేనేజర్ రిజిష్టర్ తిరగవేశాడు. "డబుల్ రూం, సార్! రూం నెంబర్ 10" అన్నాడు.

శిరీష్ రిజిష్టర్ లోకి చూశాడు. జాన్, లింకన్ ఇద్దరూ ఒంటిగంట ఇరవై నిముషాలకు గదిలో దిగారు. అంటే చలపతి దిగడానికి పదినిముషాలు ముందన్నమాట!

"సారధీ! ఒక్కసారి రూం నెం. 10కి వెళ్ళిరా. వెయిటర్ను వెంటపెట్టుకు వెళ్లు!" అన్నాడు శిరీష్.

సారధి కదలి వెయిటర్ వెంటరాగా బయటకు నడిచాడు.

"మేనేజర్ గారూ! రెండుగంటల ముందుగా జాన్, లింకన్లలో ఎవరయినా బయటికి వెళ్ళారా?" అడిగాడు శిరీష్.

"జాన్ వెళ్ళాడు. తరువాత లింకన్ వెళ్ళాడు. జాన్ భుజాన మాత్రమే బాగ్ వ్రేలాడుతోంది."

"అంటే ఒకరి వెనుక ఒకరు పారిపోయారన్నమాట!"

"పారిపోయి వుండర్సార్. బాగ్ రిపేర్ కన్నట్లు మాట్లాడుకుంటూ వెళ్ళారు. పైగా ఇద్దరూ పాంటులు వేసుకువచ్చారు. రిపేర్కి వెళ్ళేటప్పుడు లుంగీలతో వెళ్ళారు" అని వాళ్ళ రూపురేఖలు కూడా వర్ణించి చెప్పాడు మేనేజరు.

శిరిష్ తల పంకించాడు. ఆ రూపురేఖలు వాళ్ళ మారు వేషాలు కావచ్చు.

సారధి వచ్చాడు.

"రూం నెం. పదిలో నల్లటి ఎయిర్ బాగ్ వుంది సార్! బాగ్లో ఏమీలేవు" అన్నాడు సారధి.

"వ్రేలిముద్రలు చెరపలేదు కదా!"

"లేదు సార్!"

శిరీష్ సాభిప్రాయంగా పోలీస్ కమీషనర్ వైపు చూశాడు. "శవాన్ని ఒకసారి వెతుకుతాను! అనుమతించండి!" అన్నాడు శిరీష్.

పోలీస్ కమీషనర్ అంగీకరించాడు.

క్రైంబ్రాంచ్ ఇన్స్పెక్టర్ కుమార్తో కలసి

శవాన్ని వెతికాడు శిరీష్. శవం వీపు భాగంలో ప్లాస్టర్ అంటించి ఫిలిం దొరికింది. శిరీష్ నెగెటివ్ ఫిలిం విప్పి చూశాడు.

నెగెటివ్ ఫిలింలో టెలిఫోన్ సెట్టు క్లోజప్‌లో అచ్చు అయివుంది. సెట్టుమీద వ్రేలిముద్రలున్నాయి. నల్లటి పొడి చల్లినట్లు వ్రేలిముద్రల చారలు.

"మేనేజర్ గారూ! మనం రూం నెం. పదిలోకి వెళ్దాం!" అన్నాడు కుమార్.

మేనేజర్ తలూపి బయటకు కదిలాడు.

"కమీషనర్ గారూ! శవాన్ని మార్చ్యురీకి తరలించవచ్చుననుకుంటాను!" అన్నాడు శిరీష్.

కుమార్, శిరీష్ బయటకు నడిచారు.

రూం నెం. పది ముందు ఆగారు.

"ఈ గదిలో కూడా వ్రేలిముద్రలుంటాయి!" అన్నాడు శిరీష్.

# 7

"కుమార్! నువ్వు నీ సిబ్బందితో పట్నంలో గాలించాలి. జాన్, లింకన్‌లు పట్నం వదలిపెట్టరు" అన్నాడు శిరీష్.

కుమార్ తలూపాడు. "రెండు గంటలకుముందు ఇద్దరూ లుంగీ పంచెలతో బయటకు వెళ్ళారు. వాళ్ళవెంట నల్లటి ఎయిర్‌బాగ్ వుంది. బహుశా యిద్దరూ టాక్సీ ఎక్కి వెళ్ళిపోయి వుంటారు!"

"అవును సమీపంలో వున్న టాక్సీ స్టాండ్‌కి వెళ్ళు. లేదా దారినపోయే ఖాళీ టాక్సీ ఎక్కి వుండవచ్చు. నగరంలోని టాక్సీ డ్రైవర్ల లాగ్ బుక్స్ తణిఖీ చెయ్యి."

కుమార్ బూట్లు టకటకలాడించుకుంటూ బయటకు

వెళ్ళిపోయాడు.

డిటెక్టివ్ శిరీష్ ఆలోచనలో పడ్డాడు.

చలపతికి ముప్ఫయి సంవత్సరాలుంటాయి. కాని నలభై అయిదు సంవత్సరాలవాడికిలాగా మేకప్ చేసుకున్నాడు? హంతకుడి బారినుండి తప్పించుకోవడానికా? అంటే హంతకుడు అతడి వెంట బయలుదేరినట్టు చలపతి నిర్ధారించుకున్నాడా? అందుకేనా కూపేలో ఒక్కడూ వున్నాడు.

ఆశ్చర్యం! మద్రాసునుండి వాల్తేరులోపులో ఒక్కడిని హత్య చేయలేకపోయారా? హంతకులిద్దరూ! ఆ విషయం స్పష్టమవుతోంది.

లేక లాడ్జి త్రివేణిలోనే చంపడంలో ఏమైనా అంతరారం వుందా? ఈ హత్య విషయంలో హోటల్ సిబ్బంది సహకారం వుందా? హంతకులు మద్రాసునుండి వచ్చింది ఎప్పుడు? మెయిల్ కేనా? అయితే హోటల్ సిబ్బందితో ప్రమేయం అంత సులువుగా ఎలా పెట్టుకో గలిగారు?

శిరీష్ తల విదిలించాడు.

చలపతి మొహంలో ఆశ్చర్యం గోచరించింది. హంతకుడు లేదా హంతకులు అతడికి బాగా తెలిసిన వాళ్ళు?

వాచీ చూసుకున్నాడు శిరీష్.

సాయంత్రం అయిదవుతోంది. హత్య జరిగి షుమారు మూడుగంటలవుతోంది.

డాట్సన్ కారును బయలుదేరతీశాడు శిరీష్.

ఫోరెన్సిక్ లాబ్ ముందాపాడు కారు. వ్రేలిముద్రల విభాగంలో ప్రవేశించాడు.

వ్రేలిముద్రల నిపుణులు అతడిని విష్ చేశారు.

"ప్రింట్సు వేశాం. చూస్తారా?" అడిగాడు ఒక నిపుణుడు.

"వచ్చిందే అందుకోసం!"

నిపుణుడు అతడికి ఫోటోల సెట్టు అందించాడు.

## 8

సారధి ఓపిగ్గా కాచుక్కూర్చున్నాడు.

నగరం మొత్తం మీద ఇంకా పదిమంది టాక్సీ డ్రయివర్లున్నారు. వాళ్ళ లాగ్ బుక్స్ వెతికితే సరి పోతుంది.

ఇద్దరు టాక్సీ డ్రయివర్లు తమతమ వాహనాలతో వచ్చారు.

సారధి వాళ్ళను సమీపించి తన గుర్తింపు కార్డు చూపించాడు.

"ఏం కావాలి సార్?" అడిగారు టాక్సీ డ్రయివర్లు.

"మీ లాగ్ బుక్స్ చూపించాలి!" అన్నాడు సారధి.

ఇద్దరూ లాగ్ బుక్స్ చూపించారు.

లాడ్జి త్రివేణినుండి జీవన్ ప్రకాష్ (ఎల్. ఐ. సి. భవనం) వరకూ మొదటివాడు సవారీ తోలాడు.

సారధి కళ్ళు మెరిశాయి.

"లాడ్జి త్రివేణి వద్ద నువు ఇద్దరు వ్యక్తులను టాక్సీ ఎక్కించుకున్నావుకదా!" అడిగాడు సారధి.

"అవున్సార్! వాళ్ళిద్దరు తమిళం మాట్లాడు తున్నారు.

"లుంగీ పంచెలు కట్టుకున్నారా?"

"అవున్సార్!"

"వాళ్ళలో ఒకడు నల్లటి ఎయిర్ బాగ్ మోశాడా?"

"అవునండి."

"రైట్ వాళ్ళను ఎక్కడ దింపావు!"

"ఎల్.ఐ.సి. భవనం దగ్గర."

"వాళ్ళు అక్కడే దిగారు. లాగ్ బుక్‌లో తెలుస్తోంది. కాని వాళ్ళు సవారి ఎక్కడికని అడిగారు?"

"డ్రెడ్జింగ్ కార్పొరేషన్."

సారధి ఆలోచనలోపడ్డాడు. వాంతకులకు ఆ సంస్థలో పని ఏమిటి? ఎల్.ఐ.సి. భవనంలో షాపింగ్ కాంప్లెక్స్ ఇతర ఆఫీసుల సముదాయమూ....

"ఆ తరువాత వాళ్ళను చూశావా?"

"లేదు సార్! వాళ్ళు దిగి భవనంవైపు మొహాలుపెట్టి నిలబడ్డారు. నాకు మరో బేరం తగిలింది. అటు వెళ్ళిపోయాను."

సారధి అతడికి కృతజ్ఞతలు చెప్పి స్కూటర్ ఎక్కాడు.

ఎల్.ఐ.సి. భవనం ముందు ఆపాడు.

డ్రెడ్జింగ్ కార్పొరేషన్ ఆఫీసు పై అంతస్తులో వుంది. సారధి లిఫ్టుద్వారా పై అంతస్తు చేరుకున్నాడు.

ఆఫీస్‌రూంకి ఇవతల గాజు అద్దాల తలుపులు.

తలుపులకు ఇవతల యూనిఫాంలో ప్యూన్ కూర్చున్నాడు.

సారధి అతడిని సమీపించాడు.

జాన్, లింకన్‌ల వేషం వర్ణించారు.

"లుంగీలు కట్టుకుని ఇద్దరు ఒక ఎయిర్‌బాగ్‌తో వచ్చారు. గుర్తుందా?" అడిగాడు సారధి.

"లేదు బాబూ!" అన్నాడు ప్యూన్.

"ఇంకా ఎవరైనా చూచివుండవచ్చునేమో!"

"ఆ అవకాశం లేదు. మధ్యాహ్నం పన్నెండుగంటల నుండి ఇక్కడే వున్నాను. నాకు ఇంటర్వ్యూ స్లిప్ ఇవ్వకుండా లోపలకు వెళ్ళడానికి లేదు."

సారథి తలూపి, తిరిగి క్రిందకు వచ్చాడు.

ఫ్యాన్ చెప్పిన విషయం నిజమేననిపిస్తోంది. హంతకులు మద్రాసునుండి వచ్చారు. వాళ్ళకు అతడి ఆఫీసులో పని ఏముంది?

గ్రవుండ్ ఫ్లోర్‌లోకి నడిచాడు.

దాదాపు మూడుగంటల తర్వాత హంతకులు ఆచూకీ ఎవరు చెప్పగలరు?

సారథి తన స్కూటర్‌ను సమీపించాడు.

# 9

కుర్చీలో ముందుకు వాలాడు కుమార్.

శిరీష్ వ్రేలిముద్రల ఫోటోలు బల్లమీద పరిచాడు. మొత్తం మూడుసెట్ల ఫోటోలు.

ఒకసెట్టు ముద్రలు టెలిఫోన్ సెట్టుమీద వున్నాయి.

రెండో సెట్టు తలుపులమీదా తలుపు వెనుక గోడల మీదా వున్నాయి.

మూడోసెట్టు ఎయిర్ బాగ్ మీదా సింగిల్ కాట్ మీదా వున్నాయి. మొదటి సెట్టు వ్రేలిముద్రలు చలపతి తీసిన ఫిలింలోవి.

"మూడో సెట్టులోనూ ఒకడి వ్రేలిముద్రలు కామన్‌గా వున్నాయి. రెండో సెట్టులోనూ, మూడో సెట్టులోనూ వాడి వ్రేలిముద్రలతోబాటు మరొకడి వ్రేలిముద్రలున్నాయి. అంటే చలపతికి మద్రాసులో బెదిరింపు చర్యగా హంతకుడు ఫోన్ చేసి వుంటాడు. చలపతి హంతకుడిని చూచాయగా గుర్తించాడు. అందుకే

చలపతి చనిపోయేటప్పుడు కూడా హంతకుడిని కనిపెట్టిన ఆశ్చర్యం ప్రకటించాడు" అన్నాడు శిరీష్.

కుమార్ తలూపాడు.

"అయితే మన పరిశోధనా రంగం మద్రాసుకు తరలించాలి!" అన్నాడు.

"కుమార్! నువ్వు ఫిలిం ఫెస్టివల్ విషయం మర్చిపోయావు."

"మర్చిపోలేదు. సినీ రంగం అంతా కలకత్తా తరలి వెళుతోందా?"

"అంతా వెళ్ళకపోయినా హెచ్చుమంది కలకత్తా వెళ్ళారు. సెక్స్ ఫిక్చర్లు హుందాగా చూచే అవకాశం కదా!"

"చలపతికి సంబంధించి అక్కడ అంటే మద్రాసులో సమాచారం లాగవచ్చును."

శిరీష్ తలపంకించి, "రైట్ కుమార్! చలపతిమీద బండరాయి దొర్లించి హంతకుడు ప్రయత్నం చేశాడు. ఆ విషయంతో బాటు చలపతి ప్రవర్తనా, హంతకుడికి అతడిమీద కసీ — ఈ రహస్యాలన్నీ తెలుస్తాయి!" అన్నాడు.

"అందుకే మనం మద్రాసు వెళ్ళి...."

"హంతకులు మన నగరం వదిలి వుండరు. ఇక్కడ ఏర్పాట్లు చేసి...."

"బస్సు స్టాండులూ, రైల్వేస్టేషన్‌లూ...."

టెలిఫోన్ గణగణలాడింది.

మాట్లాడటం ఆపి కుమార్ ఫోన్ ఎత్తాడు.

"హైవే ప్రక్కనే వున్న పబ్లిక్ టెలిఫోన్ బూత్ నుండి సార్. నేను పి.సి. 84ని మాట్లాడుతున్నాను.

కైలాసపూర్ క్వార్టర్స్ ప్రక్కగా వున్న రోడ్లో మురికాల్వలువ వుందిసార్! ఆ కాలువలో రెండు లుంగీలూ, ఒక నల్లటి ఎయిర్ బాగ్ పడివున్నాయి సార్!"

"వాటిని ఎవరు చూశారు?"

"నేనే సార్, హైవేమీద నాతోబాటు కొంత మందిని కమీషనర్ గారు గస్తీ వేశారు సార్!"

"వాటిని ఎవరూ తాకకుండా చూడు. పావు గంటలో వస్తున్నాం!"

"అలాగే సార్!"

కుమార్ రిసీవర్ పెట్టేశాడు.

"కుమార్! హంతకులకు హైవేమీద పని ఏమిటి?"

"ఏం చెబుతాం! డ్రెడ్జింగ్ కార్పొరేషన్తో మాత్రం పని ఏమిటి?"

"ఆల్ రైట్! నువు బట్టల విషయమూ, బాగ్ విషయమూ చూడు. నేను కలకత్తా వెళ్తాను. నువు మద్రాసు వెళ్తావో, సమాచారం రప్పిస్తావో నీ బాధ్యత!"

కుమార్ తలూపాడు.

"కలకత్తాలో నేను 'ఈస్టు వెస్టు' హోటల్లో బసచేస్తాను. ఫోన్ చెయ్యి" శిరీష్ లేచాడు.

వ్రేలిముద్రల ఫోటోలు తీసుకున్నాడు శిరీష్.

"మరో సెట్టు ఫోటోలు నువు తీసుకువెళ్ళు. పనికి రావచ్చు."

కుమార్ ఒళ్లుమీద గుద్దాడు.

"శిరీష్ మనం ఒక విషయం మరచిపోయాం. టెలిఫోన్ సెట్టుమీద చలపతి వ్రేలిముద్రలు ఫోటోలు

తీశాడు. ఆ ఫోటోల్లో టెలిఫోన్ నెంబర్ కూడా ప్రింటయింది."

శిరీష్ నవ్వాడు.

"ఆ ఫోన్ నెంబర్ వాఘిరా స్టూడియో రెండో ఫ్లోర్‌లోది. ప్రస్తుతం అక్కడ రాధికా ప్రొడక్షన్స్ వాళ్ళ పిక్చర్ షూటింగవుతోంది!"

"అంటే నువు ఫోన్ చేసి కనుక్కున్నావన్నమాట!"

"అప్పుడే తెలిసింది—చిత్ర రంగం కదలి కలకత్తా వెళ్ళిందని."

కుమార్ బయటకు నడిచాడు.

## 10

కోరమండల్ ఎక్స్‌ప్రెస్ దిగాడు శిరీష్. హౌరా స్టేషన్‌లోంచి బయటకు నడిచాడు. టాక్సీ మాట్లాడుకుని ఈస్టువెస్టు హోటల్‌కి చేరుకున్నాడు.

కాలకృత్యాలు తీర్చుకుని ట్రింగా తయారయాడు.

'కలకత్తా డెయిలీ' పత్రికకు ఫోన్ చేశాడు.

"ఫిలిం ఫెస్టివల్ రేపటినుండీ ప్రారంభమవుతుంది. నేషనల్ థియేటర్‌లో" అన్నాడు పత్రిక ఎడిటర్.

"ప్లీజ్. టైమింగ్స్ తెలుసా?"

"ఉదయం తొమ్మిది గంటలకు. సాంస్కృతిక వ్యవహారాల కేంద్రమంత్రి ప్రారంభోత్సవం చేస్తారు."

"మద్రాసు చలనచిత్ర ప్రముఖులు ఏ హోటల్‌లో దిగారో తెలుసా?"

హోటల్ మొత్తం కాంట్రాక్ట్ తీసుకున్నారు. వంగబంధు హోటల్."

"అడ్రసు చెబుతారా!"

"149—2/సి జగదీష్ రోడ్. హౌరాబ్రిడ్జికి ఉత్తరంగా రెండు మైళ్ళలో వుంటుంది."

"థాంక్యూ వెరీమచ్!" శిరీష్ బయటకు నడిచాడు. టాక్సీలో వంగబంధు హోటల్ చేరుకున్నాడు. నాలుగంతస్తుల భవనం "డైరెక్టర్ బోస్‌గారి రూం నెంబర్ ఎంత?" అడిగాడు కౌంటర్‌లో.

"నాలుగో అంతస్తు. రూం నెంబర్ నూట ఇరవై" అన్నాడు కౌంటర్లోని గుమస్తా.

లిఫ్టు ఎక్కి నాలుగో అంతస్తు చేరుకున్నాడు శిరీష్.

డైరెక్టర్ బోస్ గదిలోనే దొరికాడు. బల్లముందు కూర్చుండి స్క్రిప్టు రాసుకుంటున్నాడు.

శిరీష్‌ను సాదరంగా ఆహ్వానించాడు.

"మీ గురించి అప్పుడప్పుడూ శంకరరాజన్ చెబుతారు" అన్నాడు బోస్.

శంకరరాజన్ వాహిరా స్టూడియో అధినేత.

శిరీష్ నవ్వి "మాయమైన ముసలి పాము—కేసులో ఆయనతో స్నేహం బాగా పెరిగింది!" అన్నాడు.

"బోస్ తలూపి ఫిలిం ఫెస్టివల్‌కి వచ్చారా?" అన్నాడు.

"లేదు. మీకోసమే వచ్చాను."

"నిజమా?"

"అవును. మీ పని డిస్టర్బ్ చేసినట్టు భావించకపోతే నాతో అరగంటపాటు కేటాయించాలి!"

"తప్పకుండా. మీరు నాతో పాటు ఫెస్టివల్‌లో పాల్గొంటే ఇంకా సంతోషిస్తాను!"

"మీ అభిమానానికి కృతజ్ఞుడిని! చలపతి మీతో పాటు మద్రాసునుండి బయలుదేరారు అవునా!"

"ఓ! చలపతి మీ స్నేహితుడు కదా!"

"అవును."

"నాతో బాటు బయలుదేరాడు కాని, కూపేలు వేరు!"

"బయలుదేరే ముందు అతడి ప్రవర్తన ఎలా వుంది?"

"విచిత్రంగా వుంది. అతడికి నా కూపేలో నాలుగో బెర్త్ రిజర్వ్ చేయించాను. కాని అతడు కూపే మొత్తం ఎలా బుక్ చేసుకున్నాడో తెలియదు!"

"అవును. నాకు ఫోన్‌లో చెప్పినప్పుడు అదే బెర్త్ నెంబరు చెప్పాడు."

"అంతేకాదు. సెంట్రల్ స్టేషన్‌లో మొదట బాగానే పలకరించాడు. తరువాత ఏదో విలువయిన వస్తువును పోగొట్టుకున్నట్టు ప్రవర్తించాడు. వెర్రిగా పరుగెత్తి తన కూపేలో దూరాడు. తలుపు వేసుకున్నాడు.

"చలపతి తనను ఎవరో హత్యచేస్తారని భయపడ్డాడు."

"హత్యా? అతడినా? ఎవరు? ఎందుకు?"

"ఎందుకో తెలియదు. కాని బాగా తెలిసినవాళ్ళే అని మాత్రం చెప్పగలను."

"తెలిసినవాళ్ళా!"

"అవును. అతడికి మద్రాసులో శత్రువులున్నారా?"

"మాది నటనా ప్రపంచం. నటన పులుముకున్న మొహాల వెనుక ఏం వుందో చెప్పలేం!"

"మద్రాసునుండి చలపతిని వాల్తేర్ వరకూ ఇద్దరు వ్యక్తులు వెంటాడారు. వాల్తేరులో దిగిన అరగంటలో చలపతిని హత్య చేయగలిగారు."

బోస్ దిగ్గున లేచాడు. "చలపతిని హత్య చేశారా?"

దాదాపుగా ఆరచినంత పని చేశాడు.

"అవును. లాడ్జి త్రివేణిలో చంపారు."

"నమ్మలేకుండా వున్నాను!"

"మీకు తెలిసిన వివరాలు చెబితే ఇద్దరు హంతకులను త్వరగా పట్టగలను!"

బోస్ నీరసంగా కుర్చీలో కూలబడ్డాడు. "చలపతిని అసోసియేట్ డైరెక్టర్‌గా శ్రద్ధగా మలచుకున్నాను. అలాంటి కుడి భుజం జారిపోయిందంటే...." గొణుక్కున్నాడు.

"చలపతికి దురలవాట్లున్నాయా?"

"ఫీల్డులో సహజం!"

"అతడు సన్నిహితంగా తిరిగే ఫ్రెండ్స్ ఎవరు?"

"రాసుకుంటారా?"

"ఆఁ!" శిరీష్ నోట్ బుక్ తీశాడు.

"మా లైట్ బాయ్ జయరావ్, అసిస్టెంట్ ప్రొడక్షన్ మేనేజర్ అనిల్, వాఘిరా ప్రొడక్షన్ వాళ్ళ మ్యూజిక్ అసోసియేట్, రాధికా ప్రొడక్షన్స్ వానూ, ఎక్స్‌ట్రా నటులు సప్లయర్ జంబులింగం, రాణీ మూవీస్ వాళ్ళ కాషియర్ కృష్ణా, ఇంకా నటుల్లో కొందరూ వున్నారు."

"నటుల పేర్లు కూడా చెప్పండి."

"మోజెస్, రంజా, కాంతయ్యా, లింగారావ్, సుబ్బరామయ్యా!"

"అవుట్‌డోర్ షూటింగ్‌లో చలపతిమీద హత్యా ప్రయత్నం జరిగిందట కదా!"

"హత్యా ప్రయత్నమా? ఏమిటది?"

"అతడు ఏదో సీన్ చిత్రీకరిస్తోంటే బండరాయి

దొర్లుకుంటూ వచ్చిందట కదా!"

"ఎప్పుడు?"

"ఈ నెల 16వ తేదీన."

"షెడ్యూల్‌లో అసలు అవుట్‌డోర్ షూటింగే లేదు!"

ఈసారి తెల్లబోవడం శిరీష్ వంతయింది. అయితే చలపతి అబద్ధం చెప్పాడా! ప్రాణాలు రక్షించమని చెప్పి అబద్ధం ఎందుకు చెప్పాడు? చలపతి తనతో ఒక ముఖ్య విషయం చెబుతానన్నాడు. ఏమిటది? ఆ విషయం చెప్పేముందు తను పూర్తిగా కేసులో దిగడానికి అబద్ధం చెప్పాడా? అతడు పూర్తిగా ప్రమాదంలో యిరుక్కున్నట్టు తాను భావించాలా?

చలపతి జోక్స్ వేసే మనిషి. తనతో కూడా జోక్ చేశాడా?

"చలపతి మద్రాసులో ఎవరినయినా ప్రేమించాడా?" అడిగాడు శిరీష్.

"లేదనుకుంటాను."

"స్త్రీ వ్యసనం వుందా?"

"అది అక్కడ అందరికీ సహజమే!"

"అతడు ఇటీవల ఎవరితోనయినా ఘర్షణపడ్డాడా?"

"లేదు."

"విధి నిర్వహణలో ఏమరుపాటుగా వుండటం జరిగిందా?"

"ఒక పదిరోజులుగా కాబోలు కొద్దిపాటి పరాకు ప్రదర్శిస్తోన్నాడు."

"ఎందుకో అడిగారా?"

"అడిగాను. మనసు బాగుండలేదనేవాడు!"

"అతడి గది అడ్రసు తెలుసా?"

"తెలుసు" బోస్ చిరునామా చెప్పాడు.

"చలపతి హత్య విషయంలో మీరు ఏమైనా చెప్ప గలరా?"

"హంతకుడిని పట్టుకోండి. మీ ఫీజు నేను చెల్లిస్తాను."

"థాంక్స్."

"ఖర్చుకోసం వెనకాడకండి!"

"తప్పకుండా. అన్నట్టు మెయిల్‌లో మీతోబాటు బయల్దేరినవాళ్ళెవరు ప్లీజ్ రాసియివ్వండి."

బోస్ కాగితంమీద రాయసాగాడు.

తలుపు దగ్గర అలికిడయింది.

బోస్ తల త్రిప్పి, "కృష్ణా! రా!" అన్నాడు.

కృష్ణ లోపలకు వచ్చాడు.

"చలపతికోసం వచ్చాను సార్!" అన్నాడు కృష్ణ.

బోస్‌కి శిరీష్ కనుసైగ చేశాడు.

"చలపతి ఇక్కడకు రాలేదు!" అన్నాడు బోస్.

"చలపతి ప్రవర్తన ఆశ్చర్యకరంగా వుంది. కూపేలో నన్ను కూడా తోడు రమ్మన్నాడు. తర్వాత వద్దన్నాడు" అన్నాడు కృష్ణ.

శిరీష్ కలగజేసుకొని, "నాకు చలపతి కజిన్ అవుతాడు. చలపతి మిమ్మల్ని చివరి క్షణాల్లో తోడు రావద్దన్నాడు. కారణం చెప్పాడా?" అన్నాడు.

కృష్ణ తటపటాయించాడు. "చెప్పలేదు" అన్నాడు.

"మరి మీకు సీటు ఎలా దొరికింది?"

"రాధికా ప్రొడక్షన్స్ వాను ప్రయాణం రద్దు చేసుకున్నాడు. అతడి పేరున నేను బయలుదేరాను."

శిరీష్ లేచాడు. బోస్ వద్ద కాగితం తీసుకున్నాడు. ఇద్దరిదగ్గరా సెలవు పుచ్చుకుని బయటకు నడిచాడు.

## 11

శిరీష్ హోటల్‌కి వెళ్ళేసరికి కుమార్ వద్దనుండి ఫోన్ వచ్చింది.

"మద్రాసు జార్జి పేటలో వున్న చలపతి గదిని ఎవరో వెతికారు!" అన్నాడు కుమార్.

"డబ్బు పోయిందా?"

"బాంకులో వుంది డబ్బు. అయిదువేల రూపాయిల చిల్లర. అదంతా విత్ డ్రా చేశాడు చలపతి. డబ్బుతోనే బయలుదేరినట్టు ఇక్కడ లైట్‌బాయ్ జయరావ్ చెప్పాడు."

"కేవలం డబ్బుకోసమే హత్య జరగలేదు."

"చలపతి మెయిల్ ఎక్కేముందు రాధికా ప్రొడక్షన్ వాళ్ళ టెలిఫోన్ వున్న గదిలోకి వచ్చాడు. ఆ ఫోన్ నెంబరే అతడివద్ద దొరికిన ఫిలించుట్టలో వుంది కదా!"

"అవును. ఆ ఫోన్‌నుండే చలపతికి బెదిరింపు ఫోన్ కాల్ వచ్చి వుంటుంది. అందుకే చలపతి దాన్ని వ్రేలిముద్రల కోసం ఫోటోలు తీసివుంటాడు."

"హంతకులకు వ్రేలిముద్రల విషయం తెలీదనుకుంటాను."

"ఎలా? వివరంగా చెప్పు."

"సెంట్రల్ స్టేషన్‌లో చలపతి ఏదో ఫిలించుట్టను జేబులో పెట్టుకుని కనిపించాడు జయరావ్‌కు. తర్వాత ఆ చుట్ట మాయమయిందట. అంటే చలపతి తనని వెంటాడేవారిని నకిలీ ఫిలించుట్టతో మోసగించాడన్న మాట. అసలు ఫిలించుట్ట మనకు దొరికిందికదా! పైగా

హంతకులు తమ వ్రేలిముద్రలను నిశ్చింతగా వదలిపెట్టారు."

"గుడ్ లాజిక్. చలపతి గదిలో హంతకుల వ్రేలి ముద్రలు దొరికివుంటాయి."

"అదే చెప్పబోతున్నాను. యిద్దరిలో ఒకడివి దొరికాయి."

"గుడ్. కేసు విడిపోతోంది!"

"కాని మనం వ్రేలిముద్రలతో.... అదే నాకూ అర్థం కావడంలేదు. వ్రేలిముద్రలు పాత నేరస్తులవి కావు!"

"హంతకుడు లేదా హంతకులు ఫిలిం ఫెస్టివల్ కి వచ్చాడు. చలపతిని వెంటాడాడు. వాల్తేరులో దిగి పని ముగించుకున్నాడు. నాతోబాటే కోరమండల్ లో తిరిగి ప్రయాణించి వుంటాడు—" బ్రేక్ జర్కి!

"అయితే అతడికి డ్రెడ్జింగ్ కార్పొరేషన్ తో పని ఏమిటి?"

"చెబుతాను. నువ్వు హరారా వచ్చెయ్యి ప్లేన్ లో."

"కాని ఇక్కడ చలపతి గది వెతికినవాళ్ళు...."

"చలపతి ప్రయాణంలో వుండగానే అతడి గది వెతికారు. అంటే ఇద్దరిలో ఒకడు తిరిగి మద్రాసు వెళ్ళిపోయివుంటాడు. ఒకడు ఫెస్టివల్ లో వుంటాడు. ఇద్దరికీ ఎలిబీలు...." శిరీష్ విజిల్ వేశాడు. "కోరమాండల్ లో ఒక్కడే వచ్చాడు. అతడు ఎవరో తెలిస్తే.... వాల్తేరు నుండి కోరమండల్ లో వచ్చినవాడు...." ఆగాడు శిరీష్.

తిరిగి, "కుమార్ వచ్చెయ్యి. ఇక్కడ మన పని చాలా వుంది" అన్నాడు.

రిసీవర్ లో కుమార్ నవ్వాడు. "నువ్వు ఏ కేసులోనూ ఇంతగా గాభరాపడలేదు" అన్నాడు.

శిరీష్ కూడా నవ్వి, "అవును. ఫోన్ పెట్టేస్తున్నాను!"

అన్నాడు.

శిరీష్ తిరిగి గదిలోంచి బయలుదేరాడు. టాక్సీ మాట్లాడుకున్నాడు. మార్కెట్‌లో ఆగి షాపింగ్ చేశాడు.

'వంగబంధు' ముందు ఆగింది టాక్సీ.

## 12

డండం విమానాశ్రయంలో కాంటీన్.

క్రైంబ్రాంచ్ డిటెక్టివ్ ఇన్స్‌పెక్టర్ కుమార్ కాఫీ చప్పరిస్తూ చూశాడు.

కుర్చీలో వెనక్కివాలి కణతలు రుద్దుకున్నాడు శిరీష్.

"ఫిలిం ఫెస్టివల్ కి 'కోరమండల్'లో కూడా చాలా మంది వచ్చారు. అయితే 'మెయిలు'లో ప్రయాణించి బ్రేక్ జర్నీ చేసినవాడు 'కోరమండల్'లో వచ్చినవాళ్ళలో లేడు" అన్నాడు శిరీష్.

"ఒకటే పద్ధతి! ఫిలిం ఫెస్టివల్ కి మద్రాసునుండి వచ్చిన ప్రతినిధుల వ్రేలిముద్రలు సేకరించాలి."

"చివరి స్టెప్ అదే!" శిరీష్ జేబులోంచి తెల్లటి ఉల్లిపొర కాగితం తీశాడు. దానిమీద ఆకుపచ్చ రంగు సిరాతో రాసివుంది. "బోస్ రాసిన కాగితం. ప్రతినిధుల జాబితా."

కుమార్ కాగితం అందుకుని చదివాడు. అతడి నుదురు ముడతలు పడింది. ప్రక్కనే పెట్టుకున్న బాగ్‌లోంచి కాగితాలు తీశాడు. అవీ వుల్లిపొర కాగితాలే. రెండు వందల ఆరటావులున్న బొత్తి. ఆకుపచ్చ రంగు సిరాతో రాసి వున్నాయి.

మొదటి పేజీమీద 'ప్రేమ పిచ్చోడు' సినిమా స్క్రిప్టు—కథ, మాటలు, పాటలు, స్క్రీన్ ప్లే, దర్శ

కర్తవ్యం—బోస్ అని వుంది.

"ఈ స్క్రిప్టు ఎక్కడ దొరికింది?" అడిగాడు శరీఫ్.

"చలపతి గదిలో."

"బోస్ రాసిన స్క్రిప్టు చలపతి గదిలో దొరికింది. ఈ స్క్రిప్టు ఇంకా సెట్సుమీదకు వెళ్ళివుండదు."

"చలపతికి బోస్ ఈ స్క్రిప్టు ఇచ్చాడేమో."

"బోస్ పేరు ప్రఖ్యాతులున్న దర్శకుడు. తన దగ్గర అసోసియేట్ గా పనిచేసే చలపతికి స్క్రిప్టు యిచ్చాడు."

ఇద్దరూ బయటికి నడిచారు.

టాక్సీ మాట్లాడుకున్నారు.

"సారధిని ఎల్.ఐ.సి. భవనంలో ఇద్దరు హంతకుల ఆచూకీ కోసం పంపించాను. అదే భవనంలో ఇండియన్ ఎయిర్ లైన్స్ ఆఫీసు వుంది మర్చిపోయావా?"

"గుర్తుంది కాని, ఎయిర్ లైన్స్ లో మనకి పని ఏమిటి?"

"మనకు కాదు. హంతకులకు. హైవేమీద వాళ్ళు ప్రయాణించారు."

"నీ ఉద్దేశం అర్థంకావడంలేదు."

"చలపతిలాగానే హంతకులు కూడా ట్రేక్ జర్నీ చేశారు. ఒకడు మాత్రం ఇటు హౌరా వచ్చాడు. రెండోవాడు మద్రాసు వెళ్ళాడు. చలపతి గదిని వెతికాడు. దేనికోసం? స్క్రిప్టుకోసం."

"కాని స్క్రిప్టు గదిలో దొరికింది."

"అక్కడే వుంది మోసం. స్క్రిప్టులో విషయం కావాలి వాళ్ళకు. అంటే ఈ కాగితాలను ఫోటో స్టాట్ కాపీలు తీయించి వుంటారు. తర్వాత స్క్రిప్టును గదిలో పారేశారు. అంటే స్క్రిప్టు దొంగతనం అయినట్లు బోస్

గమనించకూడదు."

"గుడ్. ఎయిర్ లైన్స్ విషయం అర్థమౌతోంది."

కుమార్ వాచీ చూసుకున్నాడు.

"మధ్యాహ్నం మూడున్నరకి వైజాగ్ నుండి కలకత్తా వచ్చే విమానం వుంది. దాంట్లో హంతకుడు ప్రయాణించాడన్నమాట."

"హంతకుడు కలకత్తావరకూ ప్లెయిన్ లో రాలేదు."

టాక్సీ వంగబంధు హోటల్ ముందాగింది.

కుమార్, శిరీష్ నాలుగో అంతస్తుకి చేరుకున్నారు. బోస్ గది తలుపు తెరచివుంది.

నేలమీద బోస్ పడివున్నాడు. అతడి భుజంనుండి రక్తం కారుతోంది. శిరీష్ అతడి ముక్కు దగ్గర వ్రేలు ఉంచాడు. తలూపాడు 'ప్రాణానికి మోసంలేదు!' గొణుక్కున్నాడు.

"పిస్తోలుతో ఇతడిని ఎవరు కాల్చారు?" అడిగాడు కుమార్ ఆశ్చర్యపోతూ.

"వంగబంధులో లాడ్జి చేసిన వాళ్ళ వ్రేలిముద్రలు సేకరించుదాం. బోస్ కూడా షూట్ చేసిన వాళ్ళను చూచి వుండడు. చూచి వుంటే అతడిని ప్రాణాలతో వుంచే వాళ్ళుకాదు!"

కుమార్ క్రిందకు పరుగెత్తాడు.

శిరీష్ తలవంచి బోస్ వద్ద వంగాడు.

బోస్ పెదిమలు కదులుతోన్నాయి.

## 13

సఫ్దర్ జంగ్ లోని ఫొరెన్సిక్ లాబొరేటరీ రద్దీగా వుంది. మొత్తం మూడువందలమంది ఫిలిం ఫెస్టివల్ ప్రతినిధుల వ్రేలిముద్రలు ప్రోసెసింగ్ లో వున్నాయి.

కలకత్తా మహానగరంలోవున్న వ్రేలిముద్రల నిపుణులు అక్కడే వున్నారు. ఒక బృందం వారితోబాటు శరీఫ్ వున్నాడు. ఆ గదిలో వ్రే లి ము ద్ర ల ను సరిపోల్చుతున్నారు.

శరీఫ్ తనకి చలపతివద్ద దొరికిన ఫిలింలోని వ్రేలిముద్రల సెట్టుతో సిద్ధంగా వున్నాడు.

ఏడెనిమిది గంటల పరిశ్రమ తర్వాత శరీఫ్ ఫోన్ వద్దకు నడిచాడు.

హోటల్ 'వంగబంధు'కు ఫోన్ చేశాడు.

కలకత్తా పోలీసుల సహకారంతో కుమార్ 'వంగబంధు'ను పూర్తిగా గస్తీ ఏర్పాట్లతో బంధించాడు.

"కుమార్! రూం నెం. 90లో వున్న కృష్ణను అరెస్టు చెయ్యి. అతడే చలపతిని లాడ్జి త్రివేణిలో హత్య చేశాడు. బోస్‌ను కాల్చింది కూడా అతడే. అతడివద్ద హత్యకు వాడిన పాయింట్ త్రీ టూ కాలిబర్ పిస్తోలు దొరుకుతుంది" అన్నాడు శరీఫ్.

* * *

"నేను ఈ హత్య చేయలేదు!" అరిచాడు కృష్ణ.

"చలపతి హంతకుడిని గుర్తించాడు. బాగా పరిచయం వున్న హంతకుడిని చూచి చలపతి ఆశ్చర్యం ప్రకటించాడు. అందుకే చలపతికి బాగా సన్నిహితులమీద పరిశోధన సాగించాం. చలపతి స్క్రిప్టు దొంగలించాడు. బోస్ రాసిన స్క్రిప్టు 'ప్రేమ పిచ్చోడు' చలపతి గదిలో దొరకడాన్నిబట్టి వ్యవహారం అర్థమయింది.

నువ్వూ నీ పార్టనరూ కలసి చలపతిని ఫోన్ కాల్స్ ద్వారా బెదిరించారు. బోస్ రాసివుంచుకున్న స్క్రిప్టులో 'ప్రేమ పిచ్చోడు' దొంగిలించేలాగా అతడిని తరిమారు.

స్క్రిప్ట్‌తో అతడు కలకత్తా వెళ్తోన్నట్టు వూహించుకున్నారు.

లాడ్జి త్రివేణిలో అతడిని హత్యచేసి బాగ్ వెతికారు. స్క్రిప్టు దొరకలేదు. నువు కలకత్తా వచ్చావు. నీ పార్టనర్ మద్రాసువెళ్ళి చలపతి గది వెతికి స్క్రిప్టు సంపాదించాడు. మరల స్క్రిప్టును అతడి గదిలో పడవేశాడు. విషయాన్ని ఫోటోస్టాట్ కాపీద్వారా సంగ్రహించాడన్నమాట" అన్నాడు శిరీష్.

కృష్ణ అసహనంగా కదిలాడు. "కాని నేను మెయిలులో హౌరాలో దిగాను. నేను ఎక్కడా బ్రేక్ జర్నీ చేయలేదు. ఆ విషయాన్ని టికెట్ ఎగ్జామినర్ సహాయంతో రుజువు చేయగలను" అన్నాడు.

"నీ వ్రేలి ముద్రలు లాడ్జి త్రివేణిలో దొరికాయి. ప్రపంచంలో ఒకరి వ్రేలిముద్రలనుపోలిన వ్రేలిముద్రలు వుండవు."

"నాకు తెలియదు. అవి నా వ్రేలిముద్రలు కావు."

"మెయిలులో నువు బ్రేక్ జర్నీ చేశావు. నువ్వూ నీ పార్టనర్ కలిసి జాన్, లింకన్ పేర్లతో చలపతికంటె ముందుగా లాడ్జి త్రివేణిలో దిగారు. చలపతి నాకు ఫోన్‌లో చెప్పిన విషయాలు టాప్ చేసి వినివుంటారు. చలపతిని అనుకున్నట్టుగా హత్యచేశారు. నువు కలకత్తా ప్లెయిన్‌లో ముందురోజు ఫోన్‌లో ఒక ఎయిర్ టికెట్ బుక్ చేసుకున్నావు. టికెట్ భువనేశ్వర్ వరకూ."

"అబద్ధం!"

"ఎల్. ఐ. సి. భవనంలో వున్న ఎయిర్‌లైన్స్ ఆఫీసులో దర్యాప్తు చేశాం. 648791 మద్రాసునుండి టికెట్ రిజర్వ్ చేయమని కాల్ వచ్చిందని ఆఫీసులో

రికార్డయింది. విమానంలో మెయిలుకంటె ముందుగా నువు భువనేశ్వర్ చేరుకున్నావు. రైల్వేస్టేషన్‌కి చేరుకున్నావు. మెయిలులో యథాప్రకారంగా నీ బెర్త్‌ను ఆక్రమించుకున్నావు."

తలను అరచేతులతో కప్పుకుని, "ఇదంతా రాధికా ప్రొడక్షన్స్ వానూ వలన జరిగింది. నేను జాన్ పేరా, అతడు లింకన్ పేరా వ్యవహారించాం ....పిస్తోలుతో బోస్‌నూ, చలపతినీ నేనే కాల్చాను."

శిరీష్ పెదిమలు బిగించి చూశాడు. "బోస్ రాసిన 'ప్రేమ పిచ్చోడు' స్క్రిప్టును దొంగిలించారు. అటువంటి ప్రేమ కథలు గంటకు నాలుగు చొప్పున రాసిపెట్టే రచయితలున్నారు. దొంగతనం చేసినప్పటికీ మీ పని నెరవేరలేదు! నయం! బోస్ బతికాడు!" అన్నాడు అతడిని అసహ్యంగా చూస్తూ.

—:ఐపోయింది:—

# బతకాలంటే పారిపో!

సికిందర్

(గత సంచిక తరువాయి)

## 9

ఆ సాయంత్రం ప్రతాపరావు నన్ను పిలిచి కూర్చోమన్నాడు కుర్చీ చూపిస్తూ.

సంకోచిస్తూ కూర్చున్నాను. ధైర్యంచేసి అతని ముఖంలోకి చూశాను. అతడెంతో ప్రశాంతంగా, సౌమ్యంగా కనిపిస్తున్నాడిప్పుడు.

"కమలాకర్, నిన్న నిన్ను కోప్పడ్డాను కదూ? వ్చ కోపంవస్తే విచక్షణ కోల్పోతాను. నా వయసు ఆరోగ్యం, సమస్యలు...బ్రతుకే అలాంటిది! నన్నర్థం చేసుకుంటావా?"

తలూపాను వెంటనే. "చేసుకుంటాను సర్."

"నో హార్డు ఫీలింగ్స్?"

"నో హార్డు ఫీలింగ్స్, సర్."

లీల వస్తూ కనిపించింది ఇంట్లోంచి. ఆమె చేతిలో బ్యాగు వుంది. ఆమె తిన్నగా వచ్చి భర్త ప్రక్కగా

నిల్చొంది. "షాపింగ్ కి వెళ్తున్నాను, గంటలోగా వస్తాను" అంది చిన్నగా.

రావ్ ఆమె ముఖంలోకి అనునయంగా చూశాడు. "త్వరగా వచ్చేయి, చీకటిపడకుండా."

ఆమె తలూపి కదిలింది కారు వద్దకి, నన్ను అసలు చూడకుండా.

ఎంత చక్కని అభినేత్రి!

అభినేత్రి? కలవరపడ్డాను. షాపింగ్ కా? శివకుమార్ మెదిలాడు వెంటనే నా మనసులో. అతనిక్కడ లేడు. ఈమె బైటికెళ్తోంది. ఏమిటి దీనర్థం? గతరాత్రి శివకుమార్ ప్రస్తావన వచ్చినపుడు లీల మాటలు, ప్రవర్తన నాకు స్ఫురించాయి. ఉలిక్కిపడి చూశానామెవైపు. ఆమె కారెక్కి వెళ్ళిపోతోంది... వీళ్ళిద్దరిప్పుడు కలుసుకుంటారా? ఇద్దరూ కలిసి రావ్ ని వంచిస్తున్నారా?

నాకు పట్టరాని ఆవేశం వచ్చింది — లీల నాతో నటిస్తోందా!

"కమల్ ...." రావ్ మాటలకి ఆవేశం అణచుకుంటూ చూశాను అతనివైపు, "చూశావా? ఎలా వుంది లీలావతి? షి ఈజె నైస్ ఉమన్. ఆమెవల్ల నేనెంతో శాంతిని పొందగల్గుతున్నాను. ఆమెదెంతో జాలి గుండె గాకపోతే నన్ను కట్టుకుంటుందా వయసులో! నాకూ, విక్కీకీ కొత్త జీవితాన్నిచ్చింది...." ప్రక్కన కూర్చుని చందమామ చదువుకుంటున్న విక్కీ తలమీద చిన్న దెబ్బ వేశాడు, "వీడి గురించి చాలా బెంగపడ్డాను మొదట్లో. లీలావతి వచ్చాక వీడి సమస్య తీరిపోయింది! ఆమె మాకెంతో మేలు చేసింది కమలాకర్: మన సెరిగిన మనిషి. అనాధలా వచ్చింది. మా జీవితాల్లోనే ఒక భాగమై

పోయింది... ”

వినలేకపోతున్నాను అతని మాటలు. మనసు పరిపరి విధాలపోతోంది. అనేక అనుమానాలు ముసురుకుం టున్నాయి. లీలను నమ్మాలా? శివకుమార్‌తో ఆమెకు వ్యవహారముందా? అయితే ఇది ఇంతకాలం రావ్‌కు తెలియకుండా వుండా? ఈ వయసుమీరిన భర్తలు తమ పడుచు భార్యల్ని క్షణం క్షణం వెయ్యి కళ్ళతో గమ నిస్తూంటారు. రావ్ ఉదాసీనంగా వుంటున్నాడా?

ఆమె నన్ను వంచిస్తోందనే తలంపుకి ఆవేశం తన్ను కొస్తోంది. ఆమెను కాల్చి చంపేస్తాను ఈ సంగతి ఋజువైతే!

రాత్రి ఎనిమిది గంటలకి ఆమె తిరిగివచ్చింది. ఏవో ప్యాకెట్లు మోసుకొంటూ లోపలికెళ్ళింది. ఇంట్లోకెళ్ళిన పావుగంటకి మమ్మల్ని భోజనాలకి పిలిచింది. భోజనం చేస్తున్నంతసేపూ ఆమె సాధారణ ప్రవర్తనకి రెచ్చిపో సాగాను. ఎంత చక్కని నటి! ఎంత బాగా వ్యవహారాలు చక్కబెడుతోంది?

బాగా రాత్రయి, బంగళా అంతా చీకటయ్యాక పదిన్నరకు ఆమె నీడ నా వైపు వస్తూ కనిపించింది.... నేను నిన్నటి స్థలంలోనే ఎదురుచూస్తూ వున్నాను. ఆమె నన్ను సమీపించి భుజాలుపట్టుకు ఊపింది.

“ఏమిటి, ఏదో ఆలోచిస్తున్నావ్?”

ఈడ్చికొట్టాను ఆమె చెంపమీద.

ఆమె తూలి వెనక్కి పడబోయింది. కాని నిల దొక్కుకుని నిశ్శబ్దంగా ఓర్చుకుందాదెబ్బ. “రౌడీ ముఖం! గూండా జులుం! ఏం పట్టింది నీకు?”

"నన్ను మోసం చేస్తున్నావ్ మళ్ళీ!"

"నిన్ను మోసం చేస్తున్నానా?"

"లేదూ? ప్రాణభయంతో నన్నిలా లొంగదీసుకుని, మరోవైపు అలవాటు ప్రకారం ఆ కుమార్ గాడితో ప్రణయం సాగించడం లేదూ?"

"కమల్!"

"అవును, యూ ఆరే డర్టీ క్రీచర్! సాయంత్రం వాణ్ని కలుసుకోవడానికి వెళ్ళావు. మీరిద్దరూ కూట్ర పన్నుతున్నారు. వాడితో ఆ నగలు దోచుకొని పారిపోదామనుకుంటున్నావ్. అంతవరకు నన్నాపడానికిలా నటిస్తున్నావు...."

"నీకెవరు చెప్పారు?" అందామె చటుక్కున నా దగ్గరకొచ్చి "అంతా నువ్వూహించుకుంటున్నావు. అది నిజంకాదు. శివకుమార్‌తో నాకేమీ లేదు. అతన్ని పట్టించుకోను. నన్నూ అతడు కన్నెత్తి చూడడు. చాలా నమ్మకస్తుడు మావారికి. పదేళ్ళకు పైనుంచీ వుంటున్నాడు ఆయన దగ్గర. ఎంత విశ్వాసపాత్రుడంటే — ఆయన డబ్బు వ్యవహారాలన్నీ అతడే చూస్తాడు. ఎన్నడూ అవకతవకలు జరుగలేదు. నువ్వతన్ని తప్పుగా భావిస్తున్నావు...."

"నువ్వతన్ని లొంగదీసుకున్నావు నాకు లాగే!"

"లేదు కమల్. అతను ఆడవాళ్ళని కన్నెత్తి చూడడు. ఇక్కడికి రాకముందు సైన్యంలో వుండేవాడట. చాలా చిన్నతనంలోనే చేరిపోయాడు. అప్పుడు యుద్ధంవచ్చింది. బాంగ్లాదేశ్ విముక్తి పోరాటంలో..."

"విముక్తి పోరాటంలో?"

"అతనికి పురుషత్వం పోయింది!"

"ఛ, నో్ర్మయ్!"

"నిజం. కావాలంటే అతన్నే అడుగు. అతను చెప్పకపోయినా ముఖంలో భావాలే చెప్తాయి...."

ముఖంలో భావాలు....ఆలోచించాను. నిన్న సాయంత్రం అతను వేసిన ప్రశ్నా.... నేనిచ్చిన జవాబూ అప్పుడతని ముఖంలో కళా....కానీ సంగతి ఇదంటే నమ్మ బుద్ధి గావడంలేదు!

మరొకటి స్ఫురించింది....ఆ రోజు గన్ ఫౌండ్రీనుంచి లీలను వెంటాడినప్పుడు, అప్పుడామె షాపింగ్ చేసుకొని తిన్నగా ఇంటికేవచ్చింది. మధ్యలో ఎక్కడా ఆగలేదు. ఆ రోజు రావ్ బొంబాయి వెళ్ళాడు. శివకుమార్ ఊళ్ళోనే వున్నాడు. అతన్ని కలుసుకోవాలంటే, అతనితో గడపాలనుకుంటే, ఆమెకు అంతకంటే మంచి అవకాశం, స్వేచ్ఛాలేవు. కానీ అలా జరగలేదు. అతనూ ఇంటికి రాలేదు. నేననవసరపు శంకతో ఆందోళన చెందుతున్నానేమో.

తల విదిలించాను బలంగా. లీల నిజాయితీగానే వుంది. ఆమె మోసం చేయడంలేదు నన్ను. నావన్నీ ఉత్త అనుమానాలు.

ఆ తర్వాత చాలా సేపటివరకు మేమిద్దరం ఈ లోకంలో లేము.

నా జుట్టులోకి వేళ్ళు జొనిపి లాగుతూ అంది లాలనగా, ఆయాసం తీర్చుకుంటూ. "కమల్, ఇలాంటి అనుభవం నా జీవితంలో పొందలేదు! ఎక్కడ నేర్చావీ కళ?"

"నా కళకంటే డార్లింగ్, నీ సహకారమే అద్భుతంగా వుంది!"

"నన్ను పొగడుతున్నావు, నీకిదో జబ్బు, అందర్నీ పొగడటం!"

"ముఖస్తుతికాదు, నిన్ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను."

"నువ్వు నీలోని టాలెంట్స్‌ని గమనించవు."

"గమనిస్తే గర్వం వచ్చేస్తుందని భయం. దాంతో అసూయా ద్వేషంవంటివి వచ్చేస్తాయి. అవన్నీ మనుషుల మధ్య సంబంధాల్ని పాడుచేస్తాయి! ఆ సంబంధాలు కోల్పోతే లీలా, విలువైన ఒక విజ్ఞాన గ్రంథాన్ని పోగొట్టుకున్నట్లే లెక్క!"

"నీకు రెండు నాల్కలున్నాయి కమల్."

"రెండా?"

"ఒకదాంతో కరుగ్గా మాట్లాడతావు. రెండో దానితో తేనెలు కురిపిస్తావు."

"వెల్ — నా జీవితం, ఈ ఆరేళ్ళ సంఘర్షణా నన్నిలా తయారుచేశాయి. నిన్ను బాధిస్తే క్షమించు, లీలా!"

"ఇంతకూ నా గురించి ఏమనుకొంటున్నావు నీవు?"

"నువ్వు నాక్కావాలి. నువ్వు లేకుండా ఉండలేను. నువ్వు నాతోపాటు వచ్చేయకూడదా? ఎన్నాళ్ళిలా? నీ భర్త మరో నాల్రోజులు చూసి మమ్మల్ని పంపించేస్తాడు. అప్పుడు ఎలా కలుసుకుంటాం మనం? అసలు నువ్విలా అతన్ని నిద్రపుచ్చి రావడం బాగా లేదు. అతనికి తెలిస్తే ...ఏం చేస్తావు?"

"అతనికి తెలియదు. మిమ్మల్ని మానిపించి నా నువ్విలాగే వస్తాండు."

"నో, ఈ రిస్కొద్దు. ఎక్కడికైనా వెళ్ళిపోదాం."

"ఎక్కడికి?"

"నువ్వు నిజం చెప్పు. నీకు నాతో వుండిపోవాలని వుందా లేదా?"

"వుంది. కానీ ఎలా? నన్నెలా భరించగలవు నువ్వు? నన్ను చూశావు కదా? నేనిప్పటికీ మారలేదు. నాకు ఐశ్వర్యం కావాలి. ఆ తర్వాతే ఏదైనా."

"అంత ఐశ్వర్యం ఒక్కసారి ఎలా వస్తుంది?"

"తలచుకుంటే ఏదైనా వస్తుంది."

"ఎలా?"

నవ్వింది ఆమె. "ఎలా ఏమిటి? మనింటికొచ్చే దొంగ నువ్వే అనుకో, ఆ సేఫ్‌లో నగలు నువ్వు దోచుకుంటావు, మనం పారిపోతాం, అంతే!"

"జోక్ చేయకు, సీరియస్‌గా చెప్తున్నాను!"

"నేనూ సీరియస్‌గానే అంటున్నాను....నీతో రావడానికి, నీ దగ్గరేముంది? భవిష్యత్తులో కూడా ఏమీ ఉంటుందనే ఆశలేదు ఈ లెక్కన. నీ చదువు ఎందుకూ పనికిరాదని నీకు తెలుసు. ఈ డిటెక్టివ్‌గా ఎంత సంపాదించావు? ఓ పదివేలున్నాయా, ఏదైనా వ్యాపారం చేసి పైకిరావడానికి? అదీ లేదు. ప్రేమా పగా అంటూ భవిష్యత్తు నాశనం చేసుకున్నావు ఇన్నాళ్ళూ. పిచ్చితనం! నీలాటి ఉన్మాదుల్ని చూస్తే చంపేయాలనిపిస్తుంది...."

"చంపెయ్యి!"

నవ్వింది ఆమె. "నన్ను చంపేస్తానన్నావుగా? ఏమైందా ఆవేశం?"

"నిన్నలా చంపను. ఇలా...."

ఆమె చటుక్కున జరిగి నన్నాపింది. "ఆగు కమల్,

నువ్వే ఆలోచించు. నేను కోరుకున్న స్థాయికి-కలలుగన్న జీవితాన్ని అనుభవిస్తున్నాను ఇపుడు. బాగా అలవాటు పడ్డాను ఈ రకం జీవితానికి. దీన్ని వదిలేసి ఇప్పుడు నీతో హఠాత్తుగా కిందికి రమ్మంటే ఎలా వీలవుతుంది? నువ్వే పైకి రావాలి. నన్నందుకోవాలి. అందుకు చాలా కాలం—ఎంతో కొంత కాలమైనా పట్టవచ్చు. పైగా అదృష్టముండాలి. నీ కదృష్టముందని ఏ నమ్మకంతో నేను నీతో అధమస్థాయి బ్రతుక్కి సిద్ధపడిరాను? అందుకే చెపుతున్నాను, నేనిక్కడే వుంటాను అంతవరకూ. నువ్వు బాగా సంపాదించి తిరిగిరా. నీతో వచ్చేస్తానప్పుడు తప్పకుండా!"

"ఓహ్, నేనున్నపళంగా ధనవంతుడు కావాలంటావు. అంతేనా? అయితే స్మగ్లర్నవుతాను, బందిపోటు నవుతాను. ఈ ప్రపంచాన్నే కొనేసి నీ కాళ్ళ దగ్గర పరుస్తాను—"

"నువ్వేదీ కానవసరంలేదు. ఒక మామూలు దొంగవైతే చాలంటున్నాను. అవకాశం నేను చూపిస్తున్నాను. ఉపయోగించుకోవడం నీ వంతు. దీంతో నువ్వు నన్ను శాశ్వతంగా పొందే యోగ్యతను సంపాదించుకుంటావు కమల్."

"నువ్వు నిజంగానే అంటున్నావా, లీలా?"

"నిజంగానే! ఆ సేఫ్‌లో నగలు తీసుకో. అదీ నీకుండే ఈ రెండు మూడు రోజుల అవకాశంలోనే. ఎవరికీ తెలీదు. ఆయన సేఫ్ ఎప్పుడూ తెరువడు. ఎప్పుడో తెరచి చూసుకునేసరికి మనం చాలా దూరంలో వుంటాం ఎవరికీ అందకుండా!"

"నాచేత—నాచేత నేరం చేయిస్తున్నావా, లీలా?"

"ఇది నేరం కాదు. అది పరాయి సొమ్ము కూడా కాదు. అతను పోతే ఎంతో కొంత ఆస్తి నాకివ్వకపోడు. అదే ఇదనుకుంటాను. నా ఆస్తిని నేను స్వేచ్ఛగా పొందుతాను. ఇందులో నా సహకారం వుంటుంది నీకు. ఈ మాత్రం కూడా నువ్వు చేయలేకపోతే నన్ను మర్చిపోవడం మంచిది, కమల్."

గబుక్కున ఆమెని దగ్గరకు తీసుకున్నాను. "లీలా, అలా అనకు! అలా తిరస్కరించకు! ప్లీజ్, నువ్వులేని బ్రతుకు వూహించలేను! నువ్వు నాక్కావాలి! నన్ను కాదనకు, ప్లీజ్!"

"కమల్, నన్ను కూడా అర్థం చేసుకో మరి!"

"అయితే చెప్పు, ఏం చెయ్యాలి? ఎలా చెయ్యమంటావు నన్ను?"

"రేపీపాటికి ఆ సేఫ్ ఖాళీచేసేయ్, డ్యూటీకొచ్చినప్పుడు. తాళంచెవి నేనే ఇస్తాను. నగలు బ్యాగులో నింపుకొని వెళ్ళిపో గప్ చిప్‌గా, సేఫ్‌ని యథాప్రకారం మూసేసి. ఆ బ్యాగు నీ దగ్గరే భద్రంగా దాచు. ఈ దొంగతనం ఎవరికీ తెలియదు. ఆయనా అనుమానించడు. మనం కొన్నాళ్ళక్కడే పరిస్థితులు గమనించి, వెళ్ళిపోదాం ఎక్కడైనా దూరంగా!!"

## 10

నా శరీరం వుండుండి జలదరిస్తోంది. హఠాత్తుగా వణుకు పుట్టుకొస్తోంది. గుండెను ఎవరో బిగిస్తున్నట్లు అనిపిస్తోంది....

సిగరెట్‌ని ఎడతెరిపిలేకుండా పీల్చేస్తూ కిటికీలోంచి చూస్తున్నాను దూరంగా ఫ్యాక్టరీ గొట్టాలను....దొంగతనం చెయ్యాలి! నగలు దోచుకోవాలి! ఈ ఆలోచనే

భరింపరానిదిగా వుంది. ఇది నా వృత్తికే విరుద్ధం. బాస్‌కు ద్రోహం. ద్రోహమా? ఓహ్, బాస్ నాకేం చేశాడు! ఇన్నాళ్ళూ అతనికి చేసిన సేవ చాలు! ఇప్పుడు స్వంతం గురించి ఆలోచించుకోవాలి. నా జీవితాన్ని తీర్చి దిద్దుకోవాలి. బాస్‌కూ నాకూ ఇక గుడ్ బై, అంతే?

అతని హెచ్చరిక గుర్తుకొచ్చి నవ్వుకున్నాను.... నా ఖర్మ నన్నే అనుభవించమన్నారు. ఇది ఖర్మకాదు, అదృష్టం. లీల నా స్వంతం. నా సర్వస్వం. ఆమెకోసం ఈ పని చేసితీరుతాను! ఏ పనైనా చేస్తాను. మళ్ళీ ఆమెను పోగొట్టుకునే బుద్ధితక్కువ పని మాత్రం చెయ్యానుగాక చెయ్యను!

అప్పుడు తేలికపడి ఆలోచించసాగాను ఆమె చెప్పిన పనిని. ఆలోచిస్తే అందులో లోపాలే కనిపిస్తున్నాయి. అది క్షేమకరమైన పద్ధతికాదు. మరొకటి ఆలోచించాలి. మరోవిధంగా చేయాలి....అయితే ఈవిధంగా చేయాలంటే ఇందులో రిస్కు వుంది. చాలా సాహసించాలి. ప్రతి అడుగు ప్రమాదంతో కూడుకున్నది. కానీ విజయం సాధిస్తే ఇంకెప్పటికీ నేను విజేతగా వుండిపోతాను. లీల చెప్పినదానివల్ల అదే క్షణంలోనైనా బద్దలు కావచ్చు.

లేచి వెళ్ళి ఆమెకు ఫోన్ చేశాను.

ఆమె వెంటనే పలికింది అవతల్నుంచి.

నేనన్నాను. "లీలా ఆ పని చేయాలనే నిర్ణయానికొచ్చాను. ఈ రాత్రికే చేస్తాను. అయితే నువ్వు చెప్పిన పద్ధతి మంచిదికాదు. యే క్షణంలోనైనా బద్దలవుతుంది. నీ భర్త ఎన్నాళ్ళవరకో సేఫ్ తెరవడని ఏమిటి నమ్మకం? ఎలా నమ్మాలి? రేపే తెరచి చూసుకోవచ్చు. లేకపోతే ఎల్లుండి. ఎవరికి తెలుసు? అలా జరిగితే అప్పుడేమవు

తుంది? మనం పారిపోగలమా వెంటనే? అలాచేస్తే అంతే సంగతులు. మన పలాయనం ఎందుకు జరిగిందో వూహించడం కష్టంగాదు వాళ్ళకు. అప్పుడు పోలీసులు రంగంలోకొచ్చారంటే, అంత తక్కువ వ్యవధిలో మనం దూరాన్ని మెయిన్‌టుయిన్ చెయ్యలేం, లీలా!"

ఆమె అంది వెంటనే. "ఇక్కడే వుండిపోదాం మామూలుగా. ఎందుకు పారిపోవాలి అలా? కొంతకాలం వాళ్ళు దొంగకోసం గాలించి విరమించుకుంటారు. అప్పుడు మనదారి చూసుకోవచ్చు...."

"మనదారి సంగతి కాదు, లీలా. నేను మా బాస్ గురించి ఆలోచిస్తున్నాను."

"ఏమిటతని గురించి?"

"మనగురించి అతనికి తెలిసిపోయింది...."

"ఏమిటీ....! ఎలా తెలిసింది?"

"భయపడకు. అతనికి మన పూర్వ పరిచయం తెలీదు. నీతో మూడు రాత్రుయి గడిపాననే తెలుసు. మొన్న నీ జడలో పువ్వు ఒకటి రాలి నా జేబులో పడింది.... వెధవది, దాన్ని బాస్ ముందు పారేసుకున్నాను. అంతే, కనిపెట్టేశాడు కథ!

"ఓహ్, నాకెందుకు చెప్పలేదు మరి నువ్వు?"

"అవసరమన్పించలేదు. మళ్ళీ అలా చేయనని మాటిచ్చాను. నీకు దూరంగా వుంటానని ప్రామిస్ చేశాను. నమ్మాడు. బహుశ ఆ విషయం మర్చిపోయుంటాడు కూడా. కానీ లీలా, రేపీ నగలచోరీ బైట పడితే, వేసిన తాళం వేసినట్లుండగానే లోపల సొమ్ము గల్లంతైయుంటే, సేఫ్‌ని బలవంతంగా తెరచిన చిహ్నాలేవీ లేకపోతే, దానికి సరిపడే తాళంచెవితోనే తెరిచినట్లు

తోస్తే, అదీ నా డ్యూటీ సమయంలో నాకు తెలియకుండా నే చోరీ జరిగిందని విశదమైతే లీలా, మనిద్దరం పెద్ద చిక్కులో పడతాం!"

"ఎలా, కమల్?"

"బాస్ నిన్నెప్పుడో అంచనా కట్టేశాడు. ఒక డబ్బున్న ముసలి భర్తకు అందమైన పడుచు భార్యవి! నీ అంతరంగం అతనికి అద్దంలా కనిపిస్తుంది. పైగా నన్ను లోబర్చుకున్నావు, ఇవి చాలు ఆ చోరీ నువ్వు నాచేత చేయించావని అనుమానించడానికి.... అటుపైన నీమీదా, నామీదా, నిఘా పెట్టేస్తాడు, అంతే! అప్పుడు మన స్వేచ్ఛని అతని దగ్గర కుదువబెట్టి చేతులు ముడుచుకొని కూర్చోవాలి. మసిలే వీలుండదు. కలిసే వీలుండదు. ఎప్పుడో హఠాత్తుగా యే పొరపాటుతోనో దొరికి పోతాం! బాస్ నన్ను క్షమించడు. నీ భర్త నా బాస్ నే బ్లేమ్ చేస్తుంటాడు.... బాస్ చెడు పేరు తెచ్చుకోవడం సహించడు. తనే స్వయంగా రంగంలోకి దిగి మనిద్దరి బండారాన్ని బద్దలు చేస్తాడు—"

"అయితే.... అయితే ఏం చేద్దాం?"

"ఆలోచించాను. ఈ పని అలా చేయకూడదు. చోరీ అలా రహస్యంగా వుండిపోకూడదు తెలిసేవరకూ. అది వెంటనే తెలిసిపోవాలి. ఎలాగూ ఆ నగలకోసం ఒక దొంగ ప్రయత్నిస్తున్నాడని అంతా నమ్ముతున్నారు కదా, ఈ చోరీ వాడిమీదకే వెళ్ళేలా రంగం సిద్ధంచేస్తే సరి!"

"అదెలా కమల్?"

అదెలాగో ఆమెకు చెప్పసాగాను....

# 11

సాయంత్రం నేను ప్రతాపరావు బంగళాకు వెళ్ళే నప్పుడు అతను లాన్‌లో కూర్చుని లైఫ్ పత్రిక తిరగే స్తున్నాడు. దూరంగా విక్కీ తన ధోరణిలో ఫుట్‌బాల్ ఆడుకొంటున్నాడు. ఇంట్లో కారు లేదు.

"కూర్చో, క మ లా క ర్" అన్నాడతను కుర్చీ చూపిస్తూ, "ఇంట్లో ఎవరూ లేరు. లీల ఇప్పుడే షాపింగ్ కెళ్ళింది. రాజూ వాడి భార్యా ఊరెళ్ళారు. ఉత్తరం వచ్చింది ఉదయం, వాడి తండ్రికి ఆరోగ్యం బాగా లేదట.... ఈ శివకుమార్‌ని ఆరుగంటలకే రమ్మన్నాను. ఆరున్నరవుతోంది. ఎందుకు రాలేదో ఇంకా...."

నా మనసంతా ఎలాగో అయిపోయింది. విక్కీని చూశాను దూరంగా.

"కానీ సర్, మీ మిసెస్ కూడా విక్కీని తీసు కెళ్ళరా షాపింగ్ కెప్పుడూ?" అన్నాను, ఆందోళన అణచుకొంటూ.

అతను నవ్వాడు. "ఎందుకు లేదు? వాడికే ఇంట్రెస్టు లేదు. స్కూలు ఇల్లూ తప్ప వేరే ప్రపంచం వద్దు వాడికి."

"మమ్మల్ని ఇంకెంతకాలం ఉపయోగించుకుంటారు?"

"చెప్పలేను. నమ్మకం కలగాలి, దొంగ ఇక రాడని."

"మళ్ళీ వస్తాడనుకోను, మొన్నటి అనుభవంతో."

"ఎలా తెలుసు? కొన్ని అలవాట్లకి అనుభవం అవ రోధం కాదు."

"మీ సెక్రటరీ.... శివకుమార్‌ని బాగా నమ్ముతారా, సర్?"

"శివకుమారా? ఎందుకు నమ్మను? నా సర్వం అతనే. బిజినెస్ విషయాల్లో అతను లేకపోతే నేనేం చేసే

వాడినో తెలీదు. కేవలం అతనితోనే బిజినెస్ పెట్టు కొస్తున్నాను..." అతను ఉన్నట్టుండి పగలబడి నవ్వాడు. "కమలాకర్, నీకు తెలుసా? ఆ స్టుపిడ్ మిలిటరీలో చేరి మగసిరి పోగొట్టుకున్నాడు! బంగ్లాదేశ్ యుద్ధంలో బరస్టయిందతని ప్రాపర్టీ! వింటున్నావా? సంసార జీవితానికి పనికిరాడు. ఇలాటివాళ్ళే వినయ విధేయులతో విశ్వాసపాత్రులుగా ఉంటారనుకుంటాను.... ఈ పదేళ్ళ నుంచీ ఎంత నమ్మకంగా ఉన్నాడనుకున్నావు? ప్రాణమిస్తాడు నాకేదయినా అయితే. చాలా ఏళ్ళు అతని తీరు తెన్నులూ, ఒంటరి జీవితం కనిపెట్టి ఒకనాడు అడిగేశాను. అప్పుడు నాకంతా చెప్పేశాడు తన సంగతి! స్టుపిడ్, నా దగ్గర ఏదీ దాచడు. అదొకనాడు లీలకు చెబితే ఆమెనొకటే ...."

విస్తుపోయి చూస్తున్నాను అతన్ని. అతను ఇంకా చెప్పుకుపోతున్నాడు. నా చెవికేదీ ఎక్కడంలేదు. కానీ ఒక్కటి స్పష్టమయింది. లీలమీద నా అనుమానం పూర్తిగా తొలగిపోయిందిప్పుడు.

ఆమె సుమారు ఏడున్నరకు తిరిగి వచ్చింది.

భోజనాలకి కూర్చున్నప్పుడు రావ్ ఏవేవో చెబుతూ, నవ్విస్తూ, మాటాడుతూగా, ఒక అయిడియాకట్టి నన్ను చూశాడు గర్వంగా. ఆ అయిడియా నా ముఖంలో రక్తాన్ని తోడేసింది! లీల నా వైపు విస్మయంగా చూసింది! నగలు ఇంట్లో పెట్టుకుని దొంగతో చెలగాటమెందుకు—రేపే తీసుకెళ్ళి వాటిని బ్యాంకులో వేసేస్తానన్నాడు రావ్!

నేను లీల చెప్పినట్లే గుడ్డిగా చేయాలనుకొనివుంటే, రేపు తెల్లవారుతూండగానే మా బండారం బద్దలయ్యేది!

లేదు, ఈ పని నేననుకున్నట్లుగానే చేయాలి.

భోజనాలయ్యాక నేనొక్కడిన్నీ బైటికొచ్చి కూర్చున్నాను ఆలోచిస్తూ. అప్పుడే శివకుమార్ వచ్చాడు ఎనిమిదిన్నరకు, స్కూటరుమీద. అతన్ని చూసి నాకు రావ్ మాటలూ, నవ్వూ జ్ఞాపకం వచ్చాయి.... లేచి అతన్ని సమీపించాను ఎదురొస్తోంటే. అతను ఆగి వింతగా చూశాడు.

"ఐయాం సారీ, మిష్టర్ కుమార్" అన్నాను అతని కళ్ళలోకి చూస్తూ, "నిన్న అలా మాట్లాడినందుకు...."

అతను కలవరపడి చూశాడు.

"మీరేం బాధపడలేదుగా?" అన్నాను మళ్ళీ.

అడ్డంగా తలూపాడు వెంటనే.

"గుడ్, మనిద్దరం ఫ్రెండ్స్. ఓ. కే?" చెయ్యి అందించాను.

చటుక్కున చెయ్యి కలిపి నొక్కాడు.

"మీరెక్కడున్నారు? మీ బాస్ అరగంటలనించీ చూస్తున్నారు" అన్నాను మళ్ళీ.

అతను వెంటనే చెయ్యివదలి గబగబా వెళ్ళిపోయాడు ఇంట్లోకి.

అతనివైపే చూస్తూ నిలబడ్డాను చాలాసేపు.

ఆ తర్వాత బంగళాచుట్టూ ఓ ప్రదక్షిణం చేసి వచ్చి కూర్చున్నాను, రివాల్వర్ తీసి చేతిలో తిప్పుతూ. అర గంటలో శివకుమార్ బయటకొచ్చి వెళ్ళిపోయాడు. అప్పుడు ఇంట్లో లైట్లన్నీ ఆరిపోయాయి. మరో పావు గంట తర్వాత వచ్చి నన్ను చేరుకుంది లీల!

ఆమెని అక్కడే, ఆ కుర్చీప్రక్కనే గడ్డిలోకి లాగి..

గంటసేపటికి మేం విపరీతంగా అలసిపోయాం. జీవి

తంలో అదే చివరిరాత్రి అయినట్లుగా ప్రవర్తించాం.

ఆమె నన్ను గాఢంగా పెనవేసుకుని అంది, "కమల్ ఈ రాత్రికి చేస్తావుగా?"

"చేస్తాను."

"తాళంచెవి కిటికీ ప్రక్కన పూలకుండీలో వుంచుతాను."

"గుడ్."

"మళ్ళీ అక్కడే పెట్టేయి."

"అలాగే. కానీ తాళంచెవి నీ అందుబాటులోకెలా వచ్చింది? వస్తే ఇన్నాళ్ళూ సేఫ్ తెరచి ఎందుకు చూడలేదు? మొన్న అబద్ధం చెప్పావా?"

"లేదు. ఇన్నాళ్ళూ ఆసక్తిలేకపోయింది...."

ఆమె నా కంఠంమీద ముద్దుపెట్టుకుంది. తిరిగి నేను ఆమె చెక్కిళ్ళను చుంబించాను. చివరికి అయిష్టంగా, అతికష్టంమీద వేరుపడి వీడ్కోలు చెప్పుకున్నాం.... వీడ్కోలు.

అదే మా చివరి వీడ్కోలవుతుందని నాకు తెలియదప్పుడు.

పన్నెండు గంటలకి దిలీప్ డ్యూటీకి రావడంతో, అతన్నుంచి సెలవుతీసుకుంటూ చూశాను పరిశీలనగా. ఇతన్ని దెబ్బతీయగలనా నేను?

## 12

నేను ఫ్లాట్ కి తిరిగి వచ్చేసరికి పన్నెండున్నర అయింది—

బైక్ ని షెడ్డుకింద నిలిపి, వాచ్ మన్ ని పలకరిస్తూ దారి తీశాను లోపలికి. అతను సంతోషంగా చూసి నన్ను విష్ చేశాడు. అతనితో నాకు చాలా అవసరముంది. అతనితో

నా ఎలిబీని ఎస్టాబ్లిష్ చేసుకోవాలి. ఇటుపైన రాత్రంతా నేను బైటికి వెళ్ళలేదని సాక్ష్యమిస్తాడు, ఇన్ వెస్టిగేషన్ నా వరకూ వస్తే.

నాల్గో అంతస్తులో నా ఫ్లాట్ లోకి ప్రవేశించి, వెంటనే తలుపు మూసి గడియపెట్టాను. వేగంగా ఫోన్ని సమీపించి, బాస్ ఇంటి నెంబర్ తిప్పాను. అతను వెంటనే రెస్పాన్స్ ఇచ్చాడు. నేను రిపోర్టు చేశాను పరిస్థితి బాగున్నట్లు. అతను విని గుడ్ నైట్ చెప్పాడు.

నేను ఫోన్ పెట్టేస్తూ సందేహించా. ఒకవేళ బాస్ మళ్ళీ ఫోన్ చేస్తే? డ్యూటీ దిగాక బాస్ డిస్టర్బ్ చేయడు, కానీ ఏదైనా అత్యవసరముస్తే? అలాంటి అవసరం ఈ గంటలోగా రాదని-రాకూడదని బలవంతంగా సమాధానపడ్డాను.

అప్పుడు షెల్ఫ్ దగ్గరకు నడిచి దానిమీద ఏర్ బ్యేగును అందుకున్నాను. జిప్ లాగి అందులోని వస్తువులు బయటికి తీశాను. అవన్నీ మధ్యాహ్నం సమకూర్చుకున్నవి. ఒక జత బ్లూ కలర్ లో రెడీమేడ్ కాటన్ డ్రస్సు, ఒక జత మెత్తని అడుగులు గల కాన్వాస్ బూట్లు, ఒక జత ఉల్లన్ గ్లవ్స్, సుత్తీ పటకారూ స్క్రూడ్రైవర్లూ మొదలైన పనిముట్లు కొన్ని, రెండు నైలాన్ తాడుముక్కలు, అరవై అడుగుల కొబ్బరితాడు ఒకటి, ఒక ఎడ్హెషివ్ టేప్, ఒక పెద్ద సైజులో పేపరు వెయిట్, పెన్ సెల్ టార్చి ఒకటి, గ్లాస్ కటర్, ఒక నల్లని గుడ్డతో తలమీదుగా వేసుకొనే ముసుగూ.... దానికి కళ్ళూ ముక్కూ స్థానాల్లో రంధ్రాలున్నాయి.

డ్రసూ, బూట్లూ, వేసుకొని; గ్లవ్స్ చేతులకి తొడు

కున్నాను. మిగిలిన వస్తువుల్ని వేలిముద్రలు లేకుండా శుభ్రంగా తుడిచి తిరిగి బ్యాగులో సర్దాను.

అప్పుడు గదిలో లైటార్పేసి ఫ్యాను వేసివుంచి కిటికీ తెరిచాను.

అవతల లైట్ల వెలుగులో బాలానగర్ ఇండస్ట్రియల్ ఏరియా దేదీప్యమానంగా అగపడుతోంది .... కొబ్బరి తాడుని కిటికీ హింజ్ కి కట్టి, బలంగా లాగిచూసి, కిటికీ అవతలకి జారవిడిచాను. అది కింది అంతస్తుని దాటి వెళ్ళింది. ఆ క్రింది భాగం పబ్లిక్ వీధి. వాచ్ మన్ ఇటు తిరిగే వీలు లేదు. ఫ్లాట్ ఆవరణ అంతా ముందు భాగంలోనే వుంది. ఈ వెనుక వీధిలో బాగా రాత్రయితే జనసంచారం వుండదు. లైట్లు వుండవు.

బ్యాగుని భుజానికి తగిలించుకుని కిటికీ ఎక్కి అవతలకి దిగాను, తాడుని గట్టిగా పట్టుకొని. మరుక్షణం వేగంగా జారుకుంటూ కిందికి వెళ్ళిపోసాగాను. కింద మూడో అంతస్తు కిటికీ షేడ్ తగిలి జాగ్రత్తగా దానిపై పాదాలు మోపాను. ఏమాత్రం చప్పుడు కాలేదు.

తిరిగి అక్కడ్నుంచి కిందికి బయలుదేరాను. మధ్యలో వచ్చిన షేడ్స్ అన్నీ జాగ్రత్తగా దాటుకుంటూ రెండు నిమిషాల్లో హఠాత్తుగా వచ్చి నేలమీద పడ్డాను అడ్డంగా. తాడు ఆరడుగుల ఎత్తులో అంతమైంది.

అక్కడ్నుంచి లేచి వీధిలోకి దారితీశాను గబగబా. వీధిలో ఎవరూ లేరు.

సమయం ఒంటిగంట కావస్తోంది. వీధి దాటేసి, మెయిన్ రోడ్డుమీదకొచ్చి, చీకటిగా వున్నచోట ఆటోని ఆపి ఎక్కి కూర్చున్నాను. చీకట్లో అతను నన్ను గుర్తించలేదు. అక్కడ్నుంచి ఏకధాటిగా బేగం పేట,

అమీర్ పేటల మీదుగా పంజాగుట్ట చేరుకొని, మళ్ళీ చీకటి స్థలంలో దిగిపోయాను. అక్కడ్నుంచి తిరిగి రిక్షాలో బయల్దేరి బంజారా హిల్స్ దరిదాపులకి చేరుకుని దిగిపోయాను.

బంజారా హిల్స్‌లో రాత్రులు ప్రవేశించడం కష్టం. బీట్ కానిస్టేబుల్స్ తిరుగుతుంటారు. వాహనాలు ఇట్టే దృష్టిలో పడతాయి. కాలినడకన వెళ్ళే వాళ్ళు ఎదురైతే ఏ బంగళా కాంపౌండులోకో దూకేసి తప్పించుకోవచ్చు. రావ్ ఇంటికొస్తున్న దొంగ బహుశా ఇలాగే వస్తూండవచ్చు.

నేను అలాగే చేరుకున్నాను. పోలీసులెవరూ ఎదురు కాలేదు. రావ్ బంగళా చేరుకొని కాంపౌండ్ దగ్గర నక్కి నిలబడ్డాను. లోపల ఎక్కడా లైట్లు లేవు. నిశ్శబ్దంగా చెట్లూ చేమల ఆకారాలు మాత్రం కన్పిస్తున్నాయి. పహారా కాస్తున్న దిలీప్ ఎక్కడా కనిపించలేదు. ఒక్క నిముషం ఎదురుచూశాను. అప్పుడు కన్పించాడతను, టార్చి వేసుకుంటూ బంగళా వెనుకనుంచి వస్తూ.

నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. అతన్ని దెబ్బ తీయాలి! ఏమాత్రం అవకాశం తప్పినా నన్ను పని గట్టేస్తాడు!

బ్యాగులోంచి ముసుగుతీసి తొడుక్కున్నాను. తర్వాత పేపరు వెయిట్ తీసుకొని, బ్యాగును కాంపౌండులోకి జారవిడిచాను జాగ్రత్తగా.

దిలీప్ నడుచుకుంటూ వచ్చి మొక్కల చాటున నేను కూర్చునే స్థలంలో కూర్చున్నాడు కుర్చీలో, టార్చి

ఆర్పని.

నేనాలస్యంగాకుండా కాంపౌండులోకి దిగి పేపరు వెయిట్ ని కుడిచేతిలో బలంగా పట్టుకొని, వేగంగా పరుగుతీశాను వంగి అతని దిశలో.

గడ్డిలో నా బూట్లు శబ్దంచేయడంలేదు. నా వేళ్ళు పేపర్ వెయిట్ ని గట్టిగా చుట్టివేస్తున్నాయి. శ్వాస వేగం హెచ్చి యెక్కడ అలికిడవుతోందోనని అదురు పుట్టింది....

అలాగే ఉరికి, అతని సమీపంలో మొక్కల్లో అనుకుని పడుకున్నాను బోర్లా. అతను కదల్లేదు. సిగరెట్ కాలుస్తూ ఎటో చూస్తున్నాడు.

అప్పుడు సిద్ధమయ్యాను. మొక్కల కాండాన్ని రెండు చేతులతో పట్టుకొని గట్టిగా వూపిరి వదిలాను. ఆకులు గలగలమన్నాయి ఒక్కసారిగా. కిందనుంచి గమనిస్తున్న నాకు, హఠాత్తుగా లేచి నిలబడ్డ డెవిల్ కన్పించాడు. అతని చేతిలో సిగరెట్ జారిపడింది, టార్చి వెలిగింది. అతని అడుగులు అతిజాగ్రత్తగా నావైపు పడసాగాయి....

నా రక్తం వేగంగా ప్రసరించింది .... కళ్ళప్పగించి చూస్తున్నాను. అతను వచ్చి నాకు రెండడుగుల దూరంలోనే నిలబడ్డాడు మొక్కలవతల.

క్షణాలు గడిచిపోతున్నాయి. అతనిలో కదలిక లేదు. టార్చి వెలుగు దూరంగా పడుతోంది కాంపౌండు గోడల మీద. నేను చేతులు నెమ్మదిగా జాపసాగాను. నెమ్మదిగా, అతి నెమ్మదిగా చాపి, కిందనుంచి అతని కాళ్ళు రెండూ పట్టి లాగేశాను శక్తంతా ఉపయోగించి—

అతను తూకం తప్పి వెల్లకితలా విరుచుకుపడ్డంతో,

ఒక్క ఎగురుతో ముక్కలమీంచి దూకి, దాడిచేయబోయాను అతనిమీద పేపర్ వెయిట్‌తో—

కానీ అతను తేరుకున్నాడు. తేరుకొని ఒక్క ఉదుటున చిరుతలా లేచాడు, కాలు నాకేసి విసురుతూ. ఆ తాకిడికి నా తొడ పగిలినట్లయింది! అయినా ఓర్చుకుంటూ విజృంభించాను అతనిమీదికి—చేత్తోలాగి దెబ్బ కొట్టాను అతని నుదురుమీద. అతని చేతిలో టార్చి రివ్వున వెళ్ళి ఎక్కడో పడింది. అతని చేతులు నా కంఠాన్ని చుట్టివేయబోవడంతో మరో దెబ్బ తీశాను నడినెత్తిమీద. ఒక్క మూల్గు మూల్గి ఊ....హుఁవ్! అని తలపట్టుకొని కూలిపోయాడు అక్కడే!

నేను గబుక్కున వంగి మరో దెబ్బ కొట్టాను తల వెనుక. చాలు! ఇక గంటవరకూ లేవడు. ఆయాసంతో వగరుస్తూ నా చేతిలో పేపర్ వెయిట్‌ని చూశాను. అతన్ని అలా కొట్టడం బాధ కలిగించింది....అక్కడ్నుంచి పరుగెత్తి కాంపౌండు గోడ దగ్గర నా బ్యాగు తెచ్చుకున్నాను.

అందులోంచి నైలాన్ తాళ్ళుతీసి అతని కాళ్ళు, చేతులు కట్టేశాను. ఎడ్ హెషివ్ టేప్ నోటికి అతికించాను. అతన్నలా వదిలేసి సేఫ్ గదివున్న బాల్కనీ క్రిందకి చేరుకున్నాను. అక్కడ నీళ్ళపైపు పట్టుకొని పైకి ఎగబ్రాకసాగాను గబగబా....

బాల్కనీలోకి దిగి బ్యాగులోంచి పెన్ టార్చి, గ్లాస్ కట్టర్ తీశాను. టార్చిని కిటికీలో వున్న పూల కుండీలో వేసి, అందులో మెరుస్తున్న పెద్ద స్టీలు తాళం చెవిని చూశాను. దాన్నందుకుని అటూ యిటూ తిప్పి చూశాను. దీనిమీద లీల కేలిముద్రలుండవచ్చు. దాన్ని

పట్టు అంచుకి తుడిచి జేబులో వేసుకున్నాను.

అప్పుడు గ్లాస్ కటర్‌తో కిటికీ అద్దంమీద లోపల కొక్కెంవున్న చోట చేయి లోపలికి పెట్టి గడియ తీసేశాను. రెక్క తెరుచుకుంది. గ్లాస్ కటర్‌ని కిటికీలో పెట్టి లోపలికి దిగాను బ్యాగుతో.

నా గుండె వేగం హెచ్చింది.... ముసుగుతీసి కిటికీలో పెట్టాను. టార్చివేసి సేఫ్‌వైపు నడిచాను.... హఠాత్తుగా నాకేదో జ్ఞాపకం వచ్చింది. గబుక్కున చెయ్యి జేబులో పెట్టి చూశాను. బ్యాగు తెరచి లోపల చూశాను. లేదు! నా రివాల్వర్ లేదు! ఏమైంది? విడిచేసిన ప్యాంటులో మరిచానా? ఎక్కడన్నా జారిపోయిందా? నాకేమీ పాలుపోలేదు. వున్నట్టుండి నా వళ్ళంతా చెమటలు పట్టేసింది. ఆందోళన అణచుకుంటూ పని కుపక్రమించాను.

బ్యాగులోంచి స్క్రూడ్రైవర్ తీసి సేఫ్ కీ హోల్ చుట్టూ గీతలు పెట్టాను. పటకారుతో హేండిల్‌ని డ్యామేజి చేశాను. సుత్తితీసి నేలమీద పెట్టాను. అప్పుడు తృప్తి చెంది తాళంచెవితో సేఫ్‌ని తెరిచేశాను.

డోర్ పట్టిలాగి, లోపల టార్చి వేసినప్పుడు—ఓహ్—ఎంత సొమ్ము! ఎన్ని నగలు! ఏమి అదృష్టమిది! నా కళ్ళు రెప్పపడడంలేదు. గొంతు తడారిపోతోంది. వెన్నులోంచి విపరీతమైన చలి పుట్టుకొచ్చి వ్యాపించింది నిలువునా! అదుపుతోనూ చేయి చాపాను లోపలికి. గుప్పిట బిగించి అందినన్ని తీశాను వెలుపలికి. ఉద్వేగంతో ఒక్క కేక వేయాలనిపించింది వాటి స్పర్శకి!

ఒక్క విసురుతో అప్పుడు భళ్ళున తెరుచుకుంది తలుపు—

ఎటువంటి హెచ్చరికా లేకుండా గది ప్రకాశవంత మైంది హఠాత్తుగా లైట్లు వెలిగి. అప్పుడంది ఒక మృదువైన కంఠం వెనుకనుంచి ఎంతో ఆప్యాయంగా.

"కమలాకర్! యూ ఫూల్, ఇటు చూడు!"

## 13

ఏం జరుగుతోందో నాకు తెలియదు. నాకసలు ఏమీ తెలియడంలేదు! తేరుకునేలోపు అంతా జరిగిపోయింది. తిరిగిచూసిన మరుక్షణం కళ్ళుచెదిరే మెరుపు నన్నాక్ర మించుకుంది ఒక్క క్షణం! ఆ తర్వాత హఠాత్తుగా నవ్వు! అదే నన్ను అదిరిపడేలా చేసింది ప్రక్కలో బాంబు పడ్డట్టు!

తేరుకొని చూసిన నాకు ఎదురుగా ప్రతాపరావు కన్పించాడు! మెడలో ఫ్లాష్ కెమెరాతో!

అతను నవ్వుతున్నాడు. ఇంకా పడీపడీ నవ్వుతున్నాడు. అతని నవ్వు చూసి నన్ను నేను చూసుకున్నాను. వొళ్ళంతా చెమటతో తడిసిపోయి, చెరో చేతిలో టార్చి నగలతో!

అప్పుడు—ఏదో అలికిడైంది కిటికీ దగ్గర. చటుక్కున చూశాను తలతిప్పి. సుతారంగా ఒక చెయ్యి లోపలి కొస్తూ కన్పించింది....ఏదో నల్లని వస్తువు మెరుస్తూ కన్పించింది దాని గుప్పిట. దాని దిశ రావ్ వైపు తిరుగు తోంది మెల్లిగా..నా ప్రాణాలెగిరిపోయాయి అది చూసి! రావ్ అది గమనించినట్టులేదు! అతనింకా అలాగే నవ్వు తున్నాడు.

చేతుల్లోని వస్తువుల్ని జారవిడిచేసి ఒక్క గంతులో అతని మీదికి వెళ్ళి దూకాను, అతన్ని దూరంగా తప్పించేస్తూ. నేనలా చేయడమూ, నా వెనుక పెద్ద

ప్రేలుడు సంభవించడమూ కేవలం ఒక్క క్షణం తేడాతో జరిగిపోయింది. మేమిద్దరం కింద దొర్లుతూ వెళ్ళి గదవతల నడవలో పడ్డాం—

ఆ ధ్వనికి కెవ్వున అరుస్తూ పడగ్గదిలోంచి పురికి వచ్చింది లీల! రావ్ నన్ను విడిపించుకుని లేచి నిల బడ్డాడు ఒక్క ఉదుటున. అతని చేయి జేబులోకి వెళ్ళింది చటుక్కున—

"చూడు కమలాకర్, దాని నటన చూడు!"

ఆమె ఇంకా మమ్మల్ని చేరుకో నేలేదు అలా అరుస్తూ. రావ్ చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమై ఆమె గుండెని చీల్చి చెండాడింది! రక్తం జివ్వున వెలువడి, ఆమె కేక ఆగిపోయి వస్తున్నపళంగానే వెనక్కి విరుచుకుపడి పోయింది!

నా కాళ్ళక్రింద నేల జారిపోయినట్లయింది....!! ఆ ప్రక్క గదితలుపు దబదబా మోగుతోంది. లోపలినుంచి విక్కి అరుపులు విన్పిస్తోన్నాయి. తలుపు బయట గడియ పెట్టివుంది. రావ్ వెళ్ళి అతన్ని సముదాయిస్తున్నాడు. నచ్చజెప్తున్నాడు....అప్పుడే శివకుమార్ సేఫ్ గదిలోకి కిటికీలోంచి దూకాడు.

అతను వేగంగా పరుగెత్తి వస్తూ, కిటికీలో నేను వదిలిన ముసుగూ, నేలమీదపడున్న రివాల్వరూ అందుకుని వచ్చాడు. నేను వెర్రిగా కేకపెడుతూ రావ్‌కు అడ్డంగా వెళ్ళాను రక్షణగా.

శివకుమార్ నన్ను చూసి పకపకా నవ్వాడు. "మీరు పొరబడ్డారు!"

రావ్ నన్ను పక్కకు నెట్టి అతనివైపు కదిలాడు, "సక్సెస్?"

"సక్సెస్, సర్!"

"కమాన్, లెట్స్‌గో!" రావ్ కిందికి పరుగు తీశాడు వేగంగా.

నేనయోమయంగా వెర్రిగా వాళ్ళిద్దర్నీ, కింద నిర్జీవంగా పడివున్న లీలనూ చూసి వాళ్ళ వెంట ఉరికాను కిందికి.

రావ్ బయట తోటలోకి వెళ్ళి ఎడమవైపు పరుగు తీశాడు. అక్కడ సేఫ్ గది బాల్కనీ కింద ఆగిపోయి చూడసాగాడు టార్చివేసి.

అక్కడ బోర్లా పడిపోయి ఒక ఆకారం వుంది. దానిలో కదలిక లేదు. దాని తలచుట్టూ పెద్ద రక్తపు మడుగు వుంది—

నా వళ్ళు చల్లబడిపోయింది!

శివకుమార్ నా వైపు తిరిగి అన్నాడు. "మీకభ్యంతరం లేకపోతే మీ గ్లవ్స్ తీసిస్తారా?"

"ఎందుకు? ఆ శవం ఎవరిది?" అరిచాను ఉద్రేకంగా.

అతను నవ్వి చొరవగా తనే నా గ్లవ్స్ తీసుకొని, శవం దగ్గరకి వెళ్ళి దాని చేతులకి తొడిగాడు.

రావ్ అప్పుడు తన జేబులోంచి రివాల్వర్ తీసి శవం మీదికి విసిరాడు, శుభ్రంగా వేలిముద్రలు తుడిచి.

"గుడ్. నౌ గెట్ ది పోలీస్!" అన్నాడతను కుమార్‌కు కెమెరా అందిస్తూ.

శివకుమార్ ఆ కెమెరా తీసుకుని ఇంట్లోకి పరుగు తీశాడు.

నా గుండె అదిరింది పోలీసుల పేరు వినగానే!

"మిస్టర్ రావ్! పోలీసులెందుకు నన్నేం చేస్తున్నారు?" అనరిచాను పిచ్చిగా.

అతను నవ్వి అక్కడ్నుంచి కదిలాడు. తిన్నగా దిలీప్ పడున్న చోటికెళ్ళి అతన్ని పరీక్షగా చూడసాగాడు. నేను అసహనంగా, ఆవేశంగా వెళ్ళి అతని ప్రక్కన ఆగాను. "మిష్టర్ రావ్ మాట్లాడండి!"

అతను సిగరెట్ వెల్గించుకుని ఆ ప్రక్కనే కుర్చీలో కూలబడ్డాడు. తలెత్తి నా ముఖంలోకి తీక్షణంగా చూశాడు.

"గుడ్, బాగుంది. అతన్ని బాగా కట్టిపడేశావు...."

"ఓహ్, నన్నేం చేస్తున్నారు! పోలీసులకప్పగిస్తారా?"

"నిన్నేం చేయడంలేదు, కమలాకర్ నువ్వెళ్ళి పోవచ్చు."

"నన్నేం చేయకపోతే ఆ ఫోటో ఎందుకు తీశారు?"

"అది—నా సెక్యూరిటీ కోసం."

"మీకు సెక్యూరిటీ దేనికోసం?"

"వాళ్ళిద్దర్ని చంపినందుకు."

"ఎందుకు చంపారు వాళ్ళని?"

అతను పకపకా నవ్వాడు, "నీకేం తెలుసు కమలాకర్? యూ ఆరే ఫూల్! నువ్వెంత మోసపోయావో నీకు తెలుసా? నీకేం తెలియదు. ఆ లీల నీ స్వంతమైందను కున్నావా? అది నాకే స్వంతం కాలేదు! చాలా ఆల స్యంగా తెలిసింది దానికో లవర్ వున్నాడని. ఆ లవర్ అదుగో అక్కడ చచ్చిపడున్నాడు తలపగిలి. నరేష్ అట వాడి పేరు. ఎంత కాలంగా సాగుతోందో నాకు తెలీదు. మూడ్నెల్ల క్రితమే తెలిసింది. తెలిసి దాన్ని నేనేమీ నిలదీయలేదు తెలుసా! అది బుకాయిస్తుంది. కాదని దబాయిస్తుంది. ఏమిటి ప్రయోజనం?

"నేను మోసపోయానని తెలిస్తే ఎందుకు చేశావు

మోసమని అడుగను. గవ్ చిన్ గా నాకు తోచిన శిక్ష విధించి వదులాను. లీల నన్ను మోసంచేసింది. నామీద ఆ ప్రేమా, వాత్సల్యం, విక్కీపట్ల మమకారం అంతా నా డబ్బుకోసం చేస్తున్న నటన అని, దాని లవర్‌తో మాటల్నిబట్టి గ్రహించాను. అప్పుడు నే నేం చేశానను కున్నావు? వాళ్ళ ఆలోచనల్ని ఎప్పటికప్పుడు తెలుసు కొంటూ వుండడానికి నియమించాను శివకుమార్‌ని."

అతను క్షణమాగి తిరిగి చెప్పసాగాడు....

"శివకుమార్ మిలిటరీలో పనిచేశాడని నీకు తెలుసు. ప్రతిదీ పర్‌ఫెక్టుగా చేస్తాడు. నేను చెప్పిందే తడవుగా ఈ ఇంటినీ, ఆ లీల లవర్ యింటిని బగ్గింగ్ చేసేశాడు. ప్రతి గదిలోనూ ప్రతిచోటా మైక్రోఫోన్ అమర్చాడు ఎంతో రహస్యంగా. వింటున్నావా? ఫోన్స్‌ని కూడా టాప్ చేశాడు. మా నౌఖరు రాజుకి ట్రైనింగ్ ఇప్పించాడు ఎవరికీ తెలీకుండా. రిసీవర్‌ని వాడి అవుట్ హౌస్‌లో అమర్చాడు. నేను లేనప్పుడు ఇంటికొచ్చే ప్రతి ఫోన్‌కాల్, ఎవరైనా వ్యక్తులు వస్తే వాళ్ళ మాటలూ అన్నీ రాజు తన అవుట్ హౌస్‌లో కూర్చుని రికార్డుచేస్తూంటాడు.

"లీలకు ఇదేమీ తెలీదు. ఆమె లవర్‌ని కలుసుకో డానికి వెళ్తే కుమార్ వెంటాడి ఆ లవర్ ఇంటివెనుక తీసుకున్న అద్దె ఇంట్లో కూర్చుని రిసీవింగ్ ఎక్విప్ మెంట్‌తో వాళ్ళ మాటలన్నీ రికార్డుచేస్తాడు. ఆ టేప్స్ తెచ్చి యెప్పటికప్పుడు నాకు వినిపిస్తుంటాడు........ వింటున్నావా?"

నాకప్పుడు గుర్తొచ్చాయి రెండు సంఘటనలు....ఆ రోజు రాత్రి లీలతో తోటలో మాట్లాడుతున్నప్పుడు

వెనుక మొక్కలు అలికిడి కావడమూ, తర్వాత రాజా వేగంగా అవుట్ హౌస్‌లోకి ఉరికి తలుపు వేసుకోవడమూ....

"వింటున్నావా, కమలాకర్? అలా నేను వాళ్ళ ఆలోచనలన్నీ తెలుసుకున్నాను. మైగాడ్, ఎలాటి ఆలోచనలవి! నమ్ముతావా? దే ప్లాన్డ్ టు కిల్ మీ! నన్ను చంపి నా యావదాస్తినీ కబళించాలని చూశారు. నేను విల్లు రాయలేదని దానికి తెలుసు. ఈ లోగానే నన్నంతం చేస్తే ప్రయోజనముంటుందనుకున్నారు.

"కానీ ఆ పని ఎలా చేయాలో వాళ్ళకంతుపట్టలేదు. చాలాకాలం వరకు ఓ నిర్ణయానికి రాలేకపోయారు. ప్రతి నిర్ణయంలోనూ వాళ్ళకేదో అపాయమే కన్పిస్తోంది. అలా చూసి చూసి చివరికి నేనే ఇన్‌స్పిరేషన్ ఇవ్వాలనుకున్నాను వాళ్ళ ప్లానుకి. అప్పుడేం చేశాననుకున్నావు?"

"ఏం చేశారు, మిస్టర్ రావ్?"

"అలా రెచ్చిపోకు. నిదానించు. వాళ్ళకు ఇన్‌స్పిరేషన్ ఇవ్వడం ఒక్కటే కాదు, దాన్ని తగు విధంగా నా ప్రయోజనంకోసం ఉపయోగించుకోవాలని కూడా తలపోశాను. అంటే వాళ్ళు దాన్ని అమలుపరచిన క్షణంలోనే బెడిసికొట్టి, వాళ్ళమీదికే ఎదురుతిరిగి అంతమొందించాలి. నేను క్షేమంగా బైటపడాలి. అర్థమైందా? వాళ్ళది ఎత్తు అయితే నాది పైయెత్తు. అప్పుడు వెంటనే యాక్షన్ మొదలైంది—ఇంటిమీదికి దొంగ దాడి ప్రారంభించాడు. శివకుమార్ అలా ముసుగులో రాసాగాడు.

"ఆ నగలకోసం నిజంగానే దొంగ ప్రయత్నిస్తు

న్నాడని నమ్మింది లీల. అప్పుడు వెంటనే పోలీసు రిపో ర్టివ్వమంది. కానీ నా ఆలోచన అది కాదుగా? నేను మీ డిటెక్టివ్ ఆఫీసుకొచ్చాను. నాకో ఇద్దరు మనుషులు అవసరం నా అయిడియా ప్రకారం. మీ బాస్‌ని సంప్ర దించి ఏర్పాటు చేసుకున్నాను. నేనా నాల్గురోజులూ బొంబాయిలో వుంటానని బుకాయించాను. ఇక్కడే గండిపేట దగ్గర కాటేజీ తీసుకొని అందులో వున్నాను. మీ బాస్ నియమించే మనుషులెవరో తెలుసుకోవాలను కున్నాను. అప్పుడు మీ బాస్ చూపించిన ఫోటోల్లో నువ్వు నాకు నచ్చావు....

"కమలాకర్, నీమీద నాకు ఆశకల్గింది. అందగాడివి, నీ ముఖంలో ఆకర్షణ వుంది. పైగా డిటెక్టివ్ తెలివి తేటలున్నాయి. లీల నన్ను చంపాలనుకొంటోంటే, యెలాగైనా నీ ఆకర్షణకు లొంగిపోయి, డిటెక్టివ్‌గా నీ తెలివితేటల్ని ఉపయోగించుకునే అవకాశాన్ని వదులుకో దన్నది నా అంచనా. అదే నేను వాళ్ళకి కల్గించ దల్చుకున్న ఇన్‌స్పిరేషన్. అది తప్పలేదు సరికదా నన్నాశ్చర్యంల్లో ముంచెత్తింది కమలాకర్! నువ్వూ లీల పాత ప్రేమికులని నాకేం తెలుసు! మై గాడ్! ఆ లీల యెంతమందిని....

"మీ హిస్టరీ విని అదిరిపోయాను! శివకుమార్ రోజూ టేప్స్ తెచ్చి విన్పిస్తున్నాడు కాటేజీలో .... ఆమె మోసంచేసిందన్న కసితో వున్న నీవు ఆమెనెక్కడ చంపేస్తావోనని భయపడ్డాను. కానీ నేను చెప్పలేదూ— అది సరిగ్గా నేననుకున్నట్టుగానే నిన్ను లొంగదీసుకుంది! దాంతో నీ పగా ద్వేషమూ అన్నీ చుట్టి అవతలపారేసి ఆమెని విడిచి క్షణం ఉండలేని స్థితికొచ్చేశావు...."

నవ్వాడతను పకపకా. "వెల్ మై బాయ్, నువ్వు మోసపోయావు. మళ్ళీ మోసపోయావు. అది నిజంగా నిన్ను ప్రేమించిందనుకున్నావా? నీతో వచ్చేస్తుందనుకున్నావా కులుకుతూ? అదేంకాదు. దాని నిజస్వరూపం నువ్వు తెలుసుకోలేదు. అది నిన్ను పావుగా ఉపయోగించుకోవాలనుకుంది తన పథకంతో. లవర్ తో కలిసి అంతా సిద్ధం చేసుకుంది....వింటున్నావా?

"ప్రతి రాత్రి నిన్ను తోటలో కలుసుకునేది నాకు నిద్రమందిచ్చి—అది నేను నిశ్చింతగా తాగేసి పడుకునేవాణ్ని. అంతా రాజు చూసుకునేవాడు. తోటలో మీ మాటలన్నీ వినేవాడు మొక్కలచాటున కూర్చుని టేప్ రికార్డర్ తో. దానిమీద నీకు పిచ్చి బాగా ముదిరి నీతో వచ్చేయమని బలవంతం చేస్తోంటే, దానికి నీమీద మంచి గ్రిప్ దొరికింది. ఏమీ లేని నీతో యెక్కడికీ రాలేనని నిరాకరిస్తూ, యెలాగైతే నేం చివరికి నీ పౌరుషాన్ని రెచ్చగొట్టింది యెంతో తెలివిగా....అనుమానం కలక్కుండా.

"లీలను నమ్మావు. ఈ దొంగతనానికి పూనుకున్నావు. ఫూల్ ప్రూఫ్ అయిడియా. నీమీదెవరికీ అనుమానం కలగదు. యెలిబీ కూడా సృష్టించుకున్నావు. అచ్చం నేను సిద్ధంచేసిన దొంగ గెటప్ లోనే వచ్చావు. దిలీప్ ని పడగొట్టావు. ఇక పైకివెళ్ళి సొమ్ము మూటగట్టుకోవడమే తరువాయి అనుకున్నావు....కానీ అంతా తారుమారైంది కదూ?"

అతను కోపంగా చూశాడు నా వైపు. "నీకు తెలుసా ఫూల్, నువ్వెలాటి ట్రాప్ లోకి అడుగు బెట్టబోయావో? వాళ్ళ ప్లానేమిటో తెలుసా నీకు? విను! నువ్విలా దొంగతనానికొచ్చినప్పుడు, సేఫ్ తెరచి సొమ్ముతీస్తున్న సమ

యంలో, లీల నన్ను లేపి పంపాలనుకుంది దొంగవచ్చినట్లు చెబుతూ. అప్పుడు ఉద్రేకంతో నేను నువ్వున్న గదిలోకి వచ్చి రావడంతో నే—కమలాకర్—ఆ బాల్కనీలో కిటికీ అవతల సిద్ధంగా కాచుకునున్న దాని లవర్ నీ రివాల్వర్‌తో నన్ను లేపేసి, వేలిముద్రలు శుభ్రంగా తుడిచి దాన్ని గదిలోకి విసిరేసి పారిపోవాలనుకున్నాడు.

"ఆ షాట్ విని లీల కేకలువేస్తూ పరుగెత్తుకొచ్చి, అక్కడ దృశ్యాన్ని చూసి, చాకచక్యంగా తలుపులు మూసి కిందికి వెళ్ళి ఫోన్ చేయాలనుకుంది పోలీసులకి. నువ్వు దొంగవు! హంతకుడివి! నీకున్న ఈ మంచి అవకాశాన్నుపయోగించుకుని ఆ నగలు దోచుకుంటూండగా, మధ్యలో నేను రావడంతో రివాల్వర్‌తో కాల్చి చంపేశావని చెప్పాలనుకుంది పోలీసులకి.

"ఆ రివాల్వర్ నీ దగ్గర మీరిద్దరు తోటలో కలుసుకున్నప్పుడు తస్కరించి, తన లవర్ కోసం కిటికీ షేడ్ మీద వుంచింది. గదిలో అది పోలీసులకు దొరుకుతుంది. దానిమీద సహజంగానే నీ వ్రేలిముద్రలుండవు. గ్లవ్స్ తొడుక్కున్న కారణంగా అని భావిస్తారు. నువ్వేమంటావప్పుడు? ఏం చేస్తావు? మీరిద్దరూ ప్రేమికులనీ, ఆమే ఆ పనికి పురిగొల్పిందనీ నన్ను చంపింది నువ్వుకాదనీ ఋజువు చేసుకోగలవా? ఏ ఆధారాలతో? అంతా ఆమె మాటనే నమ్ముతారు. సమాజ దృష్టిలో మీ స్థితిగతుల తారతమ్యం ఆమె వాదననే బలపరుస్తుంది!"

"ఆమె అలా చేస్తుందంటే నమ్మను!" అన్నాను ఆవేశంగా.

"అలాగే చేయాలనుకుంది, మై బాయ్. నిన్నలా జైలుకి పంపి నా యావదాస్తినీ తన లవర్‌తో స్వేచ్ఛగా

అనుభవించాలనుకుంది. లేకపోతే నువ్వనుకుంటున్నట్లు ఆ అయిదులక్షల సొమ్ముతో నీతో పారిపోయి దొంగబ్రతుకు బ్రతుకుతుందనుకున్నావా? ఆడవాళ్ళని నువ్వు సరిగ్గా అధ్యయనం చేయలేదు. ఆ డబ్బుతో వ్యాపారం చేసి నువ్వు గడిస్తావో గోవిందా చేస్తావో ఎలా తెలుసు? ఆమెకు ఆ లవర్ వున్నట్లు నీకు తెలిస్తే పరిస్థితి వేరుగా వుండేది. నా అదృష్టంకొద్దీ నీకది తెలియలేదు!

"నా అదృష్టంకొద్దీ ఇప్పుడంతా సవ్యంగా జరిగిపోయింది .... వాళ్ళు నన్నెలా చంపాలనుకున్నారో చెప్పాను. నేను వాళ్ళనెలా చంపానో చూశావు. దొంగొచ్చాడని లీల దాని అయిడియా ప్రకారం నన్ను లేపి పంపినప్పుడు, నేను వస్తూ రహస్యంగా కెమెరా తెచ్చుకున్నాను నా అయిడియా ప్రకారం. నిన్నాశ్చర్య పరచి ఫోటో తీశాను. కిటికీ అవతల ఆ బాసటుడని గమనించాను. కానీ చూడనట్లు నటించాను. సరిగ్గా ట్రిగ్గర్ లాగే క్షణంలోనే తప్పుకుని, వాడు రివాల్వర్ పడేసేలా చేయాలనుకున్నాను. ఇంతలో నువ్వే ప్రాణాలకు తెగించి నా మీదకు దూకావు! నన్నా షాట్ నుంచి తప్పించావు.

"వాడు కన్ఫ్యూజ్ అయి, షూట్ చేశాక రివాల్వర్ లోపలకు విసిరి పారిపోయాడు. కానీ సరిగ్గా వాడి నెత్తి మీద—ఆ కిటికీ షేడ్ మీద ఇనుపరాడ్‌తో సిద్ధంగా వున్న కుమార్ వాడి తల బద్దలుచేశాడు. వాడు పడిపోగానే కిందకొచ్చి, బాల్కనీలోంచి లేపి వాణ్ని తోటలోకి ఎత్తేశాడు—

"ఇటు నేను కేకలు వేస్తూ వచ్చిన లీలను షూట్ చేశాను. అది నాటు రివాల్వర్. దాన్నొకచోట రహస్యంగా కొని తెచ్చాను. అదిప్పుడు ఆ లవర్ శవం దగ్గర

పడివుంది...దట్సాల్ కమలాకర్. లీల నన్ను నీ చేతులతో స్వయంగా చంపిస్తుందనుకున్నాను గానీ, ఇలా పరోక్షంగా వాడుకుని నిన్ను డబుల్ క్రాస్ చేస్తుందనుకోలేదు. వాళ్ళ ప్లానుకనుగుణంగా నా ప్లాను రూపొందించుకున్నాను. విజయం సాధించాను. ఏమంటావు?"

నేనేం అనలేదు. శివకుమార్ పరుగెత్తుకొచ్చాడు ఇట్లోంచి—"సర్, అంతా రెడీ!" అంటూ

"పోలీసులొస్తున్నారా?" అడిగాడు రావ్.

"వచ్చేస్తున్నారు, సర్!"

"ఆ బాల్కనీలో రక్తముందేమో చూశావా?"

"తుడిచేశాను, సర్, ఆమె శవం కూడా సేఫ్ గదిలో చేర్చాను."

"గుడ్!" రావ్ నా వైపు తిరిగాడు, "కమలాకర్, ఇప్పుడు పోలీసులొచ్చేస్తారు. నా దగ్గర కథ సిద్ధంగా వుంది వాళ్ళకోసం. ఆ నరేష్ లీల లవర్ కాదు. గోజూ వచ్చే దొంగవాడే! ఇవాళ గట్టి బందోబస్తుతో వచ్చాడు. మీ మనిషి—ఈ దలీప్‌ని అవుటాఫ్ యాక్షన్‌లో పెట్టి, పైకి వెళ్ళి సొమ్ము దోచుకోబోయాడు.

"కానీ అలికిడి విని నేనూ లీలా లేచిరావడంతో మా మీదికి రెండుసార్లు కాల్చి పారిపోయాడు. ఆ ప్రకారం ఆ రివాల్వర్‌లో రెండు గుళ్ళు తక్కువున్నాయి. ఆ కాల్పుల్లో లీల చచ్చిపోయింది. ఇప్పుడామె శవం ఆ గదిలోనే వుంది. నేను తప్పించుకున్నాను. కానీ దొంగ కిటికీలోంచి పారిపోతూ, ముసుగు వున్నందువల్ల సరిగా కనిపించక బాల్కనీలోంచి తలక్రిందులుగా పడ్డాడు నేలమీద—అంతే—అక్కడే తలపగిలి చచ్చిపోయాడు.

"గదిలో నీ బ్యాగూ పనిముట్లూ వున్నాయి. అవన్నీ

ఆ దొంగవే అనుకొంటారు. వాటిమీదా సేఫ్‌మీదా యెక్కడా వేలిముద్రలుండవు. నీ గ్లవ్స్ వాడికి తొడిగించాం కాబట్టి వాటి ప్రశ్నే వుండదు. క్లీన్ జాబ్. దొంగతనానికొచ్చి హత్యచేసి ఖతం అయ్యాడు. పూర్ ఫెలో. దట్సాల్, చాలా సింపుల్, ఇదంతా మన ముగ్గురికే తెలుసు. రాజుని వాడి పెళ్ళాంతో కావాలని ఊరికి పంపేశాను. రాజుకంతా తెలుసు కానీ, వాడి పెళ్ళానికి తెలియనివ్వలేదు. ఇలాటి విషయాల్లో ఆడవాళ్ళని నమ్మను. అందుకే ఈ రాత్రి ఆమెతో ఇక్కడ వుండొద్దన్నాను—"

శివకుమార్ చటుక్కున నా జేబులోకి రివాల్వర్ తోశాడు. "సారీ, మీ రివాల్వర్‌లోగుళ్ళు తీసేసాను" అతన్నాడతను.

నేను అయోమయంగా చూశాను.

రావ్ అన్నాడు. "నువ్వేం భయపడకు, కమలాకర్. నీకేంకాదు. నేను చెప్పినట్లు వింటే క్షేమంగా వుంటావు. నువ్వు చేయవల్సిందల్లా ఇప్పుడు సింపుల్‌గా ఇక్కడ్నుంచి చెక్కెయ్యడమే! మళ్ళీ ఈ ఛాయలకిగానీ, నన్ను చూట్టానికిగానీ రాకు. నీకు తెలిసినవన్నీ—నువ్వు చూసిందంతా ఇక్కడే మర్చిపో! నేను లీలను చంపానన్న కసి నీకుండొచ్చు. నామీద పగతీర్చుకునే ప్రయత్నం మాత్రం చెయ్యకు! నువ్వు పోలీసుల దగ్గర నా గురించి కీర్తనలు పాడాలనుకుంటే, ముందు నేను తీసిన ఫోటోని స్మరించుకో!

"ఒకవేళ నన్ను నువ్వు చంపేస్తే ఆ ఫోటో పోలీసులకి చేరుతుంది, ఒక చిన్న ఉత్తరంతో. ఇప్పుడు జరిగిన సంఘటన తర్వాత కొన్నాళ్ళకి తెగించి నువ్వా

ప్రయత్నం చేసినట్టూ, అది ముందే పసిగట్టి నేనా ఫోటో తీసినట్టూ, దాంతో నిన్ను బ్లాక్ మెయిల్ చేస్తూ కొన్ని పనులకు వాడుకున్నట్టూ, అది నువ్వు సహించలేక నన్ను చంపేసినట్టూ ఆ ఉత్తరంలో వుంటుంది, జాగ్రత్త!

"అందుకని నాకు నువ్వు దూరంగా వుండు, క్షేమంగా వుంటావు! నీకు ప్రాణాలంటే నా గురించి ఆలోచించకు, మర్చిపో! అర్థమవుతోందా? నేను డైనమైట్ ని, నాకు దూరంగా వెళ్ళిపో! అదుగో, అదుగో పోలీసులొచ్చేశారు! త్వరగా మరి! ఇక పిచ్చి ఆలోచనలు చెయ్యకు, క్విక్, పారిపో-ప్రాణాలంటే పారిపో!"

బయట హారన్ లు మోగాయి. శివకుమార్ గేటుకేసి పరుగుతీశాడు. రావ్ విసురుగా లేచి నా రెక్క పుచ్చుకు లాగాడు. "అటు—ఆ గోడ దూకి పారిపో!"

నేను పరుగులంకించుకున్నా నక్కడ్నుంచి. నేను ప్రహారీగోడ చేరుకోగానే, పోలీసు వాహనాలు లోపల కొచ్చేశాయి. ఠటాలున గోడ దూకేసి నిలబడ్డాను అవతల గజగజ వణుకుతూ.

పోలీసులు వాహనాలు దిగి పోర్టికోలో ఉరికారు వేగంగా. రావ్, శివకుమార్ లు పెద్ద గొంతుకలతో వివరిస్తున్నారు. చేతులు వూపుతూ ఏదేదో చెప్పేస్తున్నారు.... పోలీసులు ఉద్రేకంగా వింటున్నారు....

నా వొళ్ళంతా తడిసిపోయింది చెమటతో—

ఓ మై గాడ్! వీళ్ళెలాంటి హంతకులు!

వెనక్కి తిరిగి ఆగకుండా పరుగెత్తసాగాను అక్కడ్నుంచి దూరంగా—ఆ రాక్షసత్వం నర్తించిన స్థలానికి సుదూరంగా—శాశ్వతంగా.

—:ఐ పో యిం ది:—

# మాయా లోకంలో మానవ కాంత

## సికిందర్

ఆ హోటల్ ఓ మూల కూర్చుని టిఫిన్ పూర్తిచేసి టీ తాగుతూ, భవిష్యత్తు ఆలోచిస్తున్నాడు వినోద్. భవిష్యత్తు ఆలోచించడం అతనికేమీ సరదా కాదు గానీ, జేబులు ఖాళీ అయినప్పుడు అర్జంటుగా ఆలోచిస్తూంటాడు.

మొన్న రామ్‌జీ కిరాణాకొట్లో గల్లంతుచేసిన రెం డొందలూ నిన్న రాత్రికి అయిపోయాయి. చుక్కల్ని చూపినందుకుగాను తారకు వందిచ్చాడు. యాభై పేకకు పోగా, బ్రోకరు ముప్పై పట్టుకెళ్లాడు. ఇక మిగిలిన ఇరవైలో పదిహేనూ తెల్లారి లేస్తూనే శనిలా తగిలి కొట్టుకు పోయాడు ఇంటి యజమాని, గది అద్దె బకాయికింద.

చివరికి మిగిలిన అయిదు రూపాయలతోనూ వినోద్ ఊరుమీద పడ్డాడు. ఇప్పుడు సాయంత్రానికల్లా అతని జేబులో వున్నది రూపాయి. ప్రస్తుతం భారీగా ముగించిన టిఫిన్ బిల్లులో అది నాల్గోవంతు మాత్రమే. అయినా

అతడికేమీ దిగులుగా లేదు. ఇదో సమస్యకాదు. రేపెలా గడు స్తుందన్నదే చింత! చెయ్యాలి. ఏదో ఒకటి చేయాలి.

ఈ రాత్రికి ఏదో ఒకటి చెయ్యకపోతే లాభంలేదు. ఇలా యాభైలూ వందలూ కాదు, కనీసం నెలరోజులు సుఖంగా గడిచిపోవాలంటే పెద్ద దెబ్బే కొట్టాలి. చాలా పెద్ద దెబ్బ!

వెంటనే అతనికి వెంకట్ గుర్తొచ్చాడు.

వెంకట్ అతని అసిస్టెంటుగా వుంటున్నాడు కొంత కాలంగా. కానీ ఈ మధ్య మరీ చిన్న చిన్న పనులతో అతని అవసరం లేకపోయింది. ఇప్పుడు పెద్ద దెబ్బ కొట్టాలి గనుక అతని సహాయం చాలా అవసరం. చేయ వల్సిన పనిని ఆలోచించుకుని వినోద్ టీ తాగడం పూర్తి చేశాడు.

వినోద్‌కు 30 ఏళ్ళుంటాయి. పేరులా అందంగా, ఆరోగ్యంగా, శుభ్రంగా ఏమీ వుండడు. బాగా మాసిపోయిన బట్టల్లో దుమ్ము పట్టిన జుట్టుతో, ఎర్రబారిన కళ్ళతో, బాగా మురికిపట్టిన వంటితో చూస్తే ఎంతో సోమరి అనుకుంటారు. కానీ అదేమీ కాదు. అతడెంత చురుకు ఘటమో అడపాదడపా అతను చేసే జైలు యాత్రల్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

నాలుగు రూపాయల నలభై పైసల బిల్లుని చేతిలోకి తీసుకొని సిగరెట్ వెల్గించుకున్నాడు వినోద్.

అతని కెదురుగా ఓ ఆసామీ కూర్చుని టీ సేవిస్తున్నాడు. వినోద్ అతని హావభావాల్ని గమనించాడు. ఈ లోకంలో లేడు. ఏవేవో లెక్కలు వేసుకొంటూ మరో లోకంలో వున్నాడు. వినోద్‌కు అతని ముందు వెయిటర్ తెచ్చిపెట్టిన బిల్లు ఆకర్షించింది. అది టీ బిల్లు.

వినోద్ తేలిగ్గా నిట్టూర్చి, తన టిఫిన్ బిల్లును అగ్గిపెట్టెలో భద్రపర్చుకొని, ఇంకా ఈ లోకంలోకి రాని ఆసామిగారి టీ బిల్లుని అతి లాఘవంగా సేకరించి, అక్కడనుంచి సెలవుతీసుకున్నాడు.

కౌంటర్ లో ఆసామికి బిల్లు అర్ధరూపాయి చెల్లించి, కృతజ్ఞతాపూర్వకమైన యజమానిగారి చిరునవ్వును మొహమాటంగా స్వీకరించి మిగిలిన అర్ధరూపాయతో బయట అహ్లాదకరమైన వాతావరణంలో అడుగు పెట్టాడు వినోద్.

సాయంత్రం అయిదయిదంటే ఆబిడ్స్‌లో అంతా జామ్‌జామ్. రోడ్డుమీద వన్ వే వుందిగానీ పేవ్ మెంట్లకి లేదు. ముందునుంచీ వెనుకనుంచీ పక్కలనుంచీ రకరకాల స్పర్శలు. రకరకాల అనుభూతులు, మితిమీరితే బూతులు.

వినోద్ చివరిది రాకుండా మిగతా రెండూ చవిచూసి, జి.పి.ఓ.లోకి అడుగుపెట్టి ఫోన్ దగ్గరకు చేరుకున్నాడు. ఆ అర్ధరూపాయి ఖర్చుచేసి వెంకట్‌కు ఫోన్ చేశాడు. అది వృధాకాలేదు, వెంకట్ దొరికాడు.

వెంకట్ ప్రస్తుతం ఓ పాత ఇనుమును కొని అమ్మే కంట్రాక్టర్ దగ్గర పనిచేస్తున్నాడు. ఆ కంట్రాక్టర్ ఇనుముని అక్కడా ఇక్కడా అర్ధరాత్రులు సంచరిస్తూ ఉచిత రీతిని సేకరిస్తాడని చాలా పెద్ద అప్రతిష్ట వుంది.

వెంకట్ లైనులోకొచ్చి అరిచాడు. "హలో బాస్, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు!"

వినోద్ నవ్వాడు హాయిగా. "వెంకట్ నీతో అవసరం వచ్చింది."

"చెప్పు బాస్, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు!"

"రాత్రి బీటు కెళ్దాం, దెబ్బ కొట్టాలి."

"బీటుకా? అలాగే బాస్, ఎక్కడికి?"

"చెప్తాను. నువ్విప్పుడు రాగలవా? అయితే వెంటనే కోఠి పార్కు కొచ్చేయి, అరగంటలో. అక్కడుంటాను. వివరంగా మాట్లాడుకుందాం."

"అలాగే బాస్, వచ్చేస్తున్నాను .... ఎన్నాళ్ళకెన్నాళ్ళకు!"

వినోద్ నవ్వుకుంటూ ఫోన్ పెట్టేశాడు.

అక్కడ్నుంచి నడుచుకుంటూ కోఠి పార్కు చేరుకున్నాడు పావు గంటలో. అదెప్పటిలాగే దర్శనమిచ్చింది. యాచకులూ, సోమరులూ విశ్రాంతి తీసుకుంటూ హైదరాబాదులో చాలా పార్కులు ఇలాగే దర్శనమిస్తాయి.

వినోద్ గేటుకెదురుగా ఓ బెంచిమీద కూర్చుని వెంకట్ కోసం చూడసాగాడు.

వెంకట్ వస్తూ వినోద్‌ని చూసి పరుగెత్తుకొని వచ్చి కావలించుకున్నాడు.

"బాస్! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు!"

వెంకట్‌కు పాతికేళ్ళుంటాయి. శుభ్రత విషయంలో వినోద్‌కేమీ తీసిపోడు. కంట్రాక్టర్ దగ్గర ....ఇనుము సేకరించే ఉద్యోగంతో పాటు, తీరిక వేళల్లో జేబులు కత్తిరించే సద్యోగం కూడా వుంది. జైల్లో విశ్రాంతిగా గడిపిన రోజులూ వున్నాయి. అతను కోడిలా చూస్తాడు. ఫెళ్ళున నవ్వుతాడు.

వినోద్ అతన్ని వదిలించుకుని, ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు.

"ఫ్రూల్, ఎలావుంది బిజినెస్?"

"బాగానే వుంది, బాస్. నీదెలా వుంది?"

"రాత్రికి బీటు కళ్దామనుకుంటున్నాను. పెద్ద దెబ్బ కొట్టాలి."

"బాస్, నువ్వు రోజూ గడ్డం గీసుకోవాలి. నీటుగా వుండాలి."

"మీ కంట్రాక్టర్ బండి వేసుకొస్తావా రాత్రికి?"

"ఎక్కడికి, బాస్? ఏమిటి దెబ్బ?"

"హోలవ్, వెంకట్. దారికాచి దెబ్బకొట్టాలి, విజయవాడ రోడ్డుమీద రాత్రి తొమ్మిది గంటలకి. హాయత్ నగర్ దాటి వెళ్తాం, ఎవరూ వుండరు. బస్సులూ లారీలూ వద్దు. అంతమందిని కవర్ చేయలేం. కార్లూ స్కూటర్లయితే సులభం. మూడు నాలుగైనా కొట్టలేమా?"

"వందలేనా?"

"వేలు, యూ ఫూల్!"

"ఓహ్ బాస్, నెమ్మది! ఎవరైనా వింటారు.... కొటగలం."

"అయితే బండేసుకొస్తావా, తొమ్మిది గంటలకి?"

"అలాగే బాస్. కానీ వచ్చిందాంట్లో ఫిఫ్టీ ఫిఫ్టీ—"

హఠాత్తుగా వెనుక ముక్కలు ఫెళ ఫెళమన్నాయి. గబుక్కున తిరిగిచూశారిద్దరూ. ఒక మనిషి వేగంగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోతున్నాడు. చూస్తోండగానే జనంలో కలిసి మాయమయ్యాడు. అతదెవరో సరిగ్గా చూడలేకపోయారిద్దరూ.

## 2

రాత్రి ఎనిమిదిన్నరకు వెంకట్ మోటార్ సైకిల్ వేసుకొచ్చాడు. దానిమీద వాళ్ళిద్దరూ ప్రయాణమయ్యారు. తొమ్మిది కావస్తోండగా విజయవాడ రోడ్డు

మీద హాయత్ నగర్ దాటేసి వచ్చేశారు.

అక్కడ నిర్మానుష్యంగా, చీకటిగా వున్నచోట దిగి ఇరువైపులా చూశారు. సిటీనుంచి రెండు లారీలు వస్తూ కన్పించాయి.

వాళ్లు సిగరెట్లు తీసి వెలిగించుకొని, గబగబా పది దమ్ములులాగి పూర్తిచేసి పారేశారు. అప్పుడు బైక్ని రోడ్డుదింపి, అడ్డంగా పడుకోబెట్టి, దాని పక్కన తాము కూర్చున్నారు. జేబులోంచి కర్చీఫ్ తీసి ముక్కుపైగా కళ్ళకిందనుంచి కట్టుకున్నారు. స్ప్రింగ్ నైఫ్లు తీసి చేతబట్టుకున్నారు. ఆ తర్వాత రోడ్డుకిరువైపులా పొంచి చూడసాగారు.

మరో లారీ, దానివెంట ఒక బస్సూ సిటీవైపు సాగి పోయాయి. రెండు లారీలు ఇటువైపు వెళ్ళాయి. వాటిని ఉదాసీనంగా చూస్తూ వుండిపోయారు వాళ్ళు. మరో పదినిమిషాలవరకూ చాలా లారీలూ బస్సులూ అటూ ఇటూ వెళ్ళాయిగానీ, తమకు కావల్సిన వాహనం ఒక్కటీ లేదు. వాళ్ళు అసహనంగా కాచుకున్నారు.

మరో రెండు నిమిషాలు గడిచాయి. అప్పుడు కన్పించాయి దూరంగా-రెండు హెడ్లైట్స్, సిటీనించి వస్తూ.

వాటి తీక్షణతనిబట్టి అవి సమీపిస్తోన్న వేగాన్నిబట్టి అది తమకు కావల్సిన వాహనంగా పసిగట్టారు. గబుక్కున లేచి రోడ్డుమీదకు దూకారు.

అలా శరవేగంతో వస్తోన్న కారు అకస్మాత్తుగా రోడ్డుమీద అడ్డంకిని చూసి సడెన్ బ్రేకుతో ఆగిపోయింది, వాళ్ళకి కేవలం రెండుగజాల దూరంలో.

వాళ్ళిద్దరు అటూ అటూ చూసి ఎవరూ రావడం

లేదని గమనించి కారు చెరోవైపు దూకారు. కత్తులు లోపల ప్రయాణీకుల కంఠాలకి ఆనించారు.

"లైట్లార్పేయండి, క్విక్!" అర్చాడు వినోద్.

చటుక్కున లైట్లారిపోయాయి. అంధాకార మేర్ప డింది. ఎవరి ముఖాలు ఎవరికి కన్పించడం లేదు.

"సొమ్ము తీయ్, చిడియా!" వెంకట్ తనవైపువాడిని బెదిరించాడు.

"ఎ—ఎవరు మీరు?"

వినోద్ కార్లోకి చూశాడు. ముందు సీట్లో యిద్దరు తప్ప యెవరూ లేరు.

"కమాన్, ఆలస్యం చెయ్యకండి! సొమ్ము తీయ్!" వెంకట్ అరిచాడు మళ్ళీ కత్తిని గట్టిగా అదుముతూ.

"సొ.... సొమ్మా! ఏం సొమ్ము?"

"మనీ, డబ్బు, పైసాలావ్ జల్దీ!"

"పైసా లేదు హమారే దగ్గర!"

"కైసా లేదు, తీయ్ త్వరగా!"

వినోద్ తనవైపు డ్రైవర్ సీట్లో వాడిని హెచ్చ రించాడు. "మిస్టర్, మీ దగ్గరున్నది యిచ్చేయండి. లేదా పొడిచి పారిపోతాం!"

ఆ మనుషులిద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు భయంగా. వెంకట్ కత్తిని ఇంకా గట్టిగా అదిమిపట్టాడు. కేకవేశాడు అవతలివాడు.

ఇవతలివాడు వెంటనే వారించాడు. "ఆగండి, ఇచ్చేస్తాం....తమ్ముడూ, ఆ బ్యాగువాళ్ళకిచ్చేయ్! వీళ్ళు పొడిచేసేలా వున్నారు నిజంగా...."

"నన్నెందుకు పొడుస్తావు పెద్దమనిషీ! ఇదుగో సొమ్ము!" అవతలివాడు వెంకట్ చేతికి బ్యాగు అం

దించాడు.

ఇవతలివాడు వినోద్ వైపు తిరిగాడు. "ఇక చాలా..? మమ్మల్ని వదిలేస్తారా? అయితే కత్తిని తీసేయ్.... సిగరెట్ ముట్టించుకోవాలి...."

వెంకట్ బ్యాగు తెరిచి లోపల చూస్తున్నాడు.

వినోద్ చెయ్యి వెనక్కి తీసుకున్నాడు. ఆ మనిషి జేబులో చెయ్యిపెట్టి సిగరెట్టు లైటర్ తీశాడు. సిగరెట్ లైటర్ వెల్గించాడు. ఒక్కరవ్వతో వత్తి అంటుకుంది.

అవతలనించి వెంకట్ అరిచాడు. "బాస్, బ్యాగు నిండా సొమ్ముంది!"

"గుడ్, ఇక నెంబర్ నోట్ చేసుకో!"

వెంకట్ జేబులోంచి నోట్ బుక్ తీసి ముందుకొచ్చి నెంబర్ రాసుకున్నాడు.

"ఓ.కే. మీరిక వెళ్ళిపోండి!" అన్నాడు వినోద్ కారులోకి చూస్తూ, "ఇదెవరికీ చెప్పకండి! పోలీసు రిపోర్టిచ్చినట్లు మాకు తెలిసిందా, మీ అడ్రసుకొచ్చి పొట్ట చీల్చేస్తాం! మీ కారు నెంబర్ మా దగ్గరుంది, అర్థమైందా? చెక్కేయండి—"

కారు స్టార్టయి శరవేగంతో దూసుకుపోయింది.

## 3

వాళ్ళిద్దరు ఆ రాత్రి సైదాబాద్‌లోని వినోద్ అద్దె గదిలో వేడుక చేసుకొంటున్నారు.

ఆ ఇల్లు మురికివాడలమధ్య వుంది. చాలా పాత కట్టడం. కింద యజమాని వుంటున్నాడు. పైనున్న ఒక్క గదినీ వినోద్ ఆక్రమించుకున్నాడు.

గది కప్పూ, గోడలూ పెచ్చులూడి, రంధ్రాలుపడి, అసహ్యమైన మరకలతో, భరించలేని దుర్గంధంతోనూ

పరమ చంఢాలంగా వుంటుంది. అయినా వాళ్ళకేమీ పట్టదు. కింద చాపవేసుకుని గోడకు జారగిలబడి బాటిల్స్ ఒకటే లాగించేస్తున్నారు. సత్తుప్లేట్లలోని చేపముక్కలు నమిలిపారేస్తున్నారు, మరోవైపు డొక్కు ట్రాన్సిస్టరులోంచి వచ్చే పాటల్ని ఆనందిస్తూ.

ఆ రెండు రోజులూ వాళ్ళకు లోకమే తెలియలేదు. ఆ బ్యాగులో మూడువేల పైచిలుకు కళ్ళజూడడంతో మతులుపోయాయి. వాళ్ళ జీవితంలో అంత పెద్ద మొత్తం అదే మొదటిసారి. దాంతో వినోద్ కు భవిష్యత్తుమీద ఆలోచనలు పోలేదు. ఉన్నప్పుడు అనుభవించు లేనప్పుడు చూద్దాం.

ఆ డబ్బుని మంచినీళ్ళలా అవగొడుతూ, మానసిక చాపల్యాలు తీర్చుకుంటున్నారేతప్ప, పదిమందిలో మంచి ఇంప్రెషన్ని కల్గించే కనీసపు భౌతిక స్వరూపాన్ని సంస్కరించుకోవాలనే ఆలోచనేలేదు వాళ్ళకి. తిని తాగుతూ తైతెక్కలాడుతున్నారు ఎడతెరిపిలేకుండా.

"బాస్! ఎంత ఖుషీ, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు! ఇంత మజా ఎప్పుడైనా చేశావా!" వెంకట్ అరిచాడు మత్తులో వూగిపోతూ.

వినోద్ నిషా కళ్ళు గోడనున్న కల్పనా అయ్యర్ పటంమీదున్నాయి—కైపుగా, కసిగా "లేదు, వెంకట్! ఇంత మజా ఎప్పుడూలేదు! ఈ రాత్రికి ఏ చుక్కయితే బాగుంటుంది?"

"తారవద్దా, బాస్?"

"రోత! మోహిని ఎలా వుంటుంది?"

"ఓహ్ చెప్పకు బాస్! నాకు తిమ్మిరెక్కుతోంది!"

"ఫూల్, అది నా కోసమన్నాను!"

"ఓ.కె. సారీ, బాస్....కానీ ఆమె చాలా బిజీ! అయినా ప్రయత్నిద్దాం....!"

వెంకట్ మాటలు పూర్తి చెయ్యకుండా తలుపు చప్పుడైంది.

ఇద్దరూ అదిరిపడ్డారు. సగం నిషా వదిలింది. వెంటనే సీసాలూ ప్లేట్లూ ఓ మూలకి తోసి, దానిపైన దుప్పటి కప్పేశారు. శనిగాడు! శకునపక్షి! కనిపెట్టేసినట్లున్నాడు కంత్రీ! ఇప్పుడెలా ఎదుర్కోవడం వీడ్ని! వినోద్ తిట్లతో సాగాడు ఇంటతన్ని.

"బాబూ, తలుపు తియ్యండి!" రెండు గొంతులు ఒకేసారి అరిచాయి.

ఇద్దరూ ముఖాలు చూసుకున్నారు.

"యెవరు మీరు?" వినోద్ రెట్టించాడు తేరుకుంటూ.

"బాస్, పోలీసులయి వుంటారు...." వెంకట్ గుసగుసలాడాడు.

వినోద్ అడ్డంగా తలూపాడు. పోలీసులైతే ఇంత మర్యాదగా పిలువరు. లాఠీలతో తలుపుమీద కొట్టి అరుస్తారు....

"మీ మిత్రులం మేము....తలుపు తీయండి!" మళ్ళీ అరిచాయి ఆ గొంతులు.

వినోద్ అప్పటికి పూర్తి తెలివిలోకి వచ్చాడు. ఆ గొంతులు....అవెక్కడో విన్నట్లున్నాయి....యెక్కడ? అతనొక్క క్షణం ఆలోచించాడు. తట్టలేదు. మళ్ళీ అవతల అరుపులు వినిపించడంతో, వెంకట్ వారిస్తూన్నా వినకుండా లేచివెళ్ళి తలుపుతీశాడు వినోద్.

ఇద్దరు ఆగంతకులు లోపలికి జొరబడ్డారు ఒక్కసారి. వినోద్, వెంకట్‌లు బెదిరిపోయి చూశారు.

ఆ ఇద్దర్లో ఒకడు భారీగా పొడుగ్గా వున్నాడు. నలభై ఏళ్ళుంటాయి. మరొకడు పొట్టిగా లావుగా వున్నాడు. అతనికి ఓ అయిదేళ్ళు తక్కువుంటాయి. ఇద్దరూ మంచి ఖరీదైన దుస్తుల్లో వున్నారు. పొడుగువాడు తాపీగా సిగరెట్ తాగుతున్నాడు. పొట్టివాడు కర్చీఫ్ అడ్డం పెట్టుకుని గదిని అసహ్యంగా పరికించసాగాడు.

"ఛీ ఛీ, అన్నయ్యా ఎంత కంపు! ఇక్కడొద్దు, వెళ్ళి పోదాం పద!"

"షటప్, పూరుకో!" కసిరాడు పొడుగువాడు, వినోద్‌ని నవ్వుతూ చూస్తూ. "హలో ఫ్రెండ్స్, మేము గుర్తున్నామా?"

"ఎ—ఎవరు మీరు?" అన్నాడు వినోద్ భయాన్ని అణచుకుంటూ.

"గుర్తులేమా? మర్చిపోయారా అప్పుడే? ఓహ్, మీరు బాగా ఎంజాయ్ చేస్తున్నారు కదూ....?"

"ఎవరు మీరసలు? ఎందుకొచ్చారిక్కడికి?"

"ఆల్ రైట్! మా కారు నెంబర్ డబుల్ ఫోర్ టూ జీరో—రిఫర్ చేసుకోండి!"

వెంకట్ గబుక్కున నోట్‌బుక్ తీసి చూశాడు. "అవును, బాస్! నెంబర్ ఇందులో వుంది — మొన్న రాత్రి మూడువేల పార్టీ వీళ్ళే!"

వినోద్ ఆశ్చర్యంగా చూశాడు వాళ్ళని. పొడుగు వాడు అలాగే నవ్వుతూ చూస్తున్నాడు గర్వంగా. పొట్టివాడు ముక్కుపట్టుకొని ఇంకా అవస్తపడుతున్నాడు.

"ఓహ్, మీరా! ఎలా రావడం జరిగింది? యేమిటి అయిడియా?"

పొడుగువాడు జవాబు చెప్పకుండా పెద్దపెట్టున

నవ్వసాగాడు.

"బయట పోలీసులున్నారా?" అడిగాడు వినోద్.

"నో పోలీస్!"

"మా హెచ్చరిక గుర్తుందా?"

"గుర్తుంది!"

"అయితే పనిలోకి దిగమంటారా?"

వెంకట్ వెంటనే కత్తితీశాడు.

పొడుగువాడు నవ్వాపేసి సీరియస్‌గా చూశాడు. "పెట్టేయ్ జేబులో! మనం మిత్రులం. మేం డబ్బు కోసం రాలేదు. మిమ్మల్ని పట్టివ్వడానిక్కూడా కాదు. మా డబ్బు తీసుకోవడంద్వారా మీరు ఋణగ్రస్తులే అయ్యారు, నేరస్తులుకాదు."

"అంటే?"

"ఛీ ఛీ, అన్నయ్యా, ఈ కంపేమిటి ఇంత కంపు కొడుతూంది!" పొట్టివాడు అన్నాడు అసహనంగా.

"కంపు పనులు చేసేవాళ్ళం, మా కొంపలిలాగే కంపు కొడతాయ్!" వినోద్ అన్నాడు తడుముకో కుండా.

"అన్నయ్యా, ఈ కంపువాళ్ళలో మనకొద్దు! వెళ్ళి పోదాం, పద!"

"మళ్ళొకసారి కంపువాళ్ళన్నావంటే పైకి పంపిం చేస్తాను, జాగ్రత్త!"

"అన్నయ్యా....!!!"

"తమ్ముడూ, నిదానించు. వీళ్ళ నిలా అగౌరవపర్చకు. మన మిత్రులు." పొడుగువాడు వినోద్ వైపు తిరిగాడు, "ఫ్రెండ్స్ మీరు తమ్ముడి మాటల్ని పట్టించుకోకండి. అతను చాలా సెన్సిటివ్. ఇలాటి మురికి వాతావరణాన్ని

అసలు భరించలేదు."

"సెన్సిటివ్స్ సెంటు పూసుకురావాలి."

"తమ్ముడికి సెంటువాసన కూడా పడదు. మనం ఇక్కడ్నుంచి బైటపడితే, శుభ్రమైన గాలిని పీలుస్తూ, మా కార్లో అలా అలా తిరుగుతూ విషయాలు ముచ్చటించుకోవచ్చు. కమాన్ ఫ్రెండ్స్, లెట్స్ గో!" అతను తమ్ముణ్ని తీసుకొని బయటికి దారితీశాడు.

వీళ్ళిద్దరు ముఖాలు చూసుకుంటూ నిలబడ్డారు.

"ఏమిటి బాస్, ఇది?" వెంకట్ అన్నాడు కళ్ళు చిట్లిస్తూ.

వినోద్ చెంపలు రుద్దుకోసాగాడు. "చూద్దాం.... వీళ్ళు మనకు హాని తలపెట్టేలా లేరు. ఏదో సహాయం అడుగుతున్నారు. మనవల్ల అయితే చేద్దాం. లేకపోతే-"

"లేకపోతే?" వెంకట్ అన్నాడు ఆత్రంగా.

వినోద్ జవాబివ్వకుండా అక్కడ్నుంచి గబగబా నడిచాడు. వెంకట్ తికమకగా బైటకొచ్చి తలుపు మూసి తాళంవేశాడు. ఇద్దరూ మెట్లు దిగి కిందకొచ్చారు. అప్పటికే ఆ అన్నదమ్ములిద్దరు కార్లో కూర్చుని వున్నారు. పొట్టివాడు డ్రైవింగ్ సీట్లో, పొడుగువాడు వెనుక సీట్లో.

"కమాన్ ఫ్రెండ్స్, ఎక్కి కూర్చోండి."

# 4

ఇద్దరూ ఎక్కి వెనుక సీట్లో కూర్చున్నారు. వెంటనే కారు కదిలింది.

పొడుగతను అన్నాడు సిగరెట్ తాగుతూ. "మిమ్మల్ని చూసినప్పుడే అనుకున్నాను—ఈ పని మీవల్లే అవుతుందని నాకిప్పుడు నమ్మకం కుదిరింది."

వినోద్ చిన్నగా నవ్వాడు. "నమ్మకాలు వమ్ము అవుతుంటాయి.... మీ పేరేవరో మాకు చెప్పనేలేదు."

"కమలేశ్వర్ నా పేరు" అన్నాడా మనిషి గంభీరంగా, "తమ్ముడి పేరు పరమేశ్వర్, ఇంతే మా గురించి చెప్పుకోదగింది."

"ఓ.కే. ఇక బిజినెస్ మాట్లాడండి."

"బిజినెస్ రిస్కుతో కూడుకున్నదే...." అన్నాడు కమలేశ్వర్ నెమ్మదిగా. "అయితే ప్రతిఫలం కూడా అంతవుంటుంది. పదివేలు. మూడువేలు అప్పుడే అడ్వాన్సు తీసుకున్నారు. మిగతావి పనయ్యాక అందుతాయి."

"పనేమిటో చెప్పండి."

"వెల్, గండిపేట పిక్నిక్ కాటేజెస్‌లో ఓ పార్టీ దిగింది మొన్న."

"అయితే?"

"అందులో ఒకర్ని మన అతిథిగా తెచ్చుకోవాలి."

వినోద్ అతనివైపు తిరిగి సూటిగా చూశాడు. "అంటే?"

"మీ ప్రొఫెషన్‌లో దానర్థం ఏమిటో గ్రహించు."

"బలవంతంగా ఎత్తుకు రావడం."

"దట్స్ రైట్, కిడ్నాపింగ్."

"అదెంత తీవ్రమైన నేరమో మీకు తెలుసనుకుంటాను."

"తెలుసు. మొన్న రాత్రి మీ రిద్దరు చేసింది కూడా నేరమే."

"కానీ మీరిలా నేరాలుచేసే మనుషులనుకోలేదు. మీరు గౌరవనీయుల్లా, చాలా డబ్బున్న వాళ్ళలా వున్నారు."

కమలేశ్వర్ నవ్వి వూరుకున్నాడు. కారు సైదాబాద్ దాటి మలక్ పేటలోకొచ్చి దిల్ సుఖ్ నగర్ వైపు వెళ్తోంది.

వినోద్ వెంకట్ లు ఎవరి ఆలోచనల్లో వాళ్ళు నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"డబ్బు అవసరం మనిషిలో ఏదైనా చేయిస్తుంది.." కమలాకర్ చెప్పసాగాడు కిటికీలోంచి బైటికి చూస్తూ, "మాకిప్పుడు అర్జంటుగా అయిదు లక్షలు కావాలి. లక్షలంటే మాటలుకాదు. డబ్బు ముందు నీతినియమాలు నిలవలేవు. మా అవసరానికి ఇంతకంటే ఉపాయం తోచలేదు."

"ఏమిటా అవసరం?" అడిగాడు వినోద్.

"అది మీ కనవసరం. నేను చెప్పినట్లు మీరు చెయ్యాలి. ఇతర విషయాలు మీకనపసరం. మీకు ఏడు వేలు ఫీజు ముడుతుంది."

"ఆ పనేదో మీరే ఎందుకు చేయకూడదు? డబ్బు అవసరంలో వున్నామన్నారు, ఆ ఏడు వేలూ మీకే మిగులుతాయిగా?"

కమలేశ్వర్ వివరించాడు. "ప్రతి పనికీ ఓ పద్ధతి అని వుంటుంది, లేకపోతే ప్రపంచమే గందరగోళం. ఏ పనికి ఆ ఎక్స్పర్ట్స్ వుంటారు. రైలింజన్ డ్రైవర్ని పట్టుకొచ్చి పలావు వండించగలమా? అలాగే పలావు వండేవాడితో రైలు తోలించగలమా?"

"ఐసీ....అయితే ఆ పార్టీ యెవరు?"

కమలేశ్వర్ దగ్గరగా వచ్చాడు. "జవ్వని?" అన్నాడతను, వాళ్ళ ముఖాల్లోకి కుతూహలంగా చూస్తూ, "మిసమిసలాడే ఓ అందాల బాల!"

కానీ అతను ఆశించినట్లు జరుగలేదు.

వినోద్ సీరియస్‌గా చూశాడు, కోపం అణచు కుంటూ.

"సారీ, నేనీపని చెయ్యను" అన్నాడతను చటుక్కున.

కమలేశ్వర్ మళ్ళీ దగ్గరగా వచ్చాడు. "యెందుకు చెయ్యవు?"

"ఆడవాళ్ళకు హాని చెయ్యను."

కమలేశ్వర్ ముఖం చిట్లించాడు. "అదేమిటి?"

"నేనీపని చెయ్యను!" అన్నాడు వినోద్ కచ్చితంగా, "ఆడవాళ్ళకు హానిచెయ్యను. చేసి అనుభవించాను. శపించబడ్డాను. వాళ్ళ జోలికిపోతే నాకు కీడు జరుగుతుంది.ఇది గ్రహించేటప్పటికి నేను సర్వం కోల్పోయాను. నా తల్లీ, తమ్ముడూ, ఉద్యోగం, ఆస్తీ .... అన్నీ పోయాయి."

"నీ మాటలు అర్థంగావడంలేదు."

"నా సెంటిమెంట్స్ అర్థంగావు—నా స్థానంలో వుంటేగాని."

"ఏం జరిగింది—ఏమిటా శాపం? ఏం హాని చేశావు?"

"చదువుకునే రోజుల్లో ఓ అమ్మాయిని మోసం చేశాను. ఆత్మహత్య చేసుకుంది. నెల తిరక్కుండానే ఎంతో ఆరోగ్యంగా వుండే మా అమ్మ దావానలం(?) పడి చచ్చిపోయింది.

"ఉద్యోగంలో చేరాక మా బాస్ అమ్మాయిని ఒకసారి షికారుకని తీసుకెళ్ళి అక్కడ కాఫీలో మత్తు మందు వేసి.... మొదట్నుంచీ నా బుద్ధి అంతే! అప్పుడు గొడవజరిగి నా ఉద్యోగం పోయింది. ఆ మర్నాడే

స్కూటర్‌కు యాక్సిడెంట్ జరిగి తమ్ముడు పోయాడు.

"నాకెక్కడా ఉద్యోగం దొరకలేదు. ఉన్న ఆస్తి ఖర్చుపెడుతూ అలవాట్లు మరిగాను. సంవత్సరం తిరిగే లోగా అంతా అయిపోయింది. వీధినపడ్డాను. నేరాలకు పాల్పడ్డాను—

"ఓ రాత్రి రెండో ఆట వదిలాక వస్తోన్న ఇద్దరు ఆడవాళ్ళని సందులోకి లాగి గాయపర్చాను. డబ్బూ నగలు దోచుకుని పారిపోయాను. కానీ వాళ్ళ అరుపులు వినివచ్చిన జనాన్నుంచి తప్పించుకోలేకపోయాను. చావు దెబ్బలు తిన్నాను. మూడ్నెల్లు జైల్లో వున్నాను. అప్పుడే నా జీవితాన్ని సమీక్షించుకుంటే కొన్ని సత్యాలు బోధపడ్డాయి."

"ఏమిటవి?"

"ప్రతిసారీ — ఆడవాళ్ళకి హాని తలపెట్టినప్పుడల్లా నేనేదో ఒకటి నష్టపోతున్నాను. నాకు జ్ఞానోదయమైంది. ఇకనుంచి ఆ పద్ధతికి స్వస్తి చెప్పాలనుకున్నాను. వాళ్ళ జోలికి అసలు పోకూడదని గట్టిగా నిశ్చయించుకున్నాను. అప్పట్నుంచీ నేను ఇంకేదీ కోల్పోలేదు. కోల్పోవ డానికి నా దగ్గరిప్పుడు ఒక్కటే వుంది—నా ప్రాణం. మళ్ళీ అలాటి పొరపాటు చేస్తే అది కూడా పోవడం ఖాయం. నా కది ఇష్టంలేదు. బ్రతకాలనుంది. జీవితాన్ని ప్రేమిస్తాను, అదెంత దుఃఖపూరితమైనా."

"మరిందాక గదిలో మోహిని కామిని అంటూ కలవ రించావు?"

"అది వేరు. నా యే అవసరానికి సాంప్రదాయ స్త్రీని బాధించను. ప్రొఫెషనల్స్ వేరే వున్నారు, వాళ్ళే నా అవసరాలు తీరుస్తారు."

"పెళ్ళి చేసుకుంటే....?"

"అందుకు తగను. చరిత్ర హీనుణ్ని."

కారిప్పుడు హాయత్ నగర్ లో ప్రయాణిస్తోంది. వాళ్ళందరిమధ్యా నిశ్శబ్దం ఆవరించుకుంది. కారు హైవే వదిలి ప్రక్కన మట్టిరోడ్డులోకి తిరిగింది. ఆ చీకటిదారిలో అనేక మలుపులు తిరిగి అయిదు నిముషాల తర్వాత యేకాంతంగా వున్న ఒక పెంకుటింటి ముందాగింది.

అందరూ దిగారు. పరమేశ్వర్ తలుపు తాళంతీసి లోపలికెళ్ళాడు. ఆ చీకట్లో తడుముకుంటూ వెళ్ళి లాంతరు తెచ్చి వెల్గించాడు. కమలేశ్వర్ దాన్ని తీసుకుని ఇల్లంతా తిరిగి చూపించాడు.

"ఈ ఇంటిని మన పనికోసం తీసుకున్నాం. ఆమెను రెండు రోజు లిక్కడుంచుతాం. ఎవరికీ తెలీదు. ఎలా వుంటుంది?"

వినోద్ అసహనంగా చూశాడు. "ఈ పని నేను చెయ్యనన్నాను."

నవ్వాడు కమలేశ్వర్. "ముందెంతో జీవితమున్న వాడివి. సెంటిమెంట్స్ మాను. సెంటిమెంట్స్ తో నువ్వేం సాధించలేవు. మనిషికి సాహసం కావాలి. జీవితం సార్థకమవుతుంది. నువ్వు జీవితాన్ని ప్రేమిస్తానన్నావు. నేను అనుభవించాలంటాను. అందుకు డబ్బు జతపడాలి. డబ్బుగాక మరేదీ జీవితాన్ని సుఖమయం చేయలేదు. ఆ సుఖంకోసమే మొన్న రాత్రి మీరు మమ్మల్ని దోచుకున్నారు—"

"నేనీపని చెయ్యకపోతే ఏమవుతుంది? అది చెప్పండి ముందు!"

కమలేశ్వర్ జేబులో చెయ్యిపెట్టి తీశాడు, "చెప్తాను.

అది కూడా చెప్తాను. నీకన్నీ చెప్తాను. ముందీ కవరు తీసుకో. అందులో యేముందో చూడు — చూశావా? గుడ్, ఎలా వుంది? అలాంటిది మరొకటి నా దగ్గరవుంది. అవసరాన్నిబట్టి సంఖ్య పెరుగుతుంది.

"ప్రతి పనికీ ఓ పద్ధతి వుంటుందన్నానుకదూ? నాకో ఇద్దరు మనుషులు కావలసివచ్చినప్పుడు అలాటివాళ్ళ కోసం వేటలోపడ్డాను. వాళ్ళు మంచివాళ్ళయి వుండాలి కదూ? బుద్ధిమంతులై వుండాలి. ఇచ్చిన పని తప్ప మరొకటి ఆలోచించకూడదు కదా? డబుల్ క్రాస్ చెయ్యొద్దు. బ్లాక్ మెయిల్ చెయ్యొద్దు. డబ్బుదగ్గర పేచీ పెట్టొద్దు. అందుకని ముందే ఓ ట్రాప్‌లో ఇరికించాలి—

"అలా మొన్న నేనంతా గాలించి చివరికి మిమ్మల్ని చూశాను—కోఠి పార్కులో, మీరిద్దరప్పుడు హోల్డప్ గురించి మాట్లాడుకుంటున్నారు, అవునా? మీ వెనుకే వుండి ఆ మాటలన్నీ విన్నాను రహస్యంగా. మీరే నాకు పనికొస్తారనిపించింది.

"మీరక్కడ్నుంచి విడిపోయాక నిన్ను వెంటాడి నీ అడ్రసు—అదే నీ గది తెలుసుకున్నాను. ఆ తర్వాత రాత్రి మేమిద్దరం కార్లో అలా బయల్దేరాం, బ్యాగులో డబ్బుతో. అప్పుడు మీరేం చేశారు? అనుకున్న ప్రకారం మమ్మల్ని అటకాయించి డబ్బు దోచుకున్నారు.

"కానీ ఒక్కటి గమనించారా? నేనప్పుడు ఫోటో తీశాను. సిగరెట్ తాగే నెపంతో నిన్ను ఫోటో తీశాను. నా సిగరెట్ లైటర్ వుంది చూశావా, అందులో మినియేచర్ కమేరా వుంది. అదే ఈ ఫోటో! బాగుంది కదూ? చేతిలో కత్తి, ముఖానికి గుడ్డ, కానీ కళ్ళు స్పష్టంగా వున్నాయి. కళ్ళు చాలా చెప్తాయి మనుషుల

గురించి. ఇవి నీ కళ్ళు. సందేహంలేదు.

"నువ్వీ పనికి ఇప్పుడు ఒప్పుకోలేదనుకో, ఈ ఫోటో పోలీసులకి చేరుతుంది. మేం అంతా చెప్పేస్తాం నీ గురించి. ఛ, అది బాగుంటుందా? చెప్పు, నువ్విప్పుడు నే చెప్పినట్లూ చేస్తావు కదూ?"

## 5

అతను పేపరులోంచి తలెత్తి చూశాడామెవైపు.

"డాడీ, నేనిప్పుడెలా వున్నాను?"

స్తబ్ధుడైపోయాడతను పేపరు వదిలేసి. సంభ్రమాశ్చర్యాలతో చూడసాగాడు కళ్ళు విశాలం చేసి. తన కళ్ళను తనే నమ్మలేకపోతున్నాడు .... ఇంత అత్యద్భుతంగా తన కెప్పుడూ గోచరించలేదామె! అపురూప సౌందర్యరాశి. పద్దెనిమిదేళ్ళ లేలేత ప్రాయంలో, పడిలేచే కెరటంలాంటి యూఁకుడు ఉత్సాహంతో, చిలిపి నవ్వులు చిందించే పులిపిరి పెదాలతో, అంతులేని అల్లరిని కురిపించే గోధుమవన్నె కళ్ళలో, తనవెప్పుడూ అలరించి మురిపించే తన గారాల తనయలో ఇంత అద్భుతమైన సౌందర్య సంపదని మునుపెన్నడూ గాంచలేదు!

ఆరెంజి రంగు బెనారస్ సిల్కు షల్వార్ మీద అదే రంగులో కలిసే పొట్టిచేతులకుర్తా, దానిమీద సన్నని పూవులుగల లేతపసుపు రంగులో పరికిణీ వేసుకుంది. ఒత్తయిన శిరోజాల్ని ఎడమపక్క రెండుపాయలుగా విడదీసి రెండు జడలు వేసుకుంది. పొడవైన నాజూకు చేతులకి బంగారు గాజు ఒకటి—ఎడమ చేతికి—రిస్టువాచీ కుడిచేతికి పెట్టుకుంది. మెడలో ఒక సన్నని వజ్రాలతో మెరుస్తోన్న హారం ఆమెకెంతో వన్నె తెచ్చింది. కను బొమల్ని చక్కగా ఐబ్రో పెన్సిల్‌తో తీర్చి దిద్దుకుంది.

ఆమె గులాబీ రేకులవంటి పెదాలకి లిప్ స్టిక్ అవసరంలేదు.

"బేబీ, సుర్వాద్భుతంగా వున్నావ్!" అన్నాడతను తేరుకొని.

ఆమె గలగలా నవ్వి తండ్రిని సమీపించింది. అతని భుజాలపై చేతులు వేసి, వంగి గెడ్డంకింద ముద్దుపెట్టుకుంది. "ఓహ్, మై స్వీట్ డాడీ!"

అతను తృప్తిగా నవ్వుతూ ఆమెను పక్కన కూర్చొబెట్టుకున్నాడు.

"బేబీ, ఇప్పుడు నీ ప్రోగ్రాం ఏమిటి?" అడిగాడతను ఆప్యాయంగా చూస్తూ.

"డాడీ, నేనలా బయట కెళ్లొస్తాను. నువ్వూ రాకూడదా? అక్కడ గాలి చక్కగా వుంటుంది.... చెరువు దగ్గర ఎంతో హాయిగా వుంటుంది."

"నువ్వెళ్ళు బేబీ. ఈ పేపర్లో ఆర్టికల్ ఇంట్రెస్టింగ్ గా వుంది."

"నీకెప్పుడూ పేపర్లూ పుస్తకాలే, డాడీ!"

నవ్వాడతను. "నువ్వెళ్ళు బేబీ. రేపు మనిద్దరం వెళ్దాం, ఆ పార్క్ చూడాలి కదూ?"

"అవును, రేపే చూడాలి!"

"అలాగే, నువ్వెళ్ళి త్వరగా వచ్చేయి చీకటి పడకుండా."

"సరే డాడీ, బైబై!" ఆమె లేచి టేబిల్ మీద కెమెరా అందుకుంది.

"బైబై బేబీ, గుడ్ లక్!"

ఆమె చిరునవ్వు నవ్వి బైటకు నడిచింది.... ఆమె నిశ్శబ్దంగా వెళ్ళిపోయాక నిట్టూర్చాడతను. తిరిగి బలవంతంగా పేపర్లోకి తల దూర్చాడు.

కేవల్ నాథ్ వర్మకు అరవై ఏళ్ళుంటాయి. బొంబాయిలో అతను పెద్ద పారిశ్రామికవేత్త. లాబరేటరీ రసాయనాలు తయారుచేసే పెద్ద ఫ్యాక్టరీ వుందతనికి. ఒక సాల్వెంట్ ఎక్స్‌ట్రాక్షన్ ప్లాంట్‌లో పార్ట్‌నర్. మరికొన్ని కంపెనీల్లో వాటాలున్నాయి.

ఎంత కష్టించినా, ఎంత గడించినా ఒక్కగానొక్క ఆ కూతురు కోసమే. అతనికి మరెవరూ లేరు బంధువులు. కూతురి కోర్కెలు తీర్చడంకన్నా అతనికి మరో ఆనందం లేదు. వ్యాపకం లేదు.

చిన్నప్పట్నుంచీ ఆమె చారిత్రక విషయాలపైనా, అటువంటి కట్టడాలపైనా మక్కువ పెంచుకుంది. దేశంలోని అటువంటి నిర్మాణాలన్నిటినీ చుట్టి రావాలన్న అభీష్టాన్ని నెరవేర్చే కార్యక్రమంలో భాగంగా అతనీ హైదరాబాదుకొచ్చాడు. పెళ్ళయాక భర్తతో తిరిగి రమ్మని ముందు సూచించాడు. కానీ ఆమె హనీమూన్ విదేశాలకి పంపమని కోరింది....

ఈ హైదరాబాదుకొచ్చి రెండు రోజులైంది. చూడ తగ్గవి మరికొన్ని మిగిలి వున్నాయి. అవి ఇంకో రెండు రోజుల్లో పూర్తవుతాయి. ఆ తరువాత మైసూర్ ప్రయాణం ... ఈ రెండు రోజులూ ఇక్కడ సిటీకి దూరంగా, గండిపేట దగ్గర పిక్నిక్ కాటేజెస్‌లో ప్రశాంతంగా గడిచిపోయింది కాలం. బొంబాయిలోని రద్దీ జీవితాన్నుంచి ఈ మార్పు అతనికెంతో సౌఖ్యాన్నిస్తోంది....

స్మిత కాటేజిలోంచి వచ్చి రెస్టారెంట్‌లో లిమ్కా తీసుకుంది. అక్కడ్నుంచి బయల్దేరి పరిసరాల్ని తిలకిస్తూ ఏవేవో ఆలోచిస్తూ కాటేజి ప్రాంతాన్ని దాటేసింది.

సూర్యుడప్పుడే అ స్తమి స్తున్నాడు....

త్వరగా బ్రిడ్జి చేరుకుని నీటితలంపైపడి మెరిసే సూర్య కిరణాల్నీ, సూర్యుడు బ్యాక్ గ్రౌండ్ గా పక్షుల విన్యాసాల్నీ సాధ్యమైనన్ని కోణాల్లో తన మినీ ఆటోమాటిక్ కెమెరాలో పట్టుకోవాలని ఆమె సంకల్పం.

అలా నడుస్తూ ఆమె పూర్తి నిర్మానుష్యంగా వున్న ఇసుక ప్రాంతానికొచ్చేసింది.

ఆ ప్రాంతాల యాత్రికులెవరూ లేరు. అంతా ఎప్పుడో తిరుగు ప్రయాణాలు కట్టేశారు.

స్మిత అడుగులు వేస్తూ కొంతదూరంలో ఒక కారుని చూసి ఆగిపోయింది.

అక్కడ ఇద్దరు వ్యక్తులు నిలబడి వున్నారు. ఆమె వైపే చూస్తున్నారు. వాళ్ళ పోకడ ఆమెకెందుకో గాభరా పుట్టించింది. గిర్రున చుట్టూ చూసింది. ఇంకెవరూ లేరు. ఆమె గబగబా వెళ్ళిపోవాలనుకుంది— కానీ అలా జరగలేదు.

ఆగంతకు లిద్దరూ మెరుపులా ఆమెవైపు దూసుకొచ్చారు. ఆమె నోరు తెరచి అరిచేంతలో ఆమెని లేపుకొని కారువైపు పరుగుతీశారు.

ఆమె గింజుకుంటూ తెలివిలోకొచ్చి, "ఓహ్ డాడీ!" అని కేకపెట్టింది.

"షటప్!" అన్నాడు వినోద్, నోరు నొక్కుతూ.

## 6

ఇన్స్పెక్టర్ శివశేఖర్, కమీషనర్కు ఇలా వివరించాడు.

"సర్, ఇందులో సందేహంలేదు. ఆమె కిడ్నాప్ చేయబడింది. అక్కడ ఇసుకలో ఏర్పడ్డ టైర్ ప్రింట్లూ,

అడుగుజాడల్నిబట్టి అర్థమవుతోంది....అక్కడ మూడు జతల అడుగుజాడలున్నాయి, సర్. కిడ్నాపర్స్ ఇద్దరు. అక్కడ దొరికిన కెమెరా ఆమెదేగానీ దానిమీద ఆమె వేలముద్రలే వున్నాయి. సిగరెట్ బట్స్‌వంటి ఇతర ఆధారాలేవీ లేవు, సర్. టైరు ప్రింట్స్‌ని కాస్టింగ్ తీయదల్చుకున్నాం. అది కారును నిర్ధారించడానికి పనికి రావచ్చు. కానీ మిస్టర్ వర్మ ఇప్పుడు మన జోక్యాన్ని వ్యతిరేకిస్తున్నాడు, సర్."

"ఎందుకు?"

"కుమార్తె వివాహముందట ఇంకో రెండుమాసాల్లో. ఇప్పుడీ సంఘటన పొక్కితే తమకు కీడే జరుగుతుందన్నాడు. మనల్ని, ప్రెస్‌నీ దూరంగా వుండమంటున్నాడు, సర్."

"అయితే కిడ్నాపర్స్ కోరితే డబ్బివ్వడానికి సిద్ధంగా వున్నాడా?"

"అవును సర్, అదీ రహస్యంగా జరగాలంటున్నాడు."

"మిస్టర్ నేశన్, అది చట్ట విరుద్ధం."

"సర్ —"

"వెళ్ళండి, ఆ కాటేజి మేనేజర్‌తో మాట్లాడండి. స్విచ్ బోర్డు దగ్గర వేచివుండండి. కిడ్నాపర్స్‌నుంచి వర్మకు ఫోనొస్తే వాళ్ళ ఇన్‌స్ట్రక్షన్స్ ఏమిటో తెలుసుకోండి. వాటినిబట్టి ఫాలో అవండి. యూ మస్ట్ ట్రాక్ దెమ్ డౌన్!"

"యస్, సర్!" శివ నేశన్ శాల్యూట్ చేసి వేగంగా నిష్క్రమించాడు.

# 7

"అన్నయ్యా! మన పంట పండింది!"

"అప్పుడే కాదు, తమ్ముడూ! ఇంకా కొంత జరగాలి-"

"మరి త్వరగా కానివ్వన్నయ్యా! నాకు గుబులుగా వుంది?"

అన్నదమ్ములిద్దరు బంజారా హిల్స్‌లోని తమ బంగళాలో కూర్చుని తాగుతూ మాట్లాడుకుంటున్నారు. వర్మ కూతుర్ని వినోద్ వాళ్ళు తెచ్చాక ఆమెని హాయత్‌నగర్ అద్దె ఇంట్లో వుంచి అక్కడ వాళ్ళిద్దర్ని కాపలా పెట్టారు ఈ రాత్రికి. తామిద్దరు బంగళాకు తిరిగొచ్చేశారు— విశ్రాంతికి.

కమలేశ్వర్ తన గ్లాసులోని ద్రవాన్నంతా తాగేసి తూలుతూ లేచాడు. ఫోన్ దగ్గరకి వెళ్ళి ఒక నెంబర్ తిప్పాడు. అవతలనుంచి రెస్పాన్స్ రాగానే, కర్ఛీఫ్ అడ్డంపెట్టి గొంతు కూడా మార్చి, కాటేజి నెంబర్ ఎనిమిదిలో వర్మకు కనెక్టు చేయమని కోరాడు.

మరుక్షణం వర్మ లైనులోకొచ్చాడు.

"హలో, నేను కేవల్‌నాథ్ వర్మని."

కమలేశ్వర్ వికటాట్టహాసం చేశాడు. "తెలుసు, తెలుసు మిత్రమా!"

"ఎవరు.... ఎవరది?" వర్మ అన్నాడు గాభరాగా.

కమలేశ్వర్ మళ్ళీ నవ్వాడు. అది చూసి పరమేశ్వర్ కూడా లేచి అతన్ని చేరుకున్నాడు.

"మిష్టర్ వర్మ, కూతురు కావాలా నీకు?"

"కావాలి! కావాలి! ఎక్కడుంది నా బేబీ?"

"చెప్పినట్టు చెయ్యి! ఉన్నచోటే వుంది. రేపు రాత్రి సరిగ్గా తొమ్మిదిన్నరకు వెనక్కి చూడకుండా నడు

నుండాలి నీ మనిషి, టాంక్ బండ్ మీద, అయిదు లక్షలతో. వింటున్నావా? వాడి ఎడమ చేతిలో బ్రీఫ్ కేసుండాలి. మా మనిషి వాడ్ని గుర్తించడానికి కుడి కాలు కుంటుతూ నడవాలి. మా మనిషివచ్చి నీ మనిషితో టాంక్ బండ్ పొడవెంత అనడుగుతాడు. తెలివి తేటలతో పనిలేకుండా పదిమైళ్ళు అనాలి. అర్థమైందా కోడ్ వర్డు?

“జాగ్రత్త, పోలీసులొద్దు. ట్రిక్కులొద్దు, నీతి నిజాయితీలతో మనమీ వస్తుమార్పిడి చేసుకుందాం. ఆ తర్వాత గంటలోగా నీ ముద్దుల అమ్మడు సాలార్ జంగ్ ముందుంటుంది, దిక్కులు చూస్తూ. నీ మనిషి వెళ్ళి కలెక్టు చేసుకోవచ్చు. ఓ.కే?”

“ఓ.కే....ఓ.కే....అలాగే!”

“గుడ్! అయిదు లక్షలు, రేపు రాత్రి తొమ్మిదిన్నరకు!”

కమలేశ్వర్ మరో వికటాట్టహాసంచేసి ఫోన్ పెట్టేశాడు.

“అన్నయ్యా, మన పంట పండుతుంది!”

“మనం అజేయులం తమ్ముడూ!”

వాళ్ళిద్దరు తిరిగి తాగడానికి ఉద్యమించారు.

పిక్నిక్ కాటేజెస్ స్విచ్ బోర్డు దగ్గర ఇన్స్పెక్టర్ శివనేశన్, తృప్తిగా తలపంకించి, ఇయర్ ఫోన్స్ తీసి, ఆపరేటర్ కు థాంక్స్ చెప్పాడు.

## 8

వినోద్ ఆ గది తలుపు తెరచి లోపలికెళ్ళాడు.

లాంతరు గుడ్డివెలుగులో ఓ మూలగా మంచంపై అస్పష్టంగా కన్పించిందామె ఆకారం. గదిలో అలికిడికి ఆమె చటుక్కున లేచి కూర్చుంది. వినోద్ లాంతరు వత్తి

పెంచి ఆమెవైపు నవ్వుతూ చూశాడు. కానీ ఆమె ముఖంలో భయం, కోపం, అసహ్యం, కసి ఎప్పటిలానే వున్నాయి.

ఆమె ప్రక్కన స్టూలుమీద ఆహారపదార్థాలంతా అలాగే వున్నాయి.

వచ్చినప్పట్నుంచీ ఆమె తినటానికి ఏదీ ముట్టుకోలేదు. వినోద్ చాలా ప్రయత్నించాడు. బ్రతిమాలాడు, ఆమె వినలేదు. విడిచిపెట్టమని అప్పుడు చాలా గొడవ చేసింది.

కానీ కమలేశ్వర్ రివాల్వర్ చూపెట్టడంతో భయంతో బిగుసుకుపోయింది. అతను రివాల్వర్ గురిపెట్టి అరిస్తే కాల్చేస్తానన్నాడు. ఆమెను కట్టి పడవేయమని వినోద్‌ని ఆజ్ఞాపించాడు. కానీ వినోద్ ఆమె అల్లరి చేయకుండా చూస్తానని హామీ యిచ్చాడు.

అన్నదమ్ము లిద్దరు వెళ్ళిపోయాక వినోద్ ఆమెతో ఎంతో మృదువుగా మాట్లాడాడు. కానీ ఆమె అన్నం అసలు ముట్టుకోలేదు.

ఇప్పుడు వినోద్‌ని చూసి ఆమె మళ్ళీ రెచ్చిపోయింది.

"ఎందుకొచ్చావు మళ్ళీ? వెళ్ళిపో నా ముందునుంచి!"

వినోద్ నవ్వి నేలపై చతికిలబడ్డాడు, "ఏమీ తినకుండా ఎలా వుంటావు, స్మిత?"

"ఎలాగో వుంటాను! మీ దుర్మార్గుల చేతిలో మంచి నీళ్ళుకూడా ముట్టను!" ఆమె వెర్రి ఆవేశంతో స్టూలుమీద ప్లేటుని తలుపుకేసి గిరవాటేసింది.

ఆ చప్పుడికి వెంకట్ పరుగెత్తుకొచ్చి చూశాడు. ప్లేట్ ముక్కలైంది. పదార్థాలు చెల్లాచెదురయ్యాయి.

"తప్పు స్మిత, అన్నం అలా పారేయకూడదు."

"షిట్, గెటవుట్! నన్నెందుకు విసిగిస్తున్నావు?

ఏమిటిదంతా? నన్నెందుకు తెచ్చారో చెప్పవేమిటీ! నేనిక్కడ ఎందుకుండాలీ!"

"మీ డాడీ నిన్నిక్కడ వుంచమన్నారు."

"అబద్ధం, కోర్ట్మాయి! మీరంతా దుర్మార్గులు! డాడీ నుంచి నన్ను వేరుచేశారు! డాడీనేంచేశారో చెప్ప వేమిటీ!"

"ఆయన క్షేమంగా వున్నాడు. చెప్పినట్టు నడచుకుంటే నువ్వూ వుంటావు. రేపు రాత్రి నువ్వు డాడీని చేరుకుంటావు."

"నన్ను వెళ్ళిపోనీయ్! నన్ను పట్టుకోకు!"

వినోద్ వూహించనంత వేగంగా లేచి ఆమె తలుపు వైపు ఉరికింది. వెంకట్ అడ్డుకోబోయాడు, చెంప పగిలింది. పక్కకు తప్పుకున్నాడు.

వినోద్ తెరుకొని తలుపు దగ్గరకి దూకాడు. అప్పటికే ఆమె అవతల గదిలో వుంది. తరిమి వెనుకనుంచి జడలు పట్టుకున్నాడు. లాక్కొచ్చి మంచంమీదకు తోసి చీవాట్లుపెట్టాడు. కోపంపట్టలేక చేయిచేసుకోబోయాడు. ఎంతో ఓర్పు తెచ్చుకొని ఆమెను శాంతపర్చాడు. మంచి మాటలతో ఆమె వెర్రి ప్రయత్నాలు మాన్పించాడు. ఆమె నిశ్శబ్దంగా రోదిస్తూ పక్కకు ఒత్తిగిలి పడుకుంది.

వెంకట్ చెంప నిమురుకుంటూ చూస్తున్నాడామెను. ఆడచెయ్యి రుచి అదే మొదటిసారి అతనికి. వినోద్ నిట్టూర్చి అక్కడ్నుంచి కదిలి వెనక్కు తిరిగాడు— అంతే.

కొయ్యబారిపోయాడు. వెన్ను జలదరించింది.

వెంకట్ కూడా వెనక్కు తిరిగి అలాగే అయ్యాడు.

ఆ మనిషి వాళ్ళిద్దర్నీ చూస్తున్నాడు ఉత్సుకతతో.

అతనికు నలభై ఏళ్ళుంటాయి, లావుగా బలంగా వున్నాడు. పంచ కట్టుకున్నాడు.

అతనికి వీళ్ళ వాలకం ఏమీ అర్థంగాక, "క్షమించండి, బాబూ! తలుపు తెరచివుంది .... వచ్చేశాను" అన్నాడు తడబడుతూ.

వీళ్ళిద్దరు తేరుకొని ముఖాలు చూసుకున్నారు.

"ఎవర్నువ్వు?" గద్దించాడు వినోద్.

"నేనీ వెనుకే వుంటున్నాను బాబూ.... అవతల శనగ పొలం మాదే. ఇందాకట్నుంచీ ఈ ఇంట్లో అరుపులు విన్పిస్తోంటే ఏమిటో చూద్దామని వచ్చాను.... క్షమించండి."

"అలాగా....!" అన్నాడు వినోద్ ఓరకంట చూస్తూ, అతని కళ్ళు విచిత్రంగా మెరిశాయి ఒక్కసారి. "అరుపులు విన్పించాయా నీకు? బహుశ పిలుపు అయి వుంటుంది పైనుంచి.... పద, అలా పోదాం బైటికి.... ఇంకెవరున్నారు నీతో పాటు?"

# 9

జోసఫ్ మర్నాడుదయం విమానంలో దిగి, తిన్నగా ఏర్‌పోర్టునుంచి వర్మ కాటేజికి టాక్సీలో చేరుకున్నాడు. వర్మకు అతను నమ్మినబంటు. అతనికి ఫోన్ చేసి బొంబాయి నుంచి పిలిపించాడు.

వర్మ అతన్ని రిసీవ్ చేసుకుని పరిస్థితిని వివరించాడు ఉద్రేకంగా. జోసఫ్ అందించిన బ్రీఫ్ కేసులో డబ్బు సరిచూసుకుని, కిడ్నాపర్స్ సూచనలు చెప్పాడు. జోసఫ్ అంతా శ్రద్ధగా విని తలపంకించాడు.

"బాస్, ఇందులో పోలీసులు లేరుగా?"

"లేరు. మళ్ళీ వాళ్ళు నా దగ్గరకి రాలేదు."

"బాస్, నేను స్వయంగా హాండిల్ చేస్తాను దీన్ని. మీరీ డబ్బును వదులుకుంటారా?"

"అంటే? ఏమిటి నువ్వనేది, జోసఫ్? బేబి కావాలి నాకు! ఎంత డబ్బయినా వదులుకుంటాను! నాకు బేబి కావాలి?"

జోసఫ్ తలూపాడు. "బేబి మీకెంతో నాకూ అంతే, బాస్, చిన్నప్పట్నుంచీ ఈ చేతులతో పెంచాను. కానీ మీరీ డబ్బును పోగొట్టుకోరు. ఈ డబ్బు మీరు అక్రమంగా సంపాదించింది కాదు. ఇది న్యాయంగా మీ కష్టార్జితం, బాస్, ఇందులో ప్రతి పైసా ప్రభుత్వానికి లెక్క చూపిస్తారు. మీరు చట్టబద్ధంగా గడించింది. ఇలా దొంగలపాలవ్వడానికొల్లేదు, బాస్, దొంగల్ని చట్టానికి పట్టివ్వాలి. లేదా మన చేతికి చిక్కించుకోవాలి. మీరిక నిర్భయంగా వుండండి, బాస్. అంతా నేను చూసుకుంటాను."

"జోసఫ్, నువ్వేం చేయబోతున్నావు? బేబికి ప్రమాదం...."

జోసఫ్ నిట్టూర్చాడు. "ఓ. కే, బాస్ చెప్తాను. చెప్పకపోతే మీరీపనిని చెయ్యనివ్వరు. బేబికేవిపత్తు వాటిల్లదు. నిక్షేపంగా తిరిగొస్తుంది—రాత్రి డబ్బిచ్చి నాకు బదులు మరొకడ్ని పంపుతాను, బాస్, ఓ వంద పారేస్తే ఎవరైనా వస్తారు....ఆటో డ్రైవరో, హోటల్ సర్వరో, ఎవరో ఒకరు.

"వాడికి సూచనలిచ్చి బ్రీఫ్ కేసుతో పంపుతాను. వాడికి కొంత దూరంలో నేను నడుస్తాను. కిడ్నాపర్ వాడ్ని గుర్తుపట్టి వస్తాడు. బ్రీఫ్ కేసు తీసుకున్నాక వాణ్ని నేను వెంబడిస్తాను. వాడు నన్ను గుర్తుపట్టడు.

మన మనిషిని సాలార్ జంగ్ కు వెళ్ళి బేబిని రిసీవ్ చేసుకుని ఫలానాచోట నా కోసం ఎదురుచూడమంటాను.

"ఈలోపు నేను కిడ్నాపర్ ని ఫాలో చేసి వాళ్ళ కొంపెక్కడో తెలుసుకుంటాను. అంతే, ఆ తర్వాత అదును చూసి అక్కడ వూడిపడి మన డబ్బెత్తుకొచ్చేస్తాను బాస్!"

వర్మకు ఇంకా నమ్మకం కుదరలేదు.

## 10

అన్నదమ్ములిద్దరు కారు దిగి వినోద్ ని విష్ చేశారు.

"హలో, ఎలా వుంది పంజరంలో చిలుక?" అన్నాడు కమలేశ్వర్!

"ఖులాసా. మీ ఆరోగ్యమెలా వుంది?" వినోద్ అడిగాడు నవ్వుతూ.

"దానికేమైంది? నీరసంగా కనిపిస్తున్నానా?"

"లేదు, బాగానే వున్నారు. మేం ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశాం. అది మీరు తట్టుకోగలరో లేదోనని ఆరోగ్యం వాకబు చేశాను."

"ఎగ్జిబిషనా....?"

"ఇలా రండి.... గుండె చిక్కబట్టుకోండి...."

వినోద్ వెనుక వసారా గదిలోకి తీసుకెళ్ళి చూపించాడు.

వాళ్ళిద్దరు అదిరిపోయారు, నేలమీద నిర్జీవాకారాన్ని చూసి.

"ఛీ! ఏమిటిది! ఎవరితను?" కమలేశ్వర్ అరిచాడు వెనక్కి వచ్చేస్తూ.

"రైతు సోదరుడు!" వినోద్ అన్నాడు నవ్వుతూ, "ఈ వెనుక పొలం అతనిదేనట. పాపం, రాత్రి

ఇక్కడేం జరుగుతోందో చూద్దామని వచ్చాడు....”

“చంపేశావా?”

“గొంతుపిసికి. మొండిప్రాణం. చేతులు నొప్పెట్టాయి. ఇద్దరు కావల్సి వచ్చింది.”

“నన్ను బాగా రక్కేశాడు!” వెంకట్ షర్టు విప్పి, ఛాతీమీద రక్కులు చూపాడు.

“అన్నయ్యా, ఇది హత్య! హంతకులు ఈ కంపు వాళ్ళు!”

“పిరికీ, నోర్మూయ్. మిష్టర్ కమలేశ్వర్, ఈ చుట్టు పక్కల దూరంగా ఇళ్ళున్నాయి. దురదృష్టవశాత్తు ఇక్కడ అరుపులు ఇతను విని వచ్చాడు. ఇక్కడకొచ్చినట్లు ఎవరికీ తెలీదు. గుడిసెలో ఒక్కడే వుంటున్నాడు. ఇతని పీక ఎంత ప్రమాదమో మీకు తెలుసు. అందుకే నొక్కేశాం....”

కమలేశ్వర్ చెమటలు తుడుచుకోసాగాడు. “ఇప్పుడు శవాన్నేం చేస్తారు?”

“ఆదింకా ఆలోచించలేదు, మీకు చూపిద్దామని ఇలా వుంచాం. రాత్రికి ఏదేనా చేద్దాం. డోంట్ బాదర్. అంతా మేం చూసుకుంటాం. అయితే మా రేటు ఇప్పుడు మరో అయిదు పెరిగింది—”

“ఏమిటీ!”

“ఏమీ లేదు. సినిమా హీరోలంతా ఉత్తుత్తి సాహసాలు చేస్తూనే రేటు పెంచేస్తున్నారు. మేం నిజమైన సాహసం చేశాం. న్యాయం మీరే ఆలోచించండి. నేనీపని చెయ్యకపోతే మీ రెక్కడుందేవాళ్ళు ఈసరికి?”

"సరే, సరే. ఈ రాత్రికి మేం డబ్బు కలెక్టు చేసుకోబోతున్నాం."

"ఐ విష్ యూ గుడ్ లక్."

"మాకు వెంకట్ కావాలి, డబ్బు తేవడానికి."

"అతనెందుకు? మీరే ఎందుకు తెచ్చుకోకూడదు?"

"మేం వాళ్ళకంట పడకూడదు."

"అయితే నేను వెళ్తాను."

"నువ్వు—నువ్విక్కడ చిలకను చూసుకోవాలికదా! అది నీ మాటే వింటుంది కొంతైనా. అదీగాక ఇక్కడ శవం....నువ్వొద్దు, వెంకట్‌ని పంపు."

వినోద్ అంగీకరించాడు. "ఓ.కే. అయితే డబ్బు తెచ్చే పద్ధతి ఏమిటి?"

"అది వెళ్ళేటప్పుడు వెంకట్‌కు చెప్తాం."

అన్నదమ్ములిద్దరు అక్కడ్నుంచి గబగబా కదిలారు. పరమేశ్వర్‌కు గదిలో స్మిత వుందా లేదా అని అనుమానం వచ్చింది. అతను ఆ తలుపుమీదకొట్టి, "చిలకా, క్షేమమేనా?" అన్నాడు.

"నీ నాలుక చీరేస్తాను దరిద్రుడా!" అరిచింది స్మిత.

వినోద్, వెంటనే పగలబడి నవ్వాడు, పరమేశ్వర్ ముఖం చూసి.

# 11

రాత్రి సరిగ్గా తొమ్మిదిగంటల ఇరవై అయిదు నిమిషాలకి జోసఫ్ టాంక్‌బండ్ మీద నడవసాగాడు. కుడివైపు ఫుట్‌పాత్ మీద నడుస్తూ ఎడమవైపు తన మనిషిని గమనించసాగాడు. ఆ మనిషి — వంద రూపాయలకి ఒప్పుకొని వచ్చిన ఆటో డ్రైవర్—సరిగ్గా జోసఫ్ సూచనల్ని పాటించసాగాడు.

జోసఫ్ అతనితో సమానంగా నడుస్తూ అతనిపైనే దృష్టిని కేంద్రీకరించాడు.

అప్పుడు—సరిగ్గా తొమ్మిదిగంటల ముప్పైరెండు నిమిషాలకి — ఎక్కడనుంచి వచ్చాడో ఒక ఆగంతకుడు అకస్మాత్తుగా వచ్చి ఆ మనిషిని ఢీకొట్టి పారిపోయాడు. బ్రీఫ్ కేసు మాయమైంది. ఆ విసురుకు తూలి వెల్లకిలా పడిపోయాడు డ్రైవర్.

బ్రీఫ్ కేసుతో ఆగంతకుడు వేగంగా పరుగు తీస్తున్నాడు.

రెప్పపాటు కాలంలో జరిగిపోయిన ఆ సంఘటనని జోసఫ్ చేష్టలుడిగిపోయి చూశాడు. తేరుకొని ఆగంతకుని వెంట ఉరికాడు అరుస్తూ—

అరుపులకి జనం కంగారుపడ్డారు.

ఆగంతకుడు వేగం మరింత పెంచాడు. ఆ వేగంలో, అప్పటి కంగారులో, లిబర్టీవైపునుంచి మలుపు తిరుగుతోన్న బస్సుని చూడలేదు. డ్రైవరూ వాడిని చూడలేదు. ఇద్దరి ఏమరుపాటుతో అనర్థం జరిగిపోయింది. ఇటు జోసఫ్ కి చిక్కకుండా, అటు పారిపోకుండా వాడు బస్సుకింద పడ్డాడు. పెద్ద శబ్దం! గట్టి కేక! సడన్ బ్రేకు!

ముక్కలై దూరంగాపడ్డ బ్రీఫ్ కేసు! రోడ్డంతా వెద జల్లబడ్డ నోట్లు! జోసఫ్ కి మతిపోయింది—

ఎక్కడికక్కడ ట్రాఫిక్ నిల్చిపోయింది. ప్రమాద స్థలానికి ఉరికేవాళ్ళు కొందరైతే, నోట్లు ఏరుకోవడానికి కొందరు! చూస్తూండగానే ఒక్కటంటే ఒక్క నోటు కూడా మిగలకుండా డబ్బంతా అదృశ్యమైంది. ఎవరికి అందింది వాళ్ళు పట్టుకుపోయారు రాబందుల్లా. శవం మాత్రం మిగిలింది బస్సుకింద రబ్బరు బంతిలా.

అప్పుడుగానీ తేరుకోలేదు, ఆ దృశ్యాన్ని కళ్ళారా చూస్తూన్న ఇన్స్పెక్టర్ శివనేశన్. అతడా చాటు ప్రదేశంనుంచి జవాన్లతో విజిల్ వూదుతూ పరుగెత్తి వచ్చేసరికి, జోసఫ్ కూడా తేరుకొని పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు. అతనికి నోరు తెరచి గట్టిగా ఏడ్వాలని పించింది. అక్కడ్నుంచి పరుగుతీశాడు వెర్రిగా సమీపంలోని రెస్టారెంట్లోకి.

కాటేజికి ఫోన్ చేసి, రెస్పాన్స్ రాగానే, "బాస్! కొంప మునిగింది!" అన్నాడు చెమటలు కక్కుతూ.

"జోసఫ్! ఏం జరిగింది?" వర్మ అరుపు.

జోసఫ్ చెప్పాడు గబగబా. చెప్పి బాస్ మాటల కోసం ఎదురుచూశాడు. అవిలేవు. బాస్ని పిల్చాడు. పలకలేదు.

"బాస్ .... బాస్ .... బాస్ ....!!!"

కానీ అవతలనించి ఎంతకీ సమాధానంలేదు.

## 12

మర్నాడుదయం కమీషనర్కు స్వయంగా రిపోర్టు చేయసాగాడు ఇన్స్పెక్టర్ శివనేశన్.

"సర్, వర్మ కూతురు కిడ్నాపింగ్ కేసులో కొన్ని ముఖ్యమైన అంశాలు వెల్లడయ్యాయి. రాత్రి టాంక్ బండ్ ఆక్సిడెంట్లో చచ్చిపోయినతన్ని గుర్తించాం సర్. తల బాగా చితికిపోయింది. అతని ముఖం ఆనవాలు పట్టకుండాపోయింది.

అయితే వేలిముద్రలు ఉపయోగపడ్డాయి, సర్. అతన్ని గుర్తించాం. అతని పేరు వెంకట్, సర్. పిక్ పాకెట్. అనేకమార్లు జైలుకెళ్ళాడు. అతని పూర్తి చరిత్ర మన ఫైల్లో వుంది. రాత్రి అతనీ నేరానికి

పాల్పడి చావు తెచ్చుకున్నాడు. కిడ్నాపర్స్‌కి డబ్బు పెట్టుకెళ్ళిన జోసఫ్ మనిషిని నెట్టికొట్టి పారిపోయాడు సర్. ఆ తొందరలో ఎదురుగా వస్తున్న బస్సుని తప్పించుకోలేకపోయాడు, దానికింద పడ్డాడు.

"ఈ అనుకోని సంఘటనవల్ల కిడ్నాప్ బిజినెస్ అప్‌సెటయింది, సర్. అతడు డబ్బునే కొట్టేయాలనుకోవడం దురదృష్టం. ఇది జేబు దొంగలకి కనువిప్పు ...

"సర్, అతని శవంమీద కొన్ని వస్తువులు దొరికాయి. దువ్వెన, కర్చీఫ్, కొంత చిల్లర డబ్బూ, బాల్ పాయింట్ పెన్నూ, ఒక నోట్ బుక్ ....

"ఆ నోట్‌బుక్‌లో పనికొచ్చే సమాచారముంది, సర్. అందులో రోజూ లారీ ఖర్చులు, రావలసిన బాకీలూ, కొన్ని ఫోన్ నెంబర్లూ....ఆ ఫోన్ నెంబర్లు మనకు ఉపయోగపడలేదు, సర్. అదే నోట్‌బుక్‌లో ఓ చివర ఒక నెంబర్ రాసి వుంది. అది కారు నెంబర్, సర్. రిజిస్ట్రేషన్ ఈ జోన్‌దే. ఆ కారు ట్రాప్ చేశాం, సర్. అది గ్రీన్ అంబాసిడర్, సరికొత్తది—"

"అదెవరిది ఇన్స్‌పెక్టర్?"

"ఆరేళ్ళక్రితం మీకు కమలేశ్వర్ అండ్ పరమేశ్వర్ అనే సోదరులు గుర్తున్నారా సర్, బొంబాయిలో ఒక ఫేమస్ ఫ్రాడ్ కేసులో?"

"గుర్తున్నారు, ప్రొసీడ్."

"ఆ కారు వారిదే, సర్. ఇటీవలే కొన్నారు. వాళ్ళిక్కడే వుంటున్నట్లు దీన్నిబట్టి తెలుస్తోంది. బొంబాయిలో వాళ్ళు అయిదేళ్ళు జైలుశిక్ష అనుభవించాక విడుదలై ఎక్కడికి పోయారో ఎవరికీ తెలీదు, సర్. వాళ్ళు బైటికొచ్చి ఆర్నెల్లవుతోంది....ఇప్పు

డిక్కడే వున్నట్లు అర్థమవుతోంది.

"బొంబాయిలో వాళ్ళు అన్ని రకాల బ్రోకరేజీలు చేపట్టేవారు. పెద్ద పెద్ద పరిశ్రమలకు ఎగుమతి దిగుమతి లైసెన్సులనుంచీ చిన్న చిన్న మోటారుబళ్ళకి రూట్ పర్మిట్లవరకూ. అక్కడ కేవల్ నాథ్ వర్మ అనే కెమికల్ కంపెనీ యజమాని దగ్గర్నుంచి ఎక్స్‌పోర్టు లైసెన్సు నిమిత్తం మూడున్నర లక్షలు తీసుకున్నారు, సర్. ఢిల్లీలో అయ్యే ఖర్చులూ, పెట్టే లంచాలూ అని చెప్పి. అంతే సర్, ఆ డబ్బుతో వాళ్ళు మరిక కన్పించలేదు. ఆ డబ్బు అపహరించి అదృశ్యమయ్యారు.

"వర్మ పోలీసు రిపోర్టివ్వగా గాలించి నెలరోజుల తర్వాత సింగపూర్‌లోని ఒక పోష్ హోటల్‌లో అరెస్టు చేశారు, సర్. ఆ తర్వాత వాళ్ళు నేరాన్ని ఒప్పుకొని శిక్షకు సిద్ధపడ్డారు కానీ, ఆ డబ్బునేం చేశారో చెప్పలేదు. శిక్ష పూర్తయ్యాక విడుదలై యెక్కడికెళ్ళారో ఎవరూ పట్టించుకోలేదు. ఆ డబ్బుని సింగపూర్‌లో దాచివుంటే అక్కడికే వెళ్ళిపోవాలి. కానీ ఇక్కడ-ఈ హైదరాబాదులో ఏం చేస్తున్నట్లు, సర్?"

"మీరు చెప్పే ఆ కెమికల్ కంపెనీ కేవల్ వర్మ, ఇప్పుడీ కిడ్నాప్ కేసులో కేవల్ వర్మ ఒక్కరేనా?"

"అది జోసఫ్ చెప్పడంలేదు, సర్."

"జోసఫ్ ఎందుకు—వర్మనే అడక్కపోయారా?"

"అయాం సారీ, సర్. వర్మ ఇక లేడు."

"వర్మ ఇక లేడా? ఇన్స్‌పెక్టర్, మీ ఉద్దేశ్యం?"

"అనర్థం జరిగింది, సర్. రాత్రి టాంక్‌బండ్ సంఘటన జోసఫ్ తన బాస్‌కు తెలియజేసి పొరపాటు చేశాడు. అతడు హృద్రోగియని ఆ క్షణంలో విస్మరించాడు, సర్.

ఆ వార్త విని వర్మ షాక్ తిన్నాడు, మరిక కోలుకో లేదు."

"ఈజిట్....? హౌ బాడ్!"

"ఇప్పుడు జోసఫ్ బాధపడుతున్నాడు, సర్. కూతురు కిడ్నాప్ చేయబడిందన్న దుర్వార్తని వర్మ యెలాగో తట్టుకోగల్గాడు. కానీ ఇప్పుడు ఆమెను రక్షించుకొనే ప్రయత్నంలో అంతె డబ్బునీ పోగొట్టుకోవడంతో ఇక.. అనూహ్యంగా ఏర్పడ్డ ఆ అగమ్యగోచర స్థితిలో అవకాశాలు వ్యంగ్యంగాతోస్తే, అతని బలహీన హృదయంపై అవేలాంటి ప్రభావాన్ని చూపుతాయి, సర్!

కానీ జోసఫ్ నోరు విప్పడంలేదు. మన సందేహాన్ని తీర్చడంలేదు. అలా శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడంతే. నాకు మాత్రం ఆ కెమికల్ కంపెనీ వర్మ ఇతడే నన్పిస్తోంది, సర్. అందుకో బలమైన ఆధారం దొరికింది. కాలేజి రిజిష్టరులో అతని పేరూ ఊరూ తప్ప మరే వివరాలు లేవు. కానీ, జోసఫ్ దగ్గర నేను కనులేశ్వర్, పరమేశ్వర్ ల పేర్లు ప్రస్తావించినప్పుడు అతని ముఖంలో మార్పు వచ్చింది....కళ్ళు అదోలా మెరిశాయి. పళ్ళు అప్రయత్నంగా నూరాడు. ఆవేశం, సర్. పాత కక్ష."

"దట్స్ కరెక్ట్, ఇన్స్పెక్టర్ పాత కక్ష."

"వాళ్ళెవరో జోసఫ్ కి తెలుసు, సర్. తన బాస్ ని ఫ్రాడ్ చేశారు. ఇప్పుడు కూతుర్ని కిడ్నాప్ చేశారని అనుమానించాడు. అతని కక్ష మరింత పెరిగింది. అయితే మనకే వివరాలు చెప్పి సహాకరించడంలేదు. అతని ఉద్దేశాలు వేరే వున్నట్లున్నాయి. తన బాస్ చావుని రహస్యంగా వుంచమంటున్నాడు. కిడ్నాపర్స్ నుంచి మళ్ళీ ఫోన్ రావచ్చు డబ్బుకోసం. అలా వస్తే మనకు

తెలియజేస్తానన్నాడు. అంతే! అతను అందించే సహకారం—కిడ్నాపర్స్‌నుంచి ఫోనొస్తే బాస్ గొంతుని అనుకరించి మాట్లాడతాడట."

"వెరీవెల్. అయితే ఈ వెంకట్ సంగతేమిటి? ఆ బ్రదర్స్ కారు నెంబర్ ఇతడి జేబులోకి ఎలా వచ్చింది?"

"వాళ్ళు అతన్ని వాడుకున్నట్లు అనుమానం, సర్."

"అంటే అతను పిక్‌పాకెట్ కాదన్న మాట అప్పుడు?"

"అవును, సర్."

"మరెందుకలా పురికాడు డీకొట్టి డబ్బుతో—?"

"బహుశ—"

"చెప్పండి, ఇన్‌స్పెక్టర్."

"అయాం సారీ, సార్, ఇందులో మా పొరపాటు కూడా ఉండొచ్చు. మా వల్లే అది అవ్ సెటయి ఉండొచ్చు.... పార్డన్ మీ, సర్."

కమీషనర్ అర్థమైందన్నట్లు తలూపాడు, "వెల్.... విచారించకండి, మిస్టర్ శేశన్. జరగవలసింది జరిగిపోయింది. ఇప్పుడు జరగబోయేది ఆలోచించండి. ఇప్పుడు వర్మ కూతురుకు అపాయం హెచ్చినట్లు అనిపించడం లేదా మీకు? ముందా బ్రదర్స్‌మీద అనుమానం పూర్తిగా రూఢి చేసుకోండి!"

## 13

వినోద్ నిర్ఘాంతపోయి చూశాడు వాళ్ళని!

"ఏమన్నారూ, వెంకట్ చచ్చిపోయాడా!"

"అవును, వినోద్" కమలేశ్వర్ గొంతిగాడు అస్పష్టంగా. అతని తమ్ముడు భయం భయంగా చూస్తూ నిలబడ్డాడు దూరంగా, "నేనిలా జరుగుతుందనుకోలేదు!

డబ్బంతా పోయింది, వాడూ పోయాడు!"

"ఎలా, ఎలా జరిగిందిది?" వినోద్ కేక పెట్టాడు ఆవేశంగా. అతని పిడికిళ్ళు బిగుసు కున్నాయి. కళ్ళు యెర్రగా మండుతున్నాయి. "ఈ సంగతి రాత్రే ఎందుకు చెప్పలేదు? మీరిక్కడికి వెంటనే యెందుకు రాలేదు?"

"అయాం సారీ, వినోద్" కమలేశ్వర్ వినోద్ చెయ్యి పట్టుకున్నాడు, "ఇది వెంటనే నీకెలా చెప్పాలో తోచలేదు. వర్మ డబుల్ క్రాస్ చేశాడు. అతని మనిషితో పాటు పోలీసుల్ని పంపాడు. వెంకట్ వాళ్ళని చూసి బెదిరిపోయాడు. బ్రీఫ్ కేసు లాక్కొని పరుగెత్తాడు— ముందు వెనుకా ఆలోచించకుండా. ఆ కంగారులో అప్పుడే అటు మళ్ళుతోన్న బస్సుని చూడలేదు వాడు— దాని కిందికి వచ్చేశాడు! ఓహ్, చాలా ఘోరం, వినోద్. తల పచ్చడయ్యిందక్కడే! బ్రీఫ్ కేసు ముక్కలై దూరంగా పడింది! డబ్బంతా జనం పాలయింది! అయిదు లక్షలు! తలచుకుంటేనే... ఓహ్, నువ్వే వూహించుకో వినోద్!"

వినోద్ రాయిలా వుండిపోయాడు కొన్ని క్షణాలు...

"మీరబద్ధం చెబుతున్నారు. ఆ డబ్బు తీసుకొని మీరే చంపేశారు!"

"కాదు! నువ్వెళ్ళి వాకబు చేసుకోవచ్చు, ఆ సంఘటన!"

"నో, వాడలా చెయ్యడు! పోలీసుల్ని చూసి వాడు బెదిరిపోయాడా! వాడంత తెలివితక్కువపని చేస్తాడా! అక్కడ పోలీసుల్ని చూసివుంటే వర్మ మనిషిని కలిసే వాడు కాదు! వెనక్కువచ్చి ట్రాప్ మీకు చెప్పేవాడు! నో, అలా జరుగలేదు! వాడు పోలీసుల్ని చూసి పరు

గత లేదు—"

"మరేం చూసి పరుగెత్తాడలా క్రైట్? పిక్ పాకెట్ సైపుణ్యం చూపాలనుకున్నాడా? వాడికి నేనేం చెప్పాను? కోడ్ వర్డుతో తనని ఐడెంటిఫై చేసుకొని రహస్యంగా తెమ్మన్నాను బ్రీఫ్ కేసు!"

"నేను నమ్మను. వెంకట్ అలా చెయ్యాడు. మీరే వాణ్ని చంపేశారు!"

"నీకు పిచ్చిపట్టింది! వెళ్ళి కనుక్కో — ఏం జరిగిందో?"

"తెలుసుకుంటాను. ఇందులో మీరేదైనా ట్రిక్ చేసినట్లు తెలిస్తే పీకపిసికి చంపేస్తాను!"

"నీకు నిజంగా పిచ్చెక్కింది! ట్రిక్ దేనికి—అయిదు లక్షలు పోగొట్టుకోడానికా!"

వినోద్ ఉలిక్కిపడ్డాడు. ఒక్క క్షణం వాళ్ళని తదేకంగా చూశాడు. ఉన్నట్టుండి ఫకాలున నవ్వాడు. పగలబడి నవ్వసాగాడు....

"పడ్డారు బొక్కలో! కుదిరింది మీ రోగం!"

అన్నదమ్ములు కలవరపడ్డారు.

"ఏమిటి నువ్వనేది? ఏం జరిగింది?"

వినోద్ ఇంకా నవ్వసాగాడు. "వెంకట్! ఎంతపని చేశావు! ఈ దీనుల్ని ఇలా ఇరికించి పోతావా! వీళ్ళ గతేం కానిప్పుడు!"

"అన్నయ్యా, ఆ నవ్వాపమను?"

"బాస్టర్డు, ఏమిటి వాగుతున్నావ్?"

వినోద్ వాళ్ళని వెటకారంగా చూశాడు. "మీ ఆపరేషన్ గోవిందా! వందన సమర్పణ చేయుండిక! మీకు గుర్తుందా—మొన్న రాత్రి దారికాచి మిమ్మల్ని

దోచుకున్నప్పుడు మీ కారు నెంబరు వ్రాసుకున్నాం—ఆ తర్వాత నా ఇంటికి వచ్చి నువ్వు గర్వంగా చెప్పావు? అదిగో, ఆ నెంబరు వెంకట్ నోట్ బుక్‌లో వుంది. అది వాడి జేబులో వుంది. అంటే ఇప్పుడు పోలీసుల చేతిలో పడింది! వూహించుకోండిక!

"ఆ నెంబర్‌తో వాళ్ళు మీ కారుని ట్రేస్ చేశారంటే—ఒక పిక్‌పాకెట్ వెంకట్‌తో మీకు కనెక్షన్ ఏమిటా అని మీ కొంపకొస్తారు-మిమ్మల్ని ఇంటరాగేట్ చేయడానికి! అప్పుడు మీరేదో బొంకి తప్పించుకో జూస్తారు. కానీ వాళ్ళు మీ కారు టైర్ ప్రింట్స్‌ని తీసుకున్నారంటే—అవి మేం కిడ్నాప్ చేసిన స్థలంలో ప్రింట్స్‌తో సరిపోయాయంటే — ఓహ్, చూసుకోండప్పుడు! పద్దారు బొక్కలో!"

అన్నదమ్ములిద్దరు కొయ్యబారిపోయారు. చెమటలు కారుతున్నాయి.

"మనం ఇంటికెళ్ళొద్దన్నయ్యా!"

కమలేశ్వర్ తేరుకొని వినోద్ భుజం తట్టాడు. "అవును, నేనది ఆలోచించలేదు. మేమిప్పుడు ఇంటికెళ్ళం. ఇక్కడే వుండిపోతాం. ఈ ఇల్లు ఎవరికీ తెలీదు__"

వినోద్ వినోదంగా చూశాడు. "ఎందుకు భయపడతారు? మీ కారు నెవరో దొంగిలించారని చెప్పలేరా? మీ స్టేటస్, డబ్బూ చూసి మీరు తప్పుడు పనులు చేస్తారని వాళ్ళు అనుమానిస్తారనుకోను."

"మేం వాళ్ళకంట పడమంటే!"

"ఓహ్, మీ గట్స్‌ని ఇప్పుడే తెలుసుకోగల్గుతున్నాను. ఇంత పిరికివాళ్ళయితే అడ్వెంచర్ కెలా వూను

కున్నారు మహానుభావులూ! ఇప్పుడేమిటి కార్యక్రమం? ఇహ జరగబోయేది ఆ పైన వెంకటేశ చూస్తాడను కుంటాను——"

"వినోద్, మమ్మల్ని నమ్ము. వాడు మా పొరపాటు వల్ల చావలేదు. తన చావుకి తనే బాధ్యుడు. అనుకోని యాక్సిడెంట్. అసలు వర్మ పోలీసుల్ని పంపడం పెద్ద తప్పు. అతన్ని హెచ్చరించాం కూడా. లెక్క చెయ్యలేదు. ఇప్పుడు మేము రెట్టింపు డిమాండ్ చేస్తున్నాం! పది లక్షలు! వింటున్నావా? అప్పుడుగానీ ఆ కూతుర్ని వదిలిపెట్టం! మాకిప్పుడు పది లక్షలు కావాలి!"

వినోద్ లేచాడు. "సరే, అలాగే, మీకేం కావాలో చూసుకోండి. నేను పోతున్నాను."

"ఎక్కడికి?" కమలేశ్వర్ అతన్ని ఆపాడు.

"సిటీలోకి! ఇక్కడ విసుగుపుడుతోంది. తిని దిక్కులు చూస్తూ కూర్చోడమేనా నా పని? ఘోంత్! పిచ్చెక్కుతోంది. ఏ చుక్క వాళ్ళోనో రిలాక్స్ అవకపోతే నేను మనిషిని కాలేను. రాత్రికి తిరిగివస్తాను. అప్పటికి బాగా ఆలోచించి స్మితను వదిలేసి మనం క్షేమంగా గుడ్ బై చెప్పుకోవాలో, లేక మరో డిగ్రీ పెరిగిన మీ డబ్బు పైత్యంతో నాశనమైపోతారో నిర్ణయించుకోండి!" వినోద్ కదిలాడు.

"ఆగు, వినోద్!" కమలేశ్వర్ అడ్డువెళ్ళాడు, "నువ్వు అర్థం చేసుకో! ఇంత కష్టపడి చేతికొచ్చే ఫలాన్ని వదులుకుంటామా! తప్పు మనదికాదు, వాళ్ళదే! మనం పరిహారం కోరుతున్నాం. అత్యాశ కాదు!"

వినోద్ వాళ్ళని సాలోచనగా చూశాడు.

"వినోద్, ఇప్పుడు మనం జాబ్ మానుకునే ప్రశ్న లేదు. పూర్తి చేసితీరాలి. ఫలితం సాధించాలి. ఆ పది లక్షల్లో నీకు లక్ష ఇస్తాం, ఆలోచించు."

వినోద్ ఆసక్తిగా చూశాడు "లక్షా?"

"అవును, లక్ష! ఆలోచించు, ఎన్నాళ్ళు కష్టపడితే వస్తాయవి?"

వినోద్ ఆలోచించి అన్నాడు. "రెండు కావాలి?"

"యూ .... మితిమీరుతున్నావు."

"మనిషికి చేతులు రెండు. కుడిచెయ్యి తీసుకుంటే ఎడమచెయ్యి వూరుకోదు. రెండు చేతులా సంపాయించడ మంటారు దీన్నే."

కమలేశ్వర్ అసహనంగా చూశాడు. "నిన్నిప్పుడు సాధించే ఓపిక లేదు—అలాగే ఏడుప్!"

"ఈసారి డబ్బెవరు కలెక్టు చేస్తారు?"

"నువ్వే!"

"అప్పుడు నాకు రెండు లక్షలూ, మళ్ళీ మరో ట్రాప్‌లో ఇరికించకుండా ఆ ఫోటో నెగెటివ్‌లూ నాకిచ్చేస్తాగా?"

"ఇచ్చేస్తాం. విను, నువ్విప్పుడు బైటకెళ్తున్నావ్—వర్మకు ఫోన్ చేస్తావా? మేం వెళ్ళడం మంచిదికాదు. ఏమంటావు?"

"ఏమని?"

"డబ్బుకోసం—రెట్టింపు డిమాండ్ చెయ్యి! బాగా తిట్టు! కూతురు బ్రతకాలనుందా లేదా వాడికి? వుంటే పోలీసుల్ని వెళ్ళగొట్టమను! వాళ్ళమూలాన మనమని షెలా చచ్చాడో చెప్పు! అందుకు పరిహారంగా ఇంకో అయిదు లక్షలు డిమాండ్ చెయ్యి! మొత్తం పది! రేపు రాత్రి

వరకు గడువుపెట్టు! రేపు సాయంత్రం మళ్ళీ ఫోన్ చేస్తాం. డబ్బు రెడీ అయితే ఎలా అందివ్వాలో అప్పుడు తెలియజేస్తాం. గట్టి వార్నింగ్ ఇవ్వు! తెలివిమీరి మళ్ళీ ట్రిక్కులుచేస్తే ఈసారి కూతురు కనికరం లేకుండా సఫా! అర్థమవుతోందా నే చెప్పేది...."

# 14

వినోద్ చెప్పిందంతా ఆ మధ్యాహ్నం పన్నెండుం న్నరకు జోసఫ్ ఫోన్‌లో విని, పోలీసులకు తెలియ జేశాడు. ఫోన్‌లో అతను బాస్ గొంతు అనుకరించి చక్కగా మాట్లాడాడు. అవతల కిడ్నాపర్‌కి ఏ అను మానమూ రాలేదు.

బాస్ మరణం నిజంగా వాళ్ళకు తెలీదు. కిడ్నాపర్ ఆదేశాలన్నీ 'ఒప్పుకొని' తు.చ. తప్పకుండా అలాగే చేస్తానన్నాడు.

ఆ తర్వాత పోలీసులకు ఆ ఫోన్ కాల్ వివరాలన్నీ ఫోన్ చేసి తెలియచేశాక, గారేజికి తాళంవేసి, చకచకా నడిచి టాక్సీస్టాండువైపు సాగిపోయాడు....

ఇన్స్‌పెక్టర్ నేశన్‌కు కిడ్నాపర్ కాల్‌తో కొన్ని సందేహాలుతీరి, జోసఫ్‌ని అభినందించి, ఆఫీసులోంచి బయటపడి, వేగంగా కొన్ని స్థలాలు తిరిగి తృప్తికరమైన సమాచారాన్ని సేకరించి, ఆ మధ్యాహ్నం మూడున్నర గంటలకు కమీషనర్ ఎదుట హాజరయ్యాడు.

"సర్, నిన్న ఆక్సిడెంట్‌లో చచ్చిన మనిషి తమ వాడేనని కిడ్నాపర్ ఫోన్‌లో ఒప్పుకోవడాన్నిబట్టి వెంకట్ గురించి మన సందేహాలు తీరిపోయాయి. అతను ఒక జేబు దొంగగా ఆ డబ్బుని కాజేయబోలేదు, కిడ్నాపర్స్‌లో ఒకడుగా వచ్చాడు. కానీ అక్కడ మా

వునికి ఎలాగో పసిగట్టి బెదిరిపోయాడు. ఫలితంగా అతని చావు.

"సర్, ఈ కిడ్నాపింగ్‌లో అతని సహచరులు ఆ అన్నదమ్ములని కూడా ఇప్పుడు ధృవపడుతోంది.... నేను వాళ్ళ నివాసానికి వెళ్ళాను. కానీ తాళంవేసి వుంది. అక్కడ నిఘా పెట్టించాను. అక్కడ వాళ్ళ కారు టైర్ ప్రింట్స్ సేకరించాను, సర్. అవి కిడ్నాపింగ్ స్పాట్‌లో మనకు దొరికిన ప్రింట్స్‌తో సరిపోతున్నాయి...."

"వెరీ వెల్."

"కానీ జోసఫ్ ఇప్పటికీ నోరు విప్పడంలేదు. ఆ అన్నదమ్ము లెవరో తెలియదంటున్నాడు. దాస్తున్నాడు, సర్. ఏదో ఉద్దేశ్యముంది. ఆ ఫోన్ కాల్‌లో గొంతు కూడా ఎవరిదో తెలియదంటున్నాడు. అయితే ఆ ఫోన్ కాల్ గురించి చెప్పి సహకరించాడు.

"మన అంచనా తప్పకుంటే కిడ్నాపర్స్‌ని ఈ రోజు పట్టుకోగలం, సర్. వాళ్ళింట్లోలేరు. ఆమెను వేరేచోట బంధించి వుంటారు. జైలునుంచి వచ్చి వాళ్ళి సిటీలో ఎందుకు సిరపడ్డారో అరంగావడంలేదు. ఏదో కారణాన దేశం వదిలి వెళ్ళలేకపోయుంటారు. ఆ మూడున్నర లక్షలూ ఖర్చుపెట్టి ఇక్కడ కారూ ఇల్లూ తీసుకొని వుంటారు. ఇక్కడ వాళ్ళ కార్యకలాపాలేమిటో ఇంకా వెలుగులోకి రాలేదు, సర్. ఇరుగుపొరుగువాళ్ళు ఏమీ చెప్పలేకపోతున్నారు....

"వాళ్ళు తలదాచుకొంటున్న స్థలం ఎక్కడో తెలుసుకునే ప్రయత్నంలో వున్నాం, సర్, ఒంటి గంటకు ఒక రిపోర్టు అందింది సర్, హాయత్‌నగర్

స్టేషన్ నుంచి——"

"ఏమని?"

"మిస్సింగ్ పర్సన్ కేసు, సర్. ఆ ప్రాంతాలవుండే అగ్గిరవ్వ సోములు అనే అతను కన్పించడంలేదు నిన్నట్నుంచీ. నిన్న మధ్యాహ్నం కొడుకు రిపోర్టిచ్చాడు. వాళ్ళకు అక్కడ కనగపాలముంది. మొన్న సాయంత్రం తండ్రి పొలానికెళ్ళి రాత్రి అక్కడే వుండిపోయాడు. కానీ మర్నాడు మధ్యాహ్నం వరకూ రాకపోవడం చూసి కొడుకు వెళ్ళాడట. తండ్రి కన్పించలేదు. గుడిసె ముందు ఇద్దరు కూలీలు కూర్చుని వున్నారట, ఉదయం నుంచీ అతనికోసం ఎదురుచూస్తూ.

"తండ్రి అదృశ్యం అనుమానాస్పదంగా తోచిందట. అక్కడ ట్రాన్సిస్టర్ ఆన్‌లో వుందట. లాంతరు వత్తి కాలిపోయిందట, ట్యాంక్‌లో కిరోసిన్ లేదు. పక్క వేసింది, కానీ నలగలేదు. దీన్నిబట్టి అతను రాత్రినుంచి లేడని అర్థమైందట. అంతే, నిన్నంతా అతను తిరిగి రాలేదు——"

"వెల్?"

"ఇవాళ పన్నెండు గంటలకు అక్కడే పొలంలోని బావిలో తేలిందట సర్, అతని శవం. మొన్న రాత్రి దేనికో అటువెళ్ళి పొరపాటున అందులోకి పడిపోయాడనుకున్నారు. అమావాస్య రాత్రి, సర్. తండ్రికి ఈత రాదని కొడుకు అంటున్నాడు.

"కానీ డాక్టర్ వేరుగా అంటున్నాడు, సర్. అతను బావిలోపడి చావలేదట. ప్రాణంపోయాక పడ్డాడని—— పారవేయబడ్డాడని డాక్టర్ నిశ్చితాభిప్రాయం. గొంతు పిసకబడిందట. కాని మెడమీద వేలిముద్రలులేవు. నీటిలో

చెదిరిపోయాయి. చావు మున్న రాత్రి జరిగివుండ వచ్చునట....అయితే సర్, హతుని చేతిగోళ్ళలో చర్మపు పోగులు ఇరుక్కొని వున్నాయట—"

"చర్మపు పోగులా?"

"అవును, సర్. అవి తీసి భద్రపరిచారు. లాబ్‌కి పంపుతున్నారు. ఆ పోగులు ఛాతీ ప్రాంతంలోనివని అంటున్నారు....హంతకుడి ఛాతీ. హంతకునితో పెనుగులాటలో హతుడు గాయపర్చి వుంటాడట .... సర్, ఇక్కడ మరో విషయం గమనార్హం. నిన్న ఆక్సిడెంట్‌లో చచ్చిన వెంకట్ ఛాతీమీద రక్కులున్నాయి...."

"ఈజిట్?"

"అవును, సర్. అతని ఛాతీ మీద ఏడు రక్కులున్నాయి. అతని షర్టుపై గుండీ ఒకటి తెగిపోయింది. అతని రంగు నలుపు. ఆ చర్మపు పోగులు కూడా నలుపే. ఈ రెండు కేసులకీ సంబంధముందనిపిస్తోంది, సర్. వెంకట్ కిడ్నాపర్స్ మనిషి. అతని వంటిమీద రక్కులు ఈ హతుని గోళ్ళలో చర్మపు పోగుల్నిబట్టి చూస్తే ఈ హత్యకు కిడ్నాపర్స్ కారణమనిపిస్తోంది....అంటే సర్, ఇది కిడ్నాపర్స్ ఉనికిని హతుని నివాస ప్రాంతాల్లో సూచిస్తోంది."

"మోటివ్, ఇన్స్‌పెక్టర్?"

"హతుడు తన సమీప పరిసరాల్లో కొత్త వ్యక్తుల సందడిని గమనించి కుతూహలంతో వెళ్ళి వుంటాడు. చూడకూడనివి చూసివుంటాడు. హంతకులు అతని నోరిలా నొక్కేశారు. వెంకట్ చేసి వుంటాడు సర్, ఈ పని."

"దటీజ్ రైట్. కిడ్నాపర్స్ నెలవు ఆ ప్రాంతం

లోనే వుంటుంది. ఇది మీకు పరీక్షా సమయం. వర్మ పోయాడు. ఇప్పుడా కూతుర్ని కాపాడగలరా క్షేమంగా? ఆ బాధ్యత మీకే వదులుతున్నాను. ఆమెని సురక్షితంగా తీసుకురావాలి. మరి కొందర్ని తీసుకోండి- ఇన్స్పెక్టర్ రాజు, మోహన్ రావ్‌లను, చీకటిపడ్డాక యాక్షన్‌లోకి దిగండి. ఈ లోపు ఆ ఇంటిని అతి రహస్యంగా ఆరా తియ్యండి. అప్పుడు .... చాలా గుట్టుగా, గట్టి బందోబస్తుతో వెళ్ళి దాడిచెయ్యండి. ఇట్ మస్ట్ బి ఎ వెల్ టైమ్డ్ సర్ప్రైజ్ ఎటాక్!"

* * *

రాత్రి యెనిమిది గంటలకు జోసఫ్ హెడ్ క్వార్టర్స్ నుంచి బయల్దేరిన పోలీసు వాహనాల్ని అతి నేర్పుగా ఆటోలో వెంబడించసాగాడు. అతని కళ్ళు తీక్షణంగా వున్నాయి.

ఉదయంనించీ పోలీసు చర్యల్ని అతను శ్రద్ధగా గమనిస్తూ వచ్చాడు. తన ప్రయోజనాల మేరకు వాళ్ళకు సహకరించాడు. వాళ్ళు ఫలితాన్ని సాధించారు, కానీ ఆ ఫలితంతో ప్రయోజనం పొందేదెవరు? అతని పెదవులపై విషపు నవ్వు విరిసింది....

కాటేజినుంచి వస్తూ అతను అక్కడ సర్వీస్ బాయ్‌కీ వాచ్‌మన్‌కీ ఇది లంచం అని ధైర్యంగా చెప్పి భారీ మొత్తంలో డబ్బు ముట్టజెప్పాడు. ఎవరైనా వచ్చి ప్రశ్నించడం జరిగితే, తను రాత్రంతా కాటేజిలోనే వున్నట్లు చెప్పాలి.

ఇప్పుడతను ఆటోలో వెంటాడుతున్నాడు పోలీసుల్ని.

అతని నోట్లో సిగరెట్ వెలుగుతోంది, ప్యాంటు కుడి జేబులో అతని ప్రియమైన రివాల్వర్. సైలన్సర్

అమర్చబడి....అందులో రెండేరెండు గుళ్ళతో. అతని గురిమీద అంత నమ్మకం!

## 15

రాత్రి యెనిమిది గంటలకు తిరిగివచ్చాడు వినోద్.

అతని మనసంతా చికాకుగా, యెలాగో వుంది. ఉన్నారుమని ఇంట్లోకి అడుగుపెట్టి, లాంతరు గుడ్డి వెలుగులో కమలేశ్వర్‌ని చూశాడు. అతడెందుకో కలవరంగా చూస్తున్నాడు.

వినోద్ నవ్వి, "ఎలావుంది మీ పంజరంలో చిలుక?" అన్నాడు.

కమలేశ్వర్ తేరుకున్నాడు. కాని అతని కంగారు పోలేదు.

"నువ్వు—నువ్వు ఇప్పుడెందు కొచ్చావ్?" గద్దించాడతను.

"అంటే?" వినోద్ అన్నాడు అర్థంగాక.

"ఎప్పుడో అర్థరాత్రికొస్తావనుకున్నాను...."

వినోద్ ఫకాలున నవ్వాడు, "ఓహ్, అనుకున్నట్లే జరగాలనుందా? ఇవ్వాళ పిచ్చుకలన్నీ తెగ బిజీగా వున్నాయి. నా స్వీట్ గర్ల్ మోహిని మరో పెద్ద పార్టీ తగిలి వెళ్ళిపోయింది. నా జేబులో లాగి తంతే పంద కూడా లేవు. మీ డబ్బు వస్తేనే రంభయినా దిగివచ్చేది. ఈ రోజు మంచిదికాదని తిరిగొచ్చేశాను."

"యూ ఆరే అగ్లీ బాస్టర్డు!"

"కాదు, నా పుట్టుక మంచిదే. పెరిగి చెడ్డాను. మీరింకా చెడగొడ్తున్నారు" వినోద్ అన్నాడు అతన్ని ఇంకా పరీక్షగా చూస్తూ, "కానీ మీ రెండుకంత కంగారుగా వున్నారు? ఏం జరిగింది? శవంగాని బైట

పడిందా? దాన్ని వాడి బావిలో నే పడేశాను——"

కమలేశ్వర్ ఉలిక్కిపడ్డాడు, "శవం బైటపడిందా? ఏమో నాకు తెలియదు! మేం ఇల్లు కదల్లేదు!"

నవ్వాడు వినోద్. "మీ కెంత భయం! శవం ఎప్పుడైనా బయటపడవచ్చు. నాకేం తెలుసు? మన ఆపరేషన్ నిన్న రాత్రే ముగుస్తుందనుకున్నాను. రెండు రాత్రులు ఉండిపోవలసి వచ్చిందిప్పుడు. శవం ఎప్పుడైనా పైకి తేలవచ్చు. రేపు సాయంత్రంలోగా తేలిందా...."

"తేలకుండా చెయ్, వెళ్ళు ఇప్పుడే!" కమలేశ్వర్ అతని చెయ్యిపట్టి లాగాడు.

వినోద్ విడిపించుకుని చుట్టూ చూశాడు. అతనివైపు తిరిగి అన్నాడు, "జోక్ కరేడి?"

కమలేశ్వర్ బెదిరిపోయాడు, "వెళ్ళు త్వరగా!" అరిచాడతను.

వినోద్ కళ్ళు స్మిత గదితలుపు మీద పడ్డాయి.

దానికి తాళంలేదు. గొళ్ళెం కూడా పెట్టబడిలేదు.

వినోద్ విసురుగా వెళ్ళి తలుపు నెట్టాడు. కిర్రున తెరచుకుంది.

కమలేశ్వర్ విభ్రాంతితో బొమ్మలా వుండిపోయాడు.

వినోద్ గదిలో అడుగుపెట్టి కొయ్యబారిపోయాడు—

అక్కడ పరమేశ్వర్ మంచంమీదికి వంగి గబగబా కట్లు విప్పుతున్నాడు.

గదిలో అలికిడికి అతను హడలిపోయి అక్కడ్నుంచి దూకి బైటికి పరుగుతీశాడు. అతని మెడలో వ్రేలాడుతోన్న కెమెరా వచ్చి వినోద్ రొమ్ముకి తగిలింది. వినోద్ తేరుకొని గాభరాగా ముందుకు సాగాడు.

స్మిత మంచంమీద వెల్లకిలా పడివుంది. ఆమె కాళ్ళు

చేతులు కట్టివేసివున్నాయి. నోట్లో గుడ్డలు కుక్కి వున్నాయి. ఆమె ఒంటిమీద బట్టలేవు.

ఆమె కళ్ళల్లో అంతులేని భయాందోళనలు వ్యక్త మవుతున్నాయి.

వినోద్ చటుక్కున నేలమీద బట్టలు ఆమెమీదకు విసిరి, కట్లు విప్పేసి నోట్లో గుడ్డలు తీసేశాడు.

ఆమె ఒక్క ఉదుటున లేచి అతన్ని చుట్టుకు పోయింది.

"ఓహ్! వినోద్!"

వినోద్ విడిపించుకుంటూ అన్నాడు, "భయపడకు!"

"నన్ను విడిచిపెట్టకు!" అర్చిందామె.

"నే నెక్కడికి పోను, బట్టలేసుకో!" అన్నాడతను, ఆమెను విడిపించుకొని తలుపుకేసి నడుస్తూ. అతని ముఖంలో కర్కశత్వం ఆవరించుకుంది. కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి. అతడి శరీరంలో నరాలన్నీ ఉద్రేకంతో బిగుసుకొంటున్నాయి.

అలా బయటకొచ్చి అతను తక్కున ఆగిపోయాడు.

అక్కడ కమలేశ్వర్ నిలబడి వున్నాడు, చేతిలో రివాల్వర్ గురిపెట్టి.

కొంచెం దూరంలో పరమేశ్వర్ వున్నాడు, భయం భయంగా చూస్తూ.

వినోద్ తేరుకొని అడుగు ముందుకేశాడు.

"కదలకు నువ్వు—కాల్చేస్తాను లేకపోతే!" హెచ్చరించాడు కమలేశ్వర్.

వినోద్ ఆగి తీక్షణంగా చూశాడు. మరో అడుగు ముందుకేశాడు.

"కదలకు, వినోద్, కాల్చేస్తాను" అరిచాడు కమ

లేశ్వర్ మళ్ళీ.

వినోద్ మరొక్క అడుగు ముందుకేశాడు.

"వినోద్, నిన్నే!" కమలేశ్వర్ కేకపెట్టాడు, అతని చేతిలో రివాల్వర్ వణుకుతోంది. "కదలవద్దంటున్నాను! ఈ రివాల్వర్‌ని పేల్చే అవసరం కల్పించకు! రక్తపాతమంటే భయం నాకు. నన్ను హంతకుడ్ని చెయ్యకు. ఆగిపో, వినోద్! ఈ రివాల్వర్‌ని రక్షణకే వుంచుకున్నాను, అఘాయిత్యాలకు ఉపయోగించలేదు!"

వినోద్ ఆగిపోయి అతన్ని ఆపాదమస్తకమూ వింతగా చూశాడు. అతని చూపులు, వాలకం అన్నదమ్ములిద్దర్నీ అదరగొట్టాయి. పరమేశ్వర్ కెమెరా భద్రంగా పట్టుకుని నిల్చున్నాడు. అతని కాళ్ళు వణుకుతున్నాయి.

"వినోద్, నెమ్మదిపడు!" కమలేశ్వర్ అన్నాడు గొంతుపెగల్చుకొని. అతని చేతిలో రివాల్వర్ ఇంకా నిలవడంలేదు, "నువ్వలా చూడకు! మనం మిత్రులం— నా మాట నమ్ము. ఆమెకు ఏ హానీ చేయలేదు. చెయ్యమని నీకు మాటిచ్చాం, అవునా? ఆమె నే అడుగు. ఆమెను ఏమీ చేయలేదు. ఫో....ఫోటోలు మాత్రమే తీశాం. దీనికే నువ్వంత ఉద్రేకపడనవసరంలేదు, శాంతించు. మనం మిత్రులం. ఈ సమయంలో పోట్లాడుకుంటే మనకే నష్టం! మనం లక్షలు గడించబోతున్నాం, అవునా? నీకెంత కావాలి, అయిదు లక్షలా....?"

వినోద్ అలాగే చూస్తున్నాడు తీక్షణంగా.

"వినోద్, వర్మ మమల్ని జైలుకు పంపాడు. ఆ గుండె మంటతో ఈ కిడ్నాప్ చేశాం. అతని కార్యకలాపాల్ని మేం జాగ్రత్తగా గమనించాం. అతనిక్కడికొస్తున్నట్లు తెలిసి ఈ పథకం వేసుకున్నాం. అతని కూతురు పెళ్ళి

నిశ్చయమైంది. రెండు నెలలో జరగబోతోంది. ...

"ఈ కూతుర్ని ఎత్తుకొచ్చి డబ్బు రాబట్టుకోవడమే గాకుండా, ఆ పెళ్ళి చెడగొట్టి బ్రతికున్నంత కాలం అతనికి దుఃఖాన్ని కల్పించాలనుకున్నాం. అందుకే ఇప్పుడు ఫోటోలు తీశాం. వాటిని మగపెళ్ళివారికి పంపుతాం. బూతు పత్రికలకి అమ్ముతాం. ఆమె కిడ్నాప్‌ని బాగా ప్రచారం చేస్తాం. జీవితంలో ఆమెకు పెళ్ళికాదు.

"ఆ దెబ్బతో వర్మ మంచం పడతాడు. అప్పుడు చూడాలి వారి స్థితి! ఆ మంచంలోనే కృంగి కృశించి చచ్చిపోతాడు. మాకదే కావాలి! మాకప్పుడే తృప్తి! అయితే ముందు చేయవల్సింది అతన్నుంచి డబ్బు రాబట్టుకోవడం. సాధ్యమైనంత ఎక్కువగా! నిన్న కొంత రాబట్టుకోవాలనుకున్నాం కానీ—"

అతను హఠాత్తుగా ఆపేసి నాలుక కరచుకున్నాడు. వినోద్‌ని బెదురుగా చూశాడు చెమటలు తుడుచుకుంటూ.

వినోద్ ఉలిక్కిపడ్డాడు. ఉన్నట్టుండి చలించి పోయాడు.

"యూ బాస్టర్డ్!" అరిచాడతను గట్టిగా, "ఎంత పని చేశారు! ఎంతకు తెగించారు! నిన్న కొంత డబ్బు రాబట్టుకోవాలనుకున్నారా! అంటే ఇవ్వాళ కూడా మరి కొంత రాబట్టుకోవాలనుకున్నారు కదూ? స్మితను నిన్న విడిచే పెట్టే ఉద్దేశ్యం మీకు లేదు! యూ కన్నింగ్ బాస్టర్డ్! నా నేస్తం — వెంకట్‌ని అలా చంపారా! వాణ్ని కావాలని వర్మ మనిషికి డాష్ ఇచ్చి డబ్బు లాక్కు రమ్మన్నారా! అది చూసి వర్మ నిజంగా నే ఎవడో పిక్‌పాకెట్ పని అయుంటుందనుకుంటాడను కుంటున్నారా! అప్పుడు మీరేం ఎరగనట్లు ఈ రోజు

కిడ్నాపర్స్‌గా వెళ్ళి అసలు డబ్బు తెచ్చుకోవాలను కున్నారా!

"కానీ వెంకట్ అనుకోకుండా ఆక్సిడెంట్‌లో చావ డంతో పోలీసుల్ని చూసి పారిపోయాడని కట్టుకథతో నమ్మిస్తున్నారా! ఆ బ్లేమ్ వర్మమీదకు తోసి ఇప్పుడు రెట్టింపు డబ్బు డిమాండ్ చేస్తున్నారా! మీరు మనుషులు కారు, వెధవల్లారా! నా నేస్తాన్ని పొట్టన బెట్టు కున్నారు! మీ పగ—డబ్బు యావతో వాడి ప్రాణాలు తీశారు!"

"వినోద్ ప్లీజ్, ఆవేశపడకు....ఆ పొరపాటు ఒప్పు కొంటున్నాను. మేం అనుకొన్నదొకటైతే జరిగింది...."

"ఓహ్, మీ నిజరూపం ఇప్పుడే తెలుస్తోంది! చీట్స్! ఫ్రాడ్స్! కిల్లర్స్! జైల్ బర్డ్స్! నన్ను మించిన క్రిమినల్స్! మీ కిరాతకుల కోసం ఒక హత్య చేశాను! జీవితంలో మొదటిసారి ఒకడ్ని చంపాను ఈ చేతులతో! ఇప్పుడీ చేతులు ఎన్ని పాపాలు చేసినా— ఎందర్ని చంపినా—శిక్ష ఒక్కటే!"

అతను విసురుగా ఒక్క అంగలో వెళ్ళి పరమేశ్వర్ కాలర్ పట్టుకున్నాడు. పరమేశ్వర్ భయపడిపోయి కవ్వుమన్నాడు. వినోద్ తన ఉక్కు పిడికిలితో అతని పొత్తి కడుపు కింద బలంగా కొట్టికొట్టి, కసిగా పీక పిసికి వదిలేశాడు.

కమలేశ్వర్ దిగ్భ్రాంతితో చూస్తున్నాడా దృశ్యాన్ని. అతని తమ్ముడు నేలమీదపడి గిలగిలకొట్టుకొని, కొద్ది క్షణాల్లోనే నిశ్చలంగా వుండిపోయాడు.

"ఈ వెధవ నీచానికి పాల్పడ్డాడు!" అరిచాడు వినోద్, అతని మెడలోని కేమెరాలోంచి ఫిల్మ్‌రోల్‌ని

ఎక్స్‌పోజ్ చేస్తూ, "ఆమెను పరాభవం చేసి వినోదించాడీ దరిద్రుడు! వీడి కళ్ళు పీకి చితగ్గొట్టేయ్యాలి—దగాకోరు శనిగొట్టు వెధవ!"

ఫిల్మ్ చుట్టనితీసి ఓ మూలకి విసిరికొట్టాడు వినోద్.

కమలేశ్వర్ అలాగే కళ్ళప్పగించి చూస్తున్నాడు తమ్ముడి శవాన్ని—

"అలా చూస్తావేం? కాల్చు నన్ను దమ్ములుంటే!" అరిచాడు వినోద్ చేతులు పైకి విసిరి, "నేనిప్పుడామెను తీసుకెళుతున్నాను. అడ్డుకో నన్ను దమ్ములుంటే! సవాళ్ళని ముఖాముఖి ఎదుర్కోలేని పిరికి దద్దమ్మలారా, మీకు పగవుంటే ఇలా తీర్చుకుంటారా? తండ్రిమీద పగకు ఏమీ ఎరుగని ఆ అమాయకురాల్ని బలిచేస్తారా? ధూత్! మీరింత నీచంగా, హేయంగా ఆలోచించే అధములను కోలేదు-వెధవల్లారా! ఆమె మీకేం అపకారం చేసిందని? నేను మీకేమని హెచ్చరించాను? ఆమెకేదైనా హాని చేస్తే మీ అంతు చూస్తానన్నాను. చూశావా ఇప్పుడు నీ బఫూన్ తమ్ముడు ఎలా చచ్చిపడున్నాడో!

"కానీ నిన్ను చంపను, మోసగాడా! నీకు దిక్కు తోచని నక్క స్థితిని కల్పిస్తాను. పోలీసులు వేట కుక్కల్లా పడతారు నీ వెంట! నేను స్మితను తీసుకొని వెళ్ళిపోతున్నాను....ఆమెకు నే చేసిన అపకారం చాలు! నమ్ముతావా ఇప్పుడైనా నా ఫిలాసఫీ—సెంటిమెంట్స్! ఆడవాళ్ళకు హాని చెయ్యకూడదనుకున్నాను-చేశాను మళ్ళీ. చూశావా ఇప్పుడు నా పరిస్థితి! హంతకుణ్నయ్యాను—నా జీవితమే ముగిసిపోయిందిప్పుడు!

"కానీ ఒక మంచి పని చేస్తాను. నువ్వనుకున్నట్లు ఆమె జీవితం నాశనం కాదు, యూ డర్టీ రోగ్! ఆమె పెళ్ళి

జరిగితీరుతుంది! లక్షణంగా జరుగుతుంది. ఆమె కే హానీ జరగలేదని లోకాన్ని నమ్మిస్తాను! ఆమె కిడ్నాప్ ని రకరకాలుగా పూహించుకునే దరిద్రుల బూజు వదల గొడ్తాను! బ్రతికుంటే నువ్వే చూస్తావు — ఆమె పెళ్ళి ఎంత వైభవంగా జరుగుతుందో!"

వినోద్ రివ్వున స్మిత గదిని చేరుకొని తలుపుమీద కొట్టాడు.

"స్మిత, నువ్వొచ్చేయ్!" అరచాడతను.

చటుక్కున తలుపు తీసి ఆమె వచ్చేసింది. వినోద్ ఆమె చెయ్యిపట్టుకొని కమలేశ్వర్ వైపు తిరిగాడు. "కమాన్, కాల్చు నువ్వు మమ్మల్ని దమ్ముంటే! ఆపైన నీ చావు నువ్వే చావు! ఆ చప్పుడికి చుట్టుపక్కల జనంవచ్చి పడతారు. కర్రలతో బాది నిన్ను చావగొడతారు! కాచుకో, దమ్ములుంటే!"

వినోద్ స్మితను తీసుకుని బైటికి దారితీశాడు. తమ్ముడి చావు చూసిన షాక్ నుంచి ఇంకా కోలుకోని కమలేశ్వర్, వెళ్ళిపోతున్న వాళ్ళవైపు నిస్సహాయంగా చూస్తూండి పోయాడు. అతని చేతిలో రివాల్వర్ వాలిపోయింది.

బయట అంధాకారంలో అడుగుపెట్టి వాళ్ళిద్దరు గబగబా నడుస్తున్నారు. ఇంకా తొలగని భయంతో స్మిత అతన్ని అంటిపెట్టుకుని అడుగులు వేస్తోంది. వినోద్ ఆమె భుజాన్ని బలంగా పట్టుకుని అభయమిస్తూ దారి చూపిస్తున్నాడు....

చెట్టుమీద జోసఫ్ గురిచూసుకున్నాడు. అతడా చెట్టుమీద పావుగంటనుంచీ ఎదురు చూస్తున్నాడు.

ఇంట్లోంచి ఇప్పుడు బయటకొస్తూన్న ఆకారాల్ని అంత చీకట్లోనూ అతని శక్తివంతమైన కళ్ళు పోల్చు

కున్నాయి. అవి అలా సమీపిస్తూ వుండగా, ఒక ఆకారంపై తన గురిని నిర్దుష్టంగా నిలిపాడు. చాలినంత సమీపంలోకి రాగానే ఆ లక్ష్యంపై అతనికి నమ్మకం కుదిరింది. అప్పుడెంతో ప్రశాంతంగా, తాపీగా, పెద వులపై ఒక తృప్తినిండిన చిరునగవుతో ట్రిగ్గర్ లాగాడు.

వినోద్ తలపట్టుకుని కూలిపోయాడు. స్మిత కెవ్వున కేక వేసి అతని ప్రక్కన కూర్చుండిపోయింది. అతని నుదుట్లో ఏర్పడిన గుండ్రటి రంధ్రంలోంచి విరజిమ్మ తోన్న రక్తాన్ని చూసి మరో కేక వేసింది. వెర్రిగా కేకలు వేస్తూ అతని తల వొళ్ళోకి తీసుకుంది.

ఆమె కేకలు విన్న పోలీసులు కంగారుపడ్డారు. వంద గజాల దూరంలో చెట్టుచాటున ఇంకా దాడికి సన్నా హాలు చేస్తూన్న వాళ్ళల్లా—ఆ అరుపులు విని అటువైపు పరుగుతీశారు. కొందరు స్మిత దగ్గరికి ఉరకగా, ఇం కొందరు ఇంటివైపు దూసుకుపోయారు ఆయుధాలతో.

చెట్టుమీద జోసఫ్ చటుక్కున రివాల్వర్ వదిలేసి తొడపట్టుకుని కెవ్వుమన్నాడు. బాధతో రక్తం తోడేసి నట్లవగా విలవిల్లాడాడు. తన తొడలోకేదో దిగింది బలంగా! తాళలేక అతను పట్టు తప్పి అక్కడ్నుంచి కిందపడ్డాడు.

వినోద్ కళ్ళు తేలిపోతున్నాయి.

అతను కళ్ళు బలవంతాన తెరుస్తూ చుట్టూ చేరిన ఆకారాల్ని చూడసాగాడు.

ఇంటివైపు దూసుకెళ్ళిన పోలీసులు తలుపు మూసి ఉండడం గమనించి, ఆయుధాలు ఎక్కుపెట్టి బయటికి రమ్మని హెచ్చరించాను.

జవాబుగా లోపల పెద్ద ప్రేలుడు ధ్వని వినిపించింది....

## 16

ఇన్స్పెక్టర్ శివకేషన్ రిపోర్టివ్వసాగాడు, మర్నాడుదయం కమీషనర్ కు.

"సర్, ఆపరేషన్ సక్సెసయింది. కానీ మనం ఆశించినట్లుగా కాదు. అక్కడ జరిగిన నాలుగు చావుల్ని నివారించలేకపోయాం. మొన్నటివరకు జరిగిన మూడు చావులు సరేసరి. జోసఫ్ అప్ సెట్ చేశాడు, సర్. మమ్మల్ని వెంటాడి వచ్చాడు. చెట్టుమీద కాచుకుని బైటికొచ్చిన వినోద్ ని కాల్చేశాడు సర్, ఆ చీకట్లో కమలేశ్వర్ గా పొరబడి. ఆ పొరపాటుని తెలుసుకునేలోగా—బాడ్ లక్, సర్—చెట్టుమీద అతనికి పాము కాటేసింది. కిందపడి చచ్చిపోయాడు."

"బ్లడీ ఫూల్!"

"ఆ అన్నదమ్ములతో వినోద్ కేదో బెడిసివుంటుంది, సర్. వినోద్ ఇలాంటి పని చెయ్యడు. ఆడవాళ్ళ జోలికి పోడు. జేబులుకొట్టి బ్రతికేవాడు. జైలుకెళ్ళినప్పుడల్లా తోటి ఖైదీలకూ, జవాన్లకీ తన సెంటిమెంట్స్ బోధిస్తూండేవాడు ఆడవాళ్ళకి హానిచేస్తే పాపమని. ఈ అన్నదమ్ములు తెలివిగా అతన్ని ట్రాప్ చేశారు, సర్. వాళ్ళ బంగళా సోదాలో మాకో ఫోటో దొరికింది.... ఇది చూడండి, సర్...."

కమీషనర్ ఆ ఫోటో చూసి కళ్ళు విశాలం చేశాడు.

"ఈ ఫోటోతో ట్రాప్ చేసి కిడ్నాప్ కి వాడుకున్నారు. కానీ రాత్రి ఏదో బెడిసింది. ఆ ఇంట్లో పరమేశ్వర్ శవం దగ్గర కెమెరా, ఓ మూల ఫిల్మ్ రోల్

పడుతున్నాయి. వాళ్ళు స్మిత కేదో కీడు తలపెట్టి వుంటారు. ఆ కోపంతో వినోద్ అతన్ని చంపేశాడు, పొత్తి కడుపులో గాయపరచి. తమ్ముడి చావుకి చలించి, తమ పథకం ఫ్లాప్ అవడంతో, లొంగుబాటుని భరించలేక కమలేశ్వర్ ఆత్మహత్య చేసుకున్నాడు సర్, తలపై కాల్చుకొని."

"హౌ శాడ్! ఐ పిటీ హిమ్. మరి వర్మ కూతురెలా వుంది?"

"ఆమె చాలా అప్ సెటయింది, సర్. రాత్రి చాలా గొడవపెట్టింది తండ్రిని చూడడంకోసం. రాత్రంతా మన రక్షణలోనే వుంది, సెడేషన్‌లో. ఆమెనిప్పుడే తీసుకు వెళ్తున్నారు సర్ మార్చురీకి, ఆమె తండ్రి కడసారి చూపులకు."

"వెల్, ఇట్ వుడ్ బి యె శాడ్ ఎఫెక్ట్ ఆన్ హర్ మైండ్, ఇన్‌స్పెక్టర్. ఆమె భవిష్యత్తు ఎలా వుంటుందిప్పుడు? మాయా లోకంలో మానవ కాంత! ఈ ప్రపంచంలో ఆమె ఒంటరిగా సాగడానికీ, జీవన పోరాటంలో ఎదిరించి నెగ్గడానికీ, ఆమెకు గొప్ప మనో బలాన్నీ గుండె నిబ్బరాన్నీ ఇవ్వాలని నేను భగవంతుణ్ని ప్రార్థిస్తున్నాను, నేశన్...." కమీషనర్ అన్నాడు భారంగా నిట్టూరుస్తూ.

ఇన్‌స్పెక్టర్ శివనేశన్ శాల్యూట్ చేసి నిష్క్ర మించాడు అక్కడ్నుంచి.

—:ఐపోయింది:—




(గత సంచిక తరువాయి)

వకుళ పేరిట ప్రారంభమైన అన్నదానాలు వీళ

కలవరపరిచాయి.

నిజానికి వకుళ దుష్టశక్తి. ఈమె అన్నదానం వ

సత్కార్యక్రమాలారంభించే అవకాశంలేదు. మరి అలా ఎందుకు జరుగులోంది? వకుళ విషయంలో తమ అంచనా తప్పిందా?

అన్నదానాల గురించి నరో త్తమరావు ఆచూకీ తీశాడు. అతడు చెప్పిన విశేషాలు వాళ్ళకింకా ఆశ్చర్యాన్ని కలిగించాయి.

రఘు అనే యువకుడు అన్నదానాల ఏర్పాటు చేస్తున్నాడు. అతడికీ విషయంలో రాగిణి అనే యువతి చేయూతనిస్తున్నది. త్వరలో వారిద్దరూ వివాహం చేసుకోవాలనుకుంటున్నారు.

అన్నదానాలను వకుళ పేరిట జరిపించడానికి కారణం అతడికి వకుళనుంచి డబ్బు లభిస్తోంది. అతడు వకుళ నెప్పుడూ చూడలేదు. అతడికి తెలియకుండానే ఆమె అతడికి డబ్బు ఇస్తోంది. ఆమె రఘు అకౌంట్లోకి డబ్బు జమకడుతుంది. అతను అందులోంచి డబ్బు విత్ డ్రా చేస్తాడు.

ఇంకో విషయమేమిటంటే—వకుళ పేరిట అతడొక సంఘాన్ని స్థాపించాడు. అది రిజిష్టర్ కూడా చేయించాడు. ఆ సంఘంలో చేరినవారు—సంఘం నిర్వహించే సాంఘిక సేవా కార్యక్రమాల ఖర్చులు భరించాలి. అలా భరించేవారికి వకుళనుండి రక్షణ లభిస్తుంది. అంతే- ఈ షరతు వినగానే సంఘానికి లక్షలకు లక్షలు నిధులుగా లభిస్తున్నాయి. సంఘానికి చాలామంచి ఆశయాలున్నాయి. అన్నింటిలోకీ మొట్టమొదటిది దేశంలో నిరాశ్రయులన్నవారు లేకుండా చేయడం. నా అన్నవారు లేనివారికీ, గతిలేక పరుల పంచన బ్రతికేవారికీ గౌరవంగా బ్రతికే అవకాశం ఈ సంఘం ఇస్తుంది.

దేశంలో పేదరికాన్నీ, నిరుద్యోగాన్నీ రూపుమాపడం ఈ సంఘానికి ఇతర ముఖ్యాశయాలు.

సంఘ సభ్యులకు డబ్బుకు లోటుండదు. కానీ అవినీతి, అన్యాయాన్ని వకుళ క్షమించదు. వకుళ విధించే శిక్షలు మానవాతీతంగా ఉంటాయి. అవంటే సభ్యులకు భయం.

ప్రారంభించిన రెండు మాసాల్లోనే సంఘం ఎంతో బలవత్తరమైనదై — దేశమంతటా దానికి ఉప సంఘాలు ఏర్పడసాగాయి.

సంఘం వ్యవహారాలు చూడడం కోసం దేశమంతటా కొన్ని వేలమంది యువకులు నియమించబడ్డారు. ఆ విధంగా నిరుద్యోగ సమస్యకు ఉడతాభక్తి సాయం లభించింది. ఎందరో పేద విద్యార్థులకు ఫీజులకూ, పుస్తకాలకూ డబ్బునిచ్చింది సంఘం. అనాథలకు అన్నదానం చేస్తుంది సంఘం. డబ్బులేక తమ ప్రతిభకు వ్యాపార రూపమివ్వలేని వారందరికీ ధన సహాయం చేస్తుంది సంఘం.

హైదరాబాదులో వెలసిన ఉపసంఘంలో జనార్దనం అనే సంఘ సభ్యుడు — సంఘం ఆశ్రయం పొందిన రంగమ్మ అనే వనితను బలవంతం చేశాడు. మరునాడు శరీరంలో రక్తంలేకుండా అతడి శవం పడివుంది.

విక్టర్ అనే సంఘ సభ్యుడు సంఘానికి చందాగా వచ్చిన కొండ డబ్బును తనే కాజేశాడు. వకుళ అతడి కుడిచేతిని మెలితిప్పి శాశ్వతంగా అవిటివాణ్ని చేసింది.

సంఘంలో ఎక్కడ దొంగతనాలు జరిగినా, ఎక్కడ అవినీతి తలఎత్తినా వకుళ క్షమించదని దారుణంగా, అమానుషంగా శిక్షిస్తుందనీ సంఘ సభ్యులలో ప్రచార

ముంది. దానితో వారంతా నీతిగా ఉండటానికి ప్రయ త్నించేవారు.

ఈ విశేషాలన్నీ తెలిశాక—"ఇంతకూ వకుళ నావహించింది దుష్టశక్తియా లేక మంచిశక్తియా?" అన్న అనుమానం మహాదేవుడికీ, శివశంకరానికీ కూడా కలిగింది. దుష్టశక్తి గురించి వారనుకున్న అంచనాలన్నీ తప్పినట్లే కనబడుతోంది.

ఇంతకూ వకుళ ఏమయింది? ఆమె రాగిణి, రఘులను వశపర్చుకున్నదా?

జగ్గూను ఆమె ఒకప్పుడు రాగిణి ద్వారానే శిక్షించింది.

"ఒకవేళ రాగిణి వకుళ ఏమో — ఆమె మారు వేషంలో ఉన్నదేమో?" అన్నాడు శివశంకరం.

లింగానికీ ఆలోచన నచ్చలేదు. మెరుపుతీగెలాంటి రాగిణిని పిశాచిగా భావించడం అతడి యువక హృదయానికి అపశ్రుతిలా తోచింది— "వకుళ గురించి మన ఆలోచనలు తప్పేమోననిపిస్తుంది. దేశంలోని పేదప్రజలామెనిప్పుడు ఆరాధిస్తున్నారు. దేశమంతటా వకుళ సేవా సంఘాలతోపాటు — ఆమెకు ఎన్నో అభిమాన సంఘాలు కూడా ఏర్పడ్డాయి. అలాంటి మనిషిని దుష్టశక్తిగా భావించడం...." అన్నాడు లింగం మధ్యలో ఆపేస్తూ.

"మంచి చేసినా చెడు చేసినా—ఆమె విధానాలు మంచివి కాదు. మనుషుల్ని రక్తం పీల్చి చంపడం అమానుషం. ప్రస్తుతం ఉన్నది తుఫానుకు ముందరి ప్రశాంతం. ఏదో రోజున ఆ శక్తి విరుచుకుపడుతుంది. అందుకే ఉపే

క్షించకూడదు. దాని ఉనికిని తెలుసుకోవాలి—"
అన్నాడు మహాదేవుడు.

"ఇంకో రెండు రోజుల్లో నేను ఆంజనేయ చక్రం వేయడం అభ్యసించగలుగుతాను. అప్పుడు మనం ఆ వసుధను బంధించడం సులభమైపోతుంది-" అన్నాడు శివశంకరం.

"రెండ్రోజులాగి మనం రాగిణిని కలుసుకుందాం. నాకా రాగిణిమీద చాలా అనుమానంగా వుంది—" అన్నాడు మహాదేవుడు.

"ఆంజనేయ చక్రం అభ్యసించడం అయేవరకూ రాగిణిని కలుసుకోడదని సిద్ధాంతమేమీ లేదుకదా— ఇప్పుడే మనం రాగిణిని కలుసుకుందాం — కొన్ని అనుమానాలు తెలుసుకోవచ్చు—" అన్నాడు లింగం.

"నువ్వు చెప్పింది బాగానే ఉంది. మనిద్దరం వెడదాం—" అన్నాడు మహాదేవుడు.

అప్పుడే కాలింగ్ బెల్ మ్రోగింది.

"ఎవరూ?" అన్నాడు మహాదేవుడు. కొద్దిక్షణాల్లో ఆ గదిలోకి ఓ యువతి ప్రవేశించింది. ఆమె ఆయాసంతో రొప్పుతోంది. ఆమె కనులు భయాన్ని సూచిస్తున్నాయి.

"ఎవరమ్మ నువ్వు?" అన్నాడు శివశంకరం.

"నేను.... నేను....వసుధను చూశాను...." అన్నదా యువతి.

ఆ యువతి నెక్కడో చూసినట్లు గుర్తించాడు లింగం. అయితే ఎక్కడ చూసిందీ అతడికి గుర్తురాలేదు. అతడామె మాటలు వినకుండా ఎగిసిపడే ఆమె గుండెల వంక చూస్తున్నాడు. అతడి మనసు వశం తప్పింది. అంతటి సౌందర్యవతి ఆమె!

అలా చూడని మహాదేవుడు, శివశంకరం మాత్రం

ఉలిక్కిపడి—"ఏమన్నావ్! వకుళను చూశావా? ఎక్కడ?" అన్నాడు. అప్పటికీ మాటలు లింగం తలకీ ఎక్కాయి. అతడూ ఉలిక్కిపడ్డాడు. మైకం వదిలి పోయింది.

"అవును—వకుళను చూశాను. ఆమె చాలా కాలంగా మా ఇంట్లోనే ఉంటోంది—అయితే ఆమె వకుళ అని నాకు తెలియదు. ఈ రోజు చూశాను. తన గదిలో ఒక గాజు జాడీ. దానినిండా ఏదో ద్రావకం. దానిలో ఆమె నగ్నంగా ఈదులాడుతోంది. ఆ దృశ్యం మహా భయంకరంగా ఉంది. నేనామెను చూశాను. నన్నామె చూడలేదు. అక్కణ్నించి ఇక్కడిదాకా ఒకే పరుగుతో వచ్చాను...." అందామె ఇంకా ఆయాసపడుతూనే.

"అయితే నువ్వు మా దగ్గర కెందుకొచ్చావ్?" అన్నాడు మహాదేవుడు.

"ఈ విషయమై మీరు పరిశోధనలు చేస్తున్నారని పత్రికల్లో చదివాను. అందరికంటే ముందుగా ఈ విషయం మీకు తెలిస్తే బాగుంటుందనిపించింది—" అందామె.

"నీ పేరు?" అన్నాడు మహాదేవుడు.

ఆమె చెప్పేలోగానే-"ఆఁ గుర్తుకొచ్చింది. జలజ!" అన్నాడు లింగం. ఒకరోజు ఈ జలజ రాగిణితో మాట్లాడుతుండగా చూశారు వాళ్ళు ముగ్గురూ.

"అవును నా పేరు జలజ. కానీ మీకెలా తెలుసు?" అనడిగిందామె ఆశ్చర్యంగా.

"ఎలాగో తెలుస్తుందిలే కానీ — మీ యింటికి వెడదామా?" అన్నాడు మహాదేవుడు.

"తీసుకు వెడదామనే వచ్చాను నేను—" అంది జలజ.

"అన్నయ్యా—నువ్వూ వస్తావా?" అన్నాడు మహా
దేవుడు.

"నేను రాను. కానీ ఆమె మీపై అత్యాచారానికి తల
పడితే ఆగకుండా ఆంజనేయ దండకం చదవండి. ఆమె
బయటకు వెళ్ళిపోయేవరకూ అలా చదువుతూ నే
ఉండండి—" అన్నాడు శివశంకరం.

ముగ్గురూ కలిసి కార్లో బయలుదేరారు. సగందారిలో
వాళ్ల కారుకు ఎదురుగా ఓ తెల్లకారు వచ్చి దారికడ్డంగా
ఆగింది. మహాదేవుడు కారు ఆపక తప్పలేదు. తెల్లకారు
లోంచి ఓ యువకుడు—ఇద్దరాడవాళ్ళు దిగారు.

ఆ యువకుడు మహాదేవుడి కారును సమీపించి—
"ఏమిటిది జలజా—ఇక్కడున్నావ్? నీతో మాట్లాడాలి-
ఒకసారి కారు దిగు—" అన్నాడు.

"అంతా చెబుతాను అన్నయ్యా!" అంటూ జలజ
కారు దిగింది.

"వీళ్లను మనింటికి తీసుకొస్తున్నావా?" అన్నాడా
యువకుడు.

"అవును. అసలేం జరిగిందంటే...."అని జలజ ఏదో
చెప్పబోతుండగా—అతడు వారించి— "అంతా నాకు
తెలుసు. నువ్వు ముందు మన కారెక్కు. నేను వీళ్లతో
మాట్లాడతాను—" అన్నాడు.

ఏమనుకుందో జలజ వెళ్ళి తెల్లకారెక్కింది. కార్లోంచి
దిగిన అమ్మాయిలిద్దరూ ఆమెకు అటూ యిటూ
కూర్చున్నారు.

ఆ యువకుడు మహాదేవుడితో — "మీరు నన్ను
మన్నించాలి. వకుళ కథను చిలవలు, పలవలు అల్లి ఎన్నో
పత్రికలు ప్రచురించాయి. అవి చదివి నా చెల్లెలు జడుసు

కుంది. దానికి మతి చెదిరింది. మామూలుగా బాగానే ఉంటుంది. ఉన్నట్లుండి — అదిగో వకుళ కనిపిస్తోంది అంటుంది. గాజు జాడీలో స్నానంచేస్తున్న వకుళ మనింట్లోనే ఉన్నదంటుంది. యెవరూ లేకపోతే ఈ కబురు యెవరికో చెప్పాలంటుంది. మీ దగ్గరకు కూడా అదలాగే వచ్చిందా?" అన్నాడు.

మహాదేవుడు ఆశ్చర్యంగా-"మీరు చెప్పింది నిజమే?" అన్నాడు.

"అనవసరంగా మా చెల్లెలు మీకు శ్రమ ఇచ్చింది. మరోసారి మన్నించమని అడుగుతున్నాను. దయుంచి మీరు వెనక్కు వెళ్ళండి—మా యింట్లో మీకు ఏమీ కనబడదు—" అన్నాడు వినోద్.

మహాదేవుడు తల అడ్డంగా ఊచి—"ఆమెకు మతి చెదిరి ఇలాంటి మాటలు చెబితే అది కూడా ఒకరకమైన జబ్బు. అలాంటి జబ్బులు కుదర్చగల శక్తి నాకుంది. ముందొక పర్యాయం నన్ను కూడా ఆమెతోపాటు మీ యింటికి రానివ్వండి. ఆమె వకుళను యెక్కడ చూశా నన్నదో అక్కడికి తీసుకువెళ్ళనివ్వండి. అప్పుడు నేనామె జబ్బు నయం చేయగలను. అయామ్ ప్రొఫెసర్ మహాదేవుడు — ఆల్సో స్పెషలిస్ట్ ఇన్ సైకియాట్రీ—" అన్నాడు.

వినోద్ తలను చిరాగ్గా ఊపి — "దాన్నిప్పుడో డాక్టర్ ట్రీట్ చేస్తున్నాడు. అది పూర్తయ్యేదాకా మరొకరి దగ్గర ట్రీట్మెంట్ చేయించడం నాకు ఇష్టం లేదు —" అనేసి జవాబుకోసం యెదురు చూడకుండా తన కారెక్కాడు. మహాదేవుడు చూస్తూండగా ఆ కారు బ్యాక్ చేసి వెనక్కు వెళ్ళిపోయాడు వినోద్.

"సార్ — ఇదంతే నాకేదో అనుమానంగా వుంది. చెల్లెలి జబ్బు గురించి అతను చెప్పినది సాకులాగున్నది తప్పితే ఆమె ఆరోగ్యం గురించి అతదేమాత్రమూ కలవర పడుతున్నట్లులేదు. నా అనుమానం—వకుళ కితడు ఆశ్రయ మిచ్చాడని—మీరా కారు ననుసరించండి. వాళ్ళిల్లు చేరి వకుళ కోసం వెతుకుదాం—" అన్నాడు లింగం.

మహాదేవుడికి లింగం చెప్పిన మాటలు సబబుగా తోచాయి. ఆయన ఆ కారును అనుసరించసాగాడు. వాళ్ళ అనుమానాలను ధృవపరుస్తూ ఆ కారు వాళ్ళను తప్పుదారి పట్టించడానికి యెన్నో సందుగొందులు తిరిగి మొత్తం మీద వాళ్ళ దృష్టినుంచి తప్పించుకుంది.

"ఆ వినోద్ ప్రవర్తన అనుమానాస్పదంగానే వుంది. మనం ఇప్పుడీ వినోద్, జలజల ఇంటి అడ్రస్ తెలుసు కోవాలి—" అన్నాడు మహాదేవుడు.

"అదేమంత పెద్ద కష్టం కాదు సార్!" అన్నాడు లింగం—"జలజ రాగిణి స్నేహితురాలు. ఆమె యిల్లు రాగిణికి తప్పకుండా తెలిసే వుంటుంది—"

ఇద్దరూ కారులో రాగిణివుండే చోటుకు వెళ్ళారు. అక్కడ రాగిణి లేదు. అయితే ఆమె వకుళ సేవా సంఘం కార్యాలయంలో ఉన్నట్లు వారికి తెలిసింది. అక్కడికి వెళ్ళారు. అక్కడ చూస్తే....

రాగిణి, జలజ మాట్లాడుకుంటున్నారు.

మహాదేవుడు, లింగంపడ్డ ఆశ్చర్యమింతా అంతా కాదు.

"నమస్కారం—రండి—రండి—" అంటూ రాగిణి వారిద్దరినీ ఆహ్వానించింది. అయితే వారిద్దరి చూపులూ జలజపైనే వుండటం గమనించి—"ఈమె మిస్ జలజ! వకుళ కథలు చదివి మతి చెదరగొట్టుకుంది. ఈమె అన్న

వినోద్ ఇప్పుడే ఈమెనిక్కడ దిగబెట్టి వెళ్ళాడు. వకుళ ప్రమాదమైన వ్యక్తి కాదనీ—ఆమె పేద ప్రజలకు ఎంతో సేవచేస్తున్నదనీ — ఆమె అభిమానులు ఆమె పేరిట అభిమాన సంఘాలు స్థాపించుకున్నారనీ ఈమెకు తెలియదు. అవన్నీ ఈమెకు చెబుతున్నాను—" అంది రాగిణి.

"మిస్ జలజా! అయితే వకుళ గురించి మాకు చెప్పిన దంతా అసత్యమా?" అనడిగాడు మహాదేవుడు గంభీరంగా.

"రాగిణీ — వీ రెవరు?" అంది జలజ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"కొద్దిసేపటి క్రితం నువ్వు మా దగ్గరకు వచ్చి వకుళను చూసినట్లు చెప్పావు. మాకు చూపిస్తానని కూడా చెప్పావు—మనమా ప్రయాణంలోనే వుండగా సగం దారిలో మీ అన్నయ్య వచ్చి...."

అని మహాదేవుడు ఇంకా ఏదో చెప్పబోతూండగా—

"అంతా అబద్ధం—" అని అరిచింది జలజ.

రాగిణి మహాదేవుడివంక సీరియస్‌గా చూసి-"ఆమెకు ఆసలే మతి చెదిరి ఉంది. మీరామెను ఇబ్బంది పెట్టకండి. మీరు వచ్చిన పనేమిటో చెబితే తెలుసుకొని నేను చేయగలిగింది చేస్తాను—" అంది.

"మిస్ జలజ ఇంటి అడ్రస్ కావాలి—" అన్నాడు మహాదేవుడు.

రాగిణి ఓ కాగితంమీద అడ్రస్ రాసిచ్చింది. జలజ వంకే చూస్తూ మహాదేవుడు, లింగం అక్కణ్ణించి సెలవు తీసుకున్నారు. అక్కణ్ణించి జలజ ఇల్లు చేరుకోవడానికి వాళ్ళకు ఎంతోసేపు పట్టలేదు.

ఇంటిదగ్గర వినోద్ ఉన్నాడు—"రండి ప్రొఫెసర్!" అంటూ ఆహ్వానించాడతను మహాదేవుణ్ని.

"ఇదే ఆహ్వానం కాసేపటి క్రితం ఇస్తే బాగుండేది మిస్టర్ వినోద్!" అన్నాడు మహాదేవుడు.

"ఏం చేయను చెప్పండి? నా చెల్లెలి మాటలు పట్టుకొని ఇల్లంతా వెతికారంటే అది అప్సెట్ అవుతుంది. వకుళ చెడ్డది కాదనీ ఆమె ఎన్నో మంచి పనులు చేస్తున్నదనీ నమ్మకం కుదిరేదాకా దానికి వకుళపట్ల ఏర్పడిన బెదురుపోదు. అందుకే నేను దానిని దాని స్నేహితురాలు రాగిణి దగ్గర దిగవిడిచి ఇంటికివచ్చి మీకు ఆహ్వానం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను—" అన్నాడు వినోద్.

"అయితే మీ ఇల్లు మాకు చూపిస్తారా?" అన్నాడు మహాదేవుడు.

"సంతోషంగా—" అని నవ్వి—"మా జలజ వకుళ అని బెదిరిపోతున్న గది కూడా మీకు చూపిస్తాను—" అంటూ వినోద్ వాళ్ళిద్దరికీ తన యిల్లు చూపించి ఆఖరున ఓ గదిలోనికి తీసుకువెళ్ళాడు. ఆ గదిలోనే జలజ వకుళను చూశానని అందరికీ చెబుతూంటుంది.

గది తలుపులు తెరువగానే మహాదేవుడు, లింగం— ఇద్దరూ నివ్వెరపోయారు.

గదిలో నాలుగుమూలలా నాలుగు గాజుజాడీలున్నవి. నిలువెత్తున్న ఆ జాడీలలో నలుగురు నగ్న యువతులు ఈదులాడుతున్నారు. గది మధ్యన ఒక మంచమున్నది. దానిమీద పరుపు కూడా ఉంది.

"ఏమిటిది?" అన్నాడు మహాదేవుడు ఆశ్చర్యంగా.

"వకుళ గురించి తెలియకముందు నా చెల్లెలి పడకగది

ఇది. ఆమె కోసం ఈ బొమ్మల్ని నేనే కొన్నాను. స్విచ్ నొక్కితే అవి ఊదులాడుతాయి. మళ్ళీ స్విచ్ నొక్కితే అవి నిశ్చలంగా ఉంటాయి—" అంటూ వినోద్ ఆ విషయం డిమాన్‌స్ట్రేట్ చేసి చూపించాడు.

"అద్భుతం—" అన్నాడు లింగం.

"కానీ నీ చెల్లెలికిదేం సరదా?" అనడిగాడు మహాదేవుడు.

"ఇలాంటి సరదాలే — దాని కొంప ముంచాయి. వకుళ గురించి విన్నప్పట్నుంచీ — ఆమెకిలాంటి గాజు జాడీలే ఉన్నవని తెలిసినప్పట్నించీ — జలజకీ గాజు జాడీల్లో బొమ్మలకు బదులు వకుళ కనిపిస్తోంది. అవి తను సరదాగా పెట్టుకున్న విషయం మరిచిపోయి వకుళ తన యింటిని ఆవహించినదనుకొంటోంది. అదృష్టంకొద్దీ పూర్తిగా మతిపోలేదు—" అన్నాడు వినోద్.

"అలాంటప్పుడు గదిలోంచి వీటిని తీయించేయొచ్చుగా—" అన్నాడు మహాదేవుడు.

"అలాచేస్తే-ఇదంతా ఒకనాటి దాని సరదాయేనన్న విషయం దానికెలా గుర్తుంటుంది?" అన్నాడు వినోద్.

"ఒక చిన్న ప్రయోగం—" అన్నాడు మహాదేవుడు. అంటూనే ఆయన ఆంజనేయ దండకం చదవడం ప్రారంభించాడు.

"స్టాపిట్!" అంటూ అరిచాడు వినోద్.

మహాదేవుడు దండకం ఆపలేదు.

"ఐ సే స్టాపిట్!" అంటూ అరిచాడు వినోద్.

మహాదేవుడు ఆపలేదు.

ఉన్నట్టుండి వినోద్ గదిలోంచి పరుగు పెట్టాడు. మహాదేవుడు కూడా వినోద్ ననుసరించి పరుగెడుతూనే

దండకం చదవసాగాడు. ఇద్దరూ అలా కొంతదూరం పరుగెత్తాక వినోద్ ఆయాసంతో వగరుస్తూ ఒకచోట ఆగిపోయి భయంకరంగా కేక పెట్టాడు.

మహాదేవుడు అతణ్ని సమీపించి—"అంటే నువ్వు వకుళ ఏజంటువన్న మాట!" అన్నాడు.

"నో!" అంటూ అరిచాడు వినోద్.

"ఆంజనేయ దండకం చదివితే నీకంత బాధ ఎందుకు?"

"ఏమో—నాకు తెలియదు—"

మహాదేవుడు సూటిగా వినోద్ కళ్ళలోకి చూసి—"మిస్టర్ వినోద్! వకుళ నీ రక్తం తాగిందా?" అనడిగాడు.

"నో—అసలు వకుళను నే నెన్నడూ చూడలేదు—" అన్నాడు వినోద్.

"అబద్ధం. నువ్వు వకుళను చూశావు. ఆమె నీ రక్తం తాగింది. నువ్విప్పుడామె బానిసవు. నీకా బానిసత్వం నుంచి విముక్తి కావాలంటే నాతో రా!" అన్నాడు మహాదేవుడు.

వినోద్ ఏమీ మాట్లాడలేదు.

"మధు ఇంటికి తీసుకువెడదామా ఇతన్ని"- అన్నాడు లింగం.

"అక్కడికే—" అని నవ్వాడు మహాదేవుడు.

"నాకిష్టంలేని చోటికి నన్నెవ్వరూ తీసుకెళ్ళలేరు—" అన్నాడు వినోద్.

వినోద్ కోపంగా మహాదేవుడి వంక చూశాడు. మహాదేవుడు ఆగకుండా దండకం చదవడం ప్రారంభించాడు. వినోద్ ఉత్సాహంగా వింటూ నవ్వసాగాడు.

మహాదేవుడి గొంతు పెరిగినకొద్దీ అతని నవ్వు కూడా పెరిగింది.

అలా చాలాసేపు మహాదేవుడు దండకం చదువుతూనే ఉన్నాడు.

"సార్—ఇంక ఆపేయండి. అతను లొంగడంలేదు-" అన్నాడు లింగం.

మహాదేవుడు దండకం ఆపేశాడు. వినోద్ నవ్వు ఆపేశాడు.

"ప్రొఫెసర్—విజ్ఞానశాస్త్రం ముందంజ వేస్తోంటే మీ బుద్ధి వెనుకడుగు వేస్తోంది. మంత్రాలకు చింత కాయలు రాలవు. మీరు వెళ్ళి మీ పరిశోధనలు చూసుకోండి—" అన్నాడు వినోద్.

మహాదేవుడు అక్కణ్ణించి కదిలాడు. దారిలో ఆయన లింగంతో—"వినోద్ వకుళ ఏజెంటు అన్న విషయంలో సందేహంలేదు. ఈ విషయం నరోత్తమరావుకు చెబితే—తర్వాత అతడే చూసుకొంటాడు. అయితే ఒకసారి దండకానికి భయపడ్డవాడు మళ్ళీ యెందుకు పడలేదా? అని ఆశ్చర్యంగా వుంది—" అన్నాడు.

"సార్ మీరేమీ అనుకోనంటే ఒక్క మాట! అతను, జలజ కలిసి మనని టీజ్ చేయడానికి అంటే ఏడిపించడానికి ప్రయత్నిస్తున్నారేమోనని నా అనుమానం. వీళ్ళకు వకుళతో సంబంధమూ లేదు, మంత్రశక్తులపై నమ్మకమూ లేదు. కాలక్షేపం కోసం మనతో ఆడుకుంటున్నారు" అన్నాడు లింగం.

"నువ్వు చెప్పింది ఆలోచించదగ్గ విషయమే!" అన్నాడు మహాదేవుడు సాలోచనగా.

# 31

ఈలోగా జోగారావు ఇంట్లో కొన్ని విచిత్రాలు జరుగసాగాయి.

శారద అక్క సూర్యావతి తనకు లేక లేక పుట్టిన మగ పిల్లాడితో వచ్చి వారింట మకాం పెట్టింది. సూర్యావతి భర్త షణ్ముఖరావుకా యిల్లు సదుపాయంగానే అనిపించి కొంతకాలంపాటు అక్కడే ఉండాలని తీర్మానించుకున్నాడు.

చంటిపిల్లవాడి అవసరాలు చూడ్డానికిగా సూర్యావతి ఒక పనిపిల్లను పెట్టుకొన్నది.

పనిపిల్ల పేరు మంగమ్మ. వయసు పదహారేళ్ళు. కానీ చక్కని అవయవ పుష్టితో అది ఇరవై ఏళ్ళదానిలా ఉంటుంది. దానికి పెళ్ళికాలేదని అంటుంది కానీ చూసిన వాళ్ళంతా పెళ్ళయినదానిలా ఉంటుందని అంటారు. మగాళ్ళు దానికేసి ఒక్కసారి చూసి వూరుకోలేరు. ఏకాంతంలో దొరికితే చెయ్యి పట్టుకోలేకుండా వుండలేరు.

మంగమ్మ పని యెంతో శ్రద్ధగా చేస్తుంది. ఆ వీధిలో అది మంచి పేరు సంపాదించుకొని అయిదారిళ్ళు కుదుర్చుకొంది. మధు యింట్లో కూడా అది పనిచేసేది.

పెళ్ళి కాని మధు కళ్ళు దానిమీద పడ్డాయి. తల్లి స్నానాల గదిలో ఉండగా అది యిల్లూడుస్తూంటే అతనోసారి దాని చెయ్యి పట్టుకొన్నాడు. అది అతడికేసి కోపంగా చూసింది.

మధు హడలిపోయాడు. తల్లికి చెబుతుందేమోనని కాస్త వణికాడు కూడా.

“అలా వణికిపోయేవాడివి — చెయ్యెందుకు పట్టు

కొన్నావ్?" అంది మంగమ్మ కొంటెగా నవ్వుతూ.
ఆమె కొంటె నవ్వు మధుకు ధైర్యాన్నివ్వగా చటుక్కున
ఓ అడుగు ముందుకువేసి దాని ముఖంపైకెత్తి ముద్దు పెట్టు
కొన్నాడు.

"తియ్యగా ఉంది—" అంది మంగమ్మ.

ఆ తర్వాత వాళ్ళు తియ్యటి ముద్దులూ, వెచ్చటి
కౌగిళ్ళూ, కమ్మటి సౌఖ్యాలూ చాలా అనుభవించారు.
ఉద్యోగంలేని—పనిలేని పెద్దమనిషి మధు. అతడి తల్లికి
వీధి పెత్తనాలు యెక్కువ. తండ్రి తరచుగా టూర్లలో
ఉంటాడు. అందువల్ల యింట్లో మంగమ్మతో అతడికి
చాలా అనుభవాలే దొరికాయి.

మధు విషయంలోనే కాక మంగమ్మ మిగతా ఇళ్ళల్లో
కూడా మగాళ్ళ విషయంలో చూసీచూడనట్లూరుకొని
వాళ్ళ అభిమానం సంపాదించుకొంది. జోగారావుకీ,
షణ్ముఖరావుకీ కూడా అదంటే ఆశ ఉంది. అది
వాళ్ళదగ్గర పని బాగా చేస్తుందని పేరు తెచ్చుకొంది.

కోడి కూయకుండా వచ్చి—రాత్రి పడుకొనేదాకా
అది ఆ వీధిలోనే ఉండేది. అన్ని ఇళ్ళల్లో పనిచేస్తూ—
తీరిక దొరికినప్పుడల్లా అది సూర్యావతి కొడుకు విషయమే
చూసుకొనేది. పిల్లాడు దాని దగ్గర బాగా ఆడుకొనే
వాడు. వాడికిప్పుడు అయిదో నెల పడుస్తోంది.

ఒక రోజున సూర్యావతి, శారద కూర్చుని కబుర్లు
చెప్పుకొంటూంగా చంటిపిల్లాడు కెవ్వుమన్న కేక వినిపిం
చింది. సూర్యావతి కంగారుపడి అక్కణ్నించి లేచి
పరుగెత్తింది. ఆమె బిడ్డ ఉన్నచోటికి వెళ్ళి అక్కడ
దృశ్యం చూసి మ్రాన్పడిపోయింది.

మంగమ్మ చంటిపిల్లాడికి పాలిస్తోంది.

"ఏమిటే—నువ్వు చేస్తున్న పని?" అని గద్దించింది సూర్యావతి. మంగమ్మ ఉలిక్కిపడి — దొరికిపోయిన దొంగలా మాట్లాడలేదు.

"ఎన్నాళ్ళనుంచీ ఈ పని?" అంది సూర్యావతి.

మంగమ్మ మాట్లాడలేదు.

"అడ్డమైన వాళ్ళతోటీ తిరుగుతారు. బిడ్డ పుడితే బయట పారేస్తారు. ప్రకృతి వూరుకోదు. ఆ కోరికలు ఇలా తీర్చుకుంటారు. లేకపోతే పెళ్ళికానిదానివి—నువ్వు పిల్లాడికి పాలివ్వడమేమిటి? అయినా నా బిడ్డడికి నువ్వు పాలివ్వడమేమిటి? వాడికన్నీ నీ బుద్ధులే?" అంటూ గద్దించింది సూర్యావతి.

"తప్పైపోయింది — మన్నించడమ్మా—" అంటూ మంగమ్మ సూర్యావతి కాళ్ళు పట్టుకుంది.

"ఊఁ సరేలే—" అంది సూర్యావతి. పిల్లాడేదో కావ్వమని ఏడిస్తే తనక్కడకు వచ్చానన్న విషయం ఆమె మరిచిపోయింది. ఎందుకేడ్చాడో అడగాలని కూడా తోచలేదు.

మర్నాడు మగాళ్ళిద్దరూ ఆఫీసులకీ, పిల్లలిద్దరూ స్కూళ్ళకీ వెళ్ళాక—సూర్యావతి స్నానానికి వెళ్ళింది. పిల్లాడు ఏడుస్తూంటే శారద వాణ్ని వళ్ళో వేసుకొని ఊపసాగింది. యెంత ఊపినా వాడు ఏడుపు ఆపడం లేదు. ఆఖరికి శారద విసిగిపోయి—"పెంకి వెధవా—ఏంచేస్తే ఊరుకొంటావురా—" అంది.

"నాకాకలేస్తూంటే పాలుకలిపి పెట్టాలని తెలియదూ-పైగా పెంకి వెధవా అంటావ్?" అంటూ గద్దించాడా చంటిపిల్లాడు.

"వేలెడు లేడు—ఎంతమాటన్నాడు?" అనుకొని

హఠాత్తుగా ఉలిక్కిపడింది శారద.

ఇప్పుడు మాట్లాడిం దెవరు?—చంటిపిల్లాడు కదూ!... నిండా అయిదు నెలలు లేని వాడు నోరు విప్పి మాట్లాడేడా? ఇది కలా, నిజమా?

ఆమె సంభ్రమాశ్చర్యాలతో చంటిపిల్లాడికేసే చూడ సాగింది.

"అలా చూస్తావేమిటి? వెళ్ళి పాలుకలిపి తీసుకురా-" అంటూ గద్దించాడా పిల్లాడు మళ్ళీ.

శారద హడలిపోయి — పిల్లాణ్ని వళ్ళోంచి కిందకు దొర్లించేసింది. వాడు గుక్కపట్టి ఏడ్వసాగాడు. ఆమె పరుగునవెళ్ళి స్నానాల గది తలుపుతట్టి — "అక్కా నాకు భయంవేస్తోందే?" అంది.

"ఏమయింది? అవతల కుర్రాడింకా ఏడుపు మానినట్లు లేదు—" అంది సూర్యావతి లోపల్నుంచి.

"అవునే—వాడు మాట్లాడుతున్నాడు. ఆకలేస్తోంది-పాలు కలిపి పట్రావాలని తెలియదా అని దెబ్బలాడుతున్నాడు—" అంది శారద వణుకుతున్న కంఠంతో.

సూర్యావతి చటుక్కున తువ్వాలు తడివంటికి చుట్టబెట్టుకొని తలుపు తీసుకొని బైటకు వచ్చింది.

"ఏమిటే—నువ్వనేది? నీకేమైనా మతిపోయిందా? అయిదు నెలల కుర్రాడు నోరు తెరిచి పాలు కావాలని అడగడమేమిటి?" అంది సూర్యావతి.

"ఏమో బాబూ—నాకు భయంవేస్తోంది. నువ్వెళ్ళి నీ పిల్లాణ్ని చూసుకో—" అంది శారద.

సూర్యావతి ఆత్రుతగా కొడుకును చూసుకోడానికి వెళ్ళింది. వాడలా గుక్కపట్టి ఏడుస్తూనే ఉన్నాడు.

"ఛీ—ఏం మనిషి—ఏదో భ్రమలో భయపడి—

చంటిపిల్లాణ్ణిలా వదిలేసిందో-" అనుకొంది సూర్యావతి. ఆమె అప్పటికప్పుడు వాణ్ణి వడిలోకి తీసుకొని పాలివ్వసాగింది. పిల్లాడు ఆకలితో ఉన్నవాడిలా పాలు తాగసాగాడు—"వెర్రి వెధవకి-యెంత ఆకలేసిందో ఏమో-" అనుకొంటూ సూర్యావతి ఆప్యాయంగా వాడి తల నిమిరింది. ఆమె యెంత పిలిచినా శారద మాత్రం చాలా సేపటివరకూ ఆ గదిలోనికి రాలేదు.

చంటిపిల్లాడు పాలు త్రాగి నిద్రపోయాడు. తను భ్రమపడిందో—పిల్లాడు నిజంగా మాట్లాడాడో శారదకు అర్థంకాలేదు. వాడి మాటలు తను స్పష్టంగా విన్నది. వాడు ఎలా మాట్లాడగలిగాడు?

సూర్యావతి మాత్రం శారద మాటల్ని పూర్తిగా కొట్టిపారేసింది. నీదంతా ఉత్త భ్రమ అన్నదామె. శారద మాత్రం వాణ్ణి ఎత్తుకుందుక్కూడా భయపడుతోంది.

రెండు మూడు రోజులు మళ్ళీ ఏ విశేషాలూ జరుగలేదు. శారద భయం క్రమంగా తగ్గింది. పిల్లాడినామె కాస్త చేరదీయసాగింది. ఒక రోజున ఇంట్లో అంతా లేనిసమయంలో—సూర్యావతి చీర అంచులు కట్టించుకు వస్తానని-ఆ వీధిలో కుట్టుమిషనున్న పొరుగింటికి వెళ్ళింది. శారద మగతగా పడుకుంది. చంటిపిల్లాడామె పక్కనే ఉన్నాడు.

ఉన్నట్టుండి శారదకేదో అనుమానం వచ్చి చూసేసరికి పక్కలో పిల్లాడులేడు. ఏమయ్యాడు వాడు? ఎవరైనా యెత్తుకుపోలేదుకదా — అనుకొంటూ ఆమె కంగారుగా బాబూ, బాబూ అంటూ ఇల్లంతా కలయదిరిగి వంటింట్లోకి వచ్చి చూసి నిశ్చేష్టురాలై పోయింది.

ఆమె వెళ్ళేసరికి అక్కడ బాబు గ్లాసులో చెంచా పెట్టి పాలు కలియబెడుతున్నాడు. అంటే అప్పటికి ఫ్లాస్కులోని వేడినీళ్ళు గ్లాసులోకి వంపి అందులో పాల పొడి కలిపి కలయబెట్టడం అయింది. ఆమె చూస్తూండగా బాబు గ్లాసులోని పాలను పాలసీసాలోకి పోసి—దానికి పాల పీకను తగిలించాడు. వాడు వెనక్కి తిరగ్గానే శారద పక్కకు తప్పుకున్నది. వాడు తిన్నగా నడుచు కుంటూ మంచందాకా వెళ్ళి మంచంమీద పడుకొని పాలసీసాలో పాలు తాగుతున్నాడు. ఈ దృశ్యం మాత్రం చంటిపిల్లాడు పాలు తాగుతున్నట్టే ఉంది.

శారద గదిలోపలకు వెళ్ళింది. చంటిపిల్లాడు ఏమీ ఎరగనట్టుగా పాలు తాగుతున్నాడు. కులాసాగా ఆడు కుంటూ పాలు తాగుతున్న ఆ కుర్రాణ్ని చూస్తే శారదకు చాలా భయంవేసింది. ఆమె అక్కణ్నించి వెనుదిరిగి ఇల్లు వదిలి పొరిగింటికి వెళ్ళి — "నేనిక్కడుంటాను. నువ్వు ముందు ఇంటికి వెళ్ళు—" అంది.

"ఏమయిందే?" అనడిగింది సూర్యావతి.

అయితే శారద అప్పుడేమీ చెప్పలేదు. అక్కడ చీర అంచులు కుట్టడమయ్యాక ఇంటికి వెళ్ళి జరిగినదంతా చెప్పింది. అంతా విని సూర్యావతి మండిపడి—"నిక్షేపం లాంటి కుర్రాడు నీకు దెయ్యంలా కనబడుతున్నాడా?" అంది.

"నాకేం వాడిమీద పగా అబద్ధాలు చెప్పడానికి? ఉన్నమాటే అంటున్నాను—" అంది శారద.

"అయితే ఏమిటంటావ్?" అంది సూర్యావతి.

"పిల్లాడికి ఆ మధు తల్లిచేత తాయెత్తు కట్టిస్తే

మంచిది —" అంది శారద.

చెల్లెలి మాటల్లో నమ్మకం కుదరకపోయినా తాయెత్తు కట్టిస్తే నష్టంలేదనుకుంది సూర్యావతి. ఆమె పిల్లాణ్ని తీసుకుని మధు యింటికి వెళ్ళింది. మధు తల్లి అంతా విని—"కుర్రాడిలో దోషముంటే తాయెత్తు దానంతటదే వెళ్ళి వాడి భుజాలను చుట్టుకుంటుంది—" అంటూ అప్పటి కప్పుడు ఓ తాయెత్తును తయారుచేసింది. అయితే అది ఎగిరి కుర్రాడి భుజాలను తాకలేదు. అసలా తాయెత్తులో చలనమేలేదు.

"పోనీ-కుంకం పెడతానమ్మా-కుర్రాడిలో దోష మేమీ లేదు—" అంది మధు తల్లి. పిల్లవాడి నొసటన ఆమె కుంకుమ వుంచింది. పిల్లవాడు ఏ గొడవా చేయకుండా ఆడుకుంటున్నాడు.

సూర్యావతి జరిగినదంతా చెల్లెలికి చెప్పి—"నీకు నా పిల్లాడంటే అయిష్టమెందుకేర్పడిందో నాకర్థం కాకుండా ఉంది. నీకిష్టంలేకపోతే చెప్పు—వేరే యిల్లు చూసుకుంటాం—" అంది.

"ఎందుకే అలా నిష్ఠూరపడతావు?" అంటూ నొచ్చుకుంది శారద. తాయెత్తు చంటిపిల్లాడికెందుకు అవసరపడలేదో ఆమెకర్థంకాలేదు. కనీసం కుంకుమవల్లనైనా కొంత ప్రయోజనముండగలదని ఆశించిందామె.

ఆ రోజు సాయంత్రం అక్కాచెల్లెళ్ళు దొడ్లో కబుర్లు చెప్పుకుంటున్నారు. పిల్లలాడుకుందుకు బైటకుపోయారు. మగాళ్ళిద్దరూ ఇంటి అరుగులమీద కూర్చుని కబుర్లాడుకుంటున్నారు.

చంటిపిల్లాడిని మంచంమీద పడుకోబెట్టి అక్కాచెల్లెళ్ళు నూతి దగ్గర చేరారు. మంగమ్మ కొన్ని బట్టలు

చూడించి అక్కడ పెట్టింది. వాటిని వాళ్ళు ఆరవేయాల్సి ఉంది.

"ఒక్క నిమిషం ఆగు. నేను బాత్రూంకి వెళ్ళి వస్తాను—" అంది సూర్యావతి. ఆమె చెంబులో నీళ్ళు తీసుకొని—"నేను వచ్చేసరికి — కాళ్ళు కడుక్కుందుకు ఒక్క బకెట్ నీళ్ళు లాగి ఉంచుమా—" అంది. శారద అలాగేనని నూతిలో చేద వేసింది.

సూర్యావతి కనుమరుగు కాగానే చంటిపిల్లాడు మంచంమీంచి లేచి చకచకా నూతిగట్టుమీదకు వచ్చి శారద రెండు కాళ్ళుపట్టి లాగాడు. చేద నూతిలో పడింది. శారద నూతిపళ్ళెంమీద పడిపోయింది. ఆమె పెద్దగా కేకలు పెడుతూ—చకచకా పారిపోయి మంచం మీద పడుకుంటున్న చంటిపిల్లవాడిని చూసింది.

ఆమె కేకలు విని నలుగురూ చేరారు. శారద తన అనుభవం చెప్పింది.

అమాయకంగా నవ్వుతూ ఆడుకుంటున్న చంటిపిల్లాడి గురించి ఆమె చెప్పింది ఎవరికీ నమ్మశక్యం గాలేదు. ఈలోగా సూర్యావతి కూడా వచ్చింది. ఈ పర్యాయం ఆమె కోపాన్నణచుకోలేకపోయింది.

"ఏమండీ—మనమిక్కడుండడం వీళ్ళకిష్టంలేదు. అసలిన్నాళ్ళుండడమే పెద్ద తప్పు. అర్జంటుగా వేరే ఇల్లేదైనా చూడండి. వెళ్ళిపోదాం—" అందామె భర్తతో.

"అలా తొందరపడకండి వదినగారూ—మీ చెల్లాయి నేదో దుష్టశక్తి పీడిస్తోంది. ఇదివరలో ఇలాంటి కబుర్లే చెబితే—మేము ఉత్తుత్తి కబుర్లని చెప్పి తీసిపారేశాం. తీరా చూస్తే అవన్నీ నిజమే? మనం నిలకడమీద నిజం తెలుసుకోవాలి. మీరు వెళ్ళిపోతానంటే మా పిల్లలమీద

ఒట్టు—" అన్నాడు జోగారావు.

షణ్ముఖరావు జోగారావు భుజంతట్టి — "అన్యథా భావించకండి. లేకలేక పుట్టిన మా అబ్బాయిని దెయ్యంగానో, పిశాచంగానో ప్రచారంచ స్తే మాకు బాధగా ఉంటుంది. కొంతకాలం మేము వేరేవుంటాం" అన్నాడు.

అలాగన్న రెండు రోజులకో యిల్లు దొరికింది షణ్ముఖరావుకి. వాళ్ళు వెంటనే ఇల్లు మారిపోయారు. వాళ్ళలా చేసినందుకు శారద యెంతో బాధపడింది. జోగారావు ఓదార్చాడు.

ఆ రోజు రాత్రి శారద, జోగారావు నిద్రపోతూండగా శారదను యెవరో తట్టిలేపినట్లయింది. ఆమె ఉలిక్కిపడి లేచి చూసేసరికి సూర్యావతి కొడుకు కనపడ్డాడు. ఆమె కెవ్వున అరవబోతే నోరు నొక్కేశాడు. వాడికెంత బలమో — ఆమె కదలలేకపోయింది. వాడామెను విసురుగా మంచంమీంచి విసిరేసి అక్కణ్ణించి పారిపోయాడు.

కాసేపటికి జోగారావు లేచేసరికి శారద మంచంమీద లేదు. దూరంగా కుప్పలా పడివున్న ఆమెను చూశాడు. పరుగున వెళ్ళాడు. నుదురుకు దెబ్బతగిలినట్లుంది. రక్తం కారి గడ్డకట్టింది. ఆమెకు స్పృహ ఉన్నట్లులేదు.

జోగారావు ఆమెను కుదిపాడు. ఓ రెండు నిమిషాల్లో ఆమెకు స్పృహ వచ్చింది.

"ఏం జరిగింది?" అనడిగాడు జోగారావు.

శారదకు విషయం గుర్తురావడానికి కాసేపు పట్టింది. గుర్తు రాగానే ఆమె వణికిపోయి—"మా అక్క కొడుకు నామీద పగబట్టాడండీ — ఇందాకా వచ్చి నన్ను మంచంమీంచి లాగి విసిరేశాడు—" అంది.

జోగారావుకు ఏం చేయాలో తెలియలేదు. శారద భ్రమపడుతోందో—నిజంగా ఆమె చెప్పేవన్నీ జరుగుతున్నాయో తెలియడంలేదు.

"వాళ్ళు మనకు దూరంగా వెళ్ళిపోయారుగదా—ఇక్కడికెలా వచ్చాడు?" అన్నాడు జోగారావు.

"దెయ్యపు వేషం—ఎలాగైనా రాగలడు?" అంది శారద.

"సరే—చూద్దాముండు—" అంటూ ఆమెను తీసుకుని జోగారావు ఇంట్లో వెతకడానికి బయలుదేరాడు. శారద ముందు రానన్నా — ఒక్కర్తీ గదిలో ఉండడానికి భయపడి అతడితో వెళ్ళింది.

ఇద్దరూ వీధితలుపులు పరీక్షించారు. వేసినవి వేసినట్లే ఉన్నాయి. దొడ్డివైపు తలుపులు వేసేవున్నాయి. పిల్లలు గదిలో వాళ్ళు నిశ్చింతగా నిద్రపోతున్నారు. ఇంట్లో యెక్కడా ఎవ్వరూ లేరు. ఇంక పడుకగది ఒక్కటి మిగిలివున్నది. అందులో షణ్ముఖరావు, సూర్యావతి పడుకునేవారు. కానీ ఈ రోజు మాత్రం శారదకు ఎందుకో ఇదివరకటి పడుక, ఆ వాతావరణం గుర్తుకు వచ్చాయి.

"ఆ గదిలో చూడొద్దండీ—" అంది శారద.

"ఎందుకని?" అన్నాడు జోగారావు.

"నాకు భయంవేస్తోంది—" అంది శారద.

జోగారావు నవ్వి—"నీ భయం పోగొట్టడానికే ఆ గది తలుపులు తెరుస్తాను—" అంటూ గది తలుపులు తీశాడు. తలుపు పక్కనే స్విచ్ వున్నది. అది ఆన్ చేయగానే గదంతా ప్రకాశవంతమైంది. శారదమాత్రం కళ్ళు తెరవలేదు. దీపం వేయగానే ఆమె కళ్ళు మరింత

గట్టిగా మూసుకున్నది.

జోగారావు గదిలోకి చూస్తూ ఉన్నట్లుండి ఓ పెద్ద కేక పెట్టాడు. అతని కేక విని హడలిపోయిన శారద "ఏం జరిగిందండీ—" అంటూ తనూ కళ్ళు తెరిచిచూసి కెవ్వున కేక పెట్టింది. ఆ కేకకు పక్క గదిలో నిద్ర పోతున్న పిల్లలిద్దరూ పరుగున లేచివచ్చి అక్కడి దృశ్యం చూసి బెంబేలెత్తిపోయి కేకలు పెట్టారు.

వకుళ గది గుమ్మానికి తిన్నగా గోడకానుకుని ఓ ఆకారం నిలబడివుంది. ఆ ఆకారం రెండు చేతులూ ముందుకు జాపివుంది. దాని చేతిలో ఓ తల వుంది. ఆ తల రెండు కళ్ళూ తెరిచి ఉన్నాయి. ఆకారానికి తలలేదు.

ఆకారం చేతుల్లోని తల కోదండానిది!

## 32

"మధూ—!" గుసగుసలాడుతున్నట్లుగా పిలుపు.

మధు ఉలిక్కిపడి లేచాడు. అతడి కళ్ళు కిటికీవంక చూశాయి అప్రయత్నంగా. అక్కడ వకుళ వుంది. జుట్టు విరబోసుకొని—మోహినిలా నవ్వుతూ—మధూ అని పిలుస్తోంది.

మధు లేచి—దొడ్లోకి వచ్చి ఆమెను సమీపించాడు. ఆమె వెనుకడుగు వేసింది.

అతనామెను తాకడానికి ప్రయత్నిస్తూ ముందడుగు వేశాడు. వకుళ వెనుకడుగు వేసింది.

అలా ఇద్దరూ ఓ చెట్టుక్రిందకు వెళ్ళారు.

ఆమె పైకి ఎగురగలదని మధుకు తెలుసును. అందుకే అతడామెను ఈలోగానే అందుకోబోయాడు. అయితే వకుళ ఊహించని విధంగా ముందుకు వచ్చి—అతడిని తన కౌగిలిలో బంధించింది.

"ఏమిటిది వకుళా — నా ఊపిరి సలపడంలేదు—" అన్నాడు మధు.

వకుళ నవ్వింది—ఎప్పటిలాగా—నిమ్మదిగా భయంకరంగా! అప్పుడామె మధుని వదిలిపెట్టింది. అతడప్పుడు కదలడానికి కూడా అశక్తుడయ్యాను. వకుళ ఉన్నట్టుండి మధు చేయి అందుకొని మణికట్టునుంచి భుజంవరకూ నాకింది. అప్పుడు....

"తాగు వకుళా—నా రక్తం తాగు....నా శరీరంలో ఒక్క చుక్క రక్తం మిగలకపోయినా బాధపడను. ఈ ఆనందం కోసం నేను ఏమైపోయినా బాధపడను—" అన్నాడు మధు.

"నీ కోరిక ఈ రోజు తీరుతుంది మధూ!" అంది వకుళ మధ్యలో ఒకసారి ఆగి.

"ఊఁ క్విక్—ప్లీజ్ వకుళా....క్విక్—" అన్నాడు మధు.

"అలాగేలే — నీతో కాసేపు కబుర్లాడాలని ఉంది నాకు. ఈ రోజు మనిద్దరం ఇలా కలిసి కబుర్లు చెప్పుకునే ఆఖరి రోజు. నీలాంటి వాళ్ళందర్నీ అంతం చేసి కొత్త జీవితం ప్రారంభించబోతున్నాను. అదెలాంటిదో తెలుసుకుంటావా మధూ!"

"చెప్పు—"

"రెండౌన్సుల రక్తంతో తృప్తిపడే రోజులు పోతున్నాయి. రోజుకొక మనిషిని రక్తం పీల్చి ఆనందిస్తాను. ప్రపంచంలో ఏ మనిషినీ సుఖంగా ఉండనివ్వను. దేశదేశాల్లో కలకలం సృష్టిస్తాను. నన్నెవ్వరూ ఎదుర్కోలేరు. ఏ మారణాయుధమూ నన్ను నాశనం చేయలేదు-" అంది వకుళ.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 5 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

